# నవభారతి

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సెప్టెంబరు 1958



మూల్యం : రూపాయి

నవభారతి కార్యాలయం
గాంధీనగరం ★ విజయవాడ-2

గౌరవ సంపాదకులు :

పి. వి. రాజమన్నారు

విశ్వనాథ సత్యనారాయణ

బెజవాడ గోపాలరెడ్డి

కల్లూరి చంద్రమౌళి

నార్ల వెంకటేశ్వరరావు

★

ప్రధాన సంపాదకులు :

...చ్చయ్య

★

సంపాదకులు :

జె. రాధాకృష్ణ రెడ్డి

★

సహాయ సంపాదకులు :

కె. అచ్చమాంబ

దేవులపల్లి రామానుజరావు

వి. వేంకటరామశాస్త్రి

అ. పైడిరాజు

పెద్దింటి రామస్వామి

రెంటాల గోపాలకృష్ణ

కొమఱ్ఱాజు వినాయకరావు








## ...సూచిక



## చి త్ర ము లు



తలంబ్రాలు

★

చిత్ర శిల్పి :

శ్రీమతి శ్యామ సుందరీ దేవి

★

# నవభారతి

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి 1 | విజయవాడ ★ సెప్టెంబరు 1958 | సంచిక 4


## విద్యాబోధన - మాతృభాష

భారతదేశం సుసంపన్నం కావాలి. భారతీయులందరూ సుఖసౌభాగ్యాలనుభవించాలి. ఇది అందరూ అంగీకరించిన విషయం. అయితే దీనిని ఆచరణలో సుసాధ్యం చేయాలి. అందుకు అందరి సహకారమూ కావాలి. అందరి సహకారమూ పొందటానికి దేశంలోని అందరి శక్తిసామర్థ్యాలనూ అంచనా వేయాలి. అందరికీ ఉన్న ఆర్థిక సంపత్తును అర్థం చేసుకోవాలి. మనకున్న ఆర్థిక సంపత్తులో ఎంత భాగం భవిష్యత్తులో ప్రయోజనాన్ని పొందడానికి వెచ్చించగలమో నిర్ణయించుకోవాలి. ప్రజలకు ఉన్న శక్తి సామర్థ్యాలను ఎంతవరకు మనం వినియోగించుకోగలమో యోచించుకోవాలి. మానవ శక్తిసామర్థ్యాలనూ మనం పెట్టుబడిపెట్టే ఆర్థిక సంపత్తునూ సద్వినియోగం చేయడానికి ఏ ఏ బాధ్యతలు ఎవరెవరు ఎంతెంత నిర్వహించగలరో నిశ్చయించుకోవాలి. ఒక్కొక్క రంగానికి వారివారి శక్తి సామర్థ్యాలను వినియోగించగలిగిన నేర్పరితనాన్ని గమనించి మానవ శక్తి సామర్థ్యాలనూ ఆర్థిక సంపత్తునూ సద్వినియోగం చేయడానికి నిర్మాణాత్మకమైన సూచనలివ్వాలి.

ఇది ఎవరు ఇవ్వాలి ? ఎలా ఇవ్వాలి ? ఎందుకివ్వాలి ? ఇది ఇచ్చినందువల్ల వచ్చే ప్రయోజనం ఏమిటి ? అన్న ప్రశ్నలకు సమాధానం జాతీయ ప్రణాళికా సంఘంవారు సూచించిన పద్ధతి మాత్రం కాకుండా వుండాలి. వారు సూచించిన సూచనలు దేశహితాన్ని దృష్టిలో ఉంచుకొని చేసినవి కావనిమాత్రం మేమనటం లేదు. అయితే అవి మానవశక్తినీ, ఆర్థిక సంపత్తునూ సరిచూచి, స్పష్టమైన నిర్మాణ రూపంలో చిత్రింపబడినవి కావని మాత్రమే మా అభిప్రాయం.

దేశం సుసంపన్నం కావాలంటే, విద్య, విజ్ఞానం, ఆరోగ్యం, ఆయుష్యం, పౌరసత్వం; కర్తవ్యం - ఇవన్నీ కలిగిన జాతీయ సంస్కృతి కావాలి. ఇందుకు విద్యావిధానం సంస్కరించబడాలి. ఉన్నత మధ్యమ సామాన్య పౌరధర్మ నిర్వచనతో కూడిన విద్యాబోధన కలిగివుండాలి: ఇది మనకీనాడు లేదని చెప్పక తప్పటంలేదు.

అందరూ విద్యావిధానం మారిపోవాలని మాత్రం అంటున్నారు. ఎవరూ విద్యావిధానం ఇలా మారితే ఈ ప్రయోజనం పొందవచ్చునని వివరించటంలేదు. విద్యావిధానాన్ని సంస్కరించటంలో మార్పుకు సంబంధించిన వివరాలను స్పష్టం చేయనంతవరకూ విద్యావిధానంలో మార్పురాదు. ఏమార్పు దేశానికి హితకర

మైనదో స్పష్టం చేయగలిగిన విద్యావిధానం రూపొందించనంతవరకూ విద్యాసంస్కరణ జరగాలన్న వాదం నిరర్థకం కాక తప్పదు.

గాంధీజీ ప్రాతిపదిక విద్యావిధానం అని ఒకటి రూపొందించాడు. దానిపై విశ్వాసం దేశంలో ఎవరికీ కలగటంలేదు. ఇది ఎందువల్ల కలగటంలేదో ఎవరూ ఆలోచించటంలేదు. పదేండ్లపాటు దేశంలో ఒక కొత్తపద్ధతిలో విద్యాప్రబోధం జరిగినా, విశ్వాసం కలగకపోవటానికి కారణం వుండివుండాలి. ఆ కారణమేమిటో గ్రహించి అందుకు పరిష్కారమార్గం పరిశీలించి నిర్ణయించాలి, ఇవేవీ చేయకుండా దేశం బాగుపడాలన్నా, విద్యావిధానం సంస్కరించ బడాలన్నా, ప్రజలు విజ్ఞానవంతులు కావాలన్నా, అది సాధ్యం కానే కాదు.

ఈనాడు దేశంలో ప్రజలు వివేకవంతు లవడానికి, ఉన్నతమైన పౌరబాధ్యతలను నిర్వహించగలిగిన విజ్ఞానం పెంపొందించుకోడానికి, విద్యావిషయకమైన చర్చలు ఉత్తమ వైఖరిలో నడపబడటంలేదు. ఉన్నత సాహిత్యగోష్ఠి దేశంలో నిర్వహించబడటంలేదు, ఉన్నత సాహిత్య పత్రికలు ఉత్తమ పద్ధతిలో నిర్వహించబడటం లేదు. ఉత్తమ కళాసృష్టి దేశంలో పెంపొందటానికి తగిన ప్రోత్సాహం చూపబడటం లేదు. ఇది దేశంలో పెద్ద ఎత్తున జరగనంతకాలం మన జాతి పురోభివృద్ధికి సంబంధించిన విజ్ఞానస్థాయి పెంపొందటం కల్ల. దేశంలో అన్ని వైజ్ఞానికరంగాలలోను సామాన్యమైన పరిజ్ఞాన ప్రబోధానికే ప్రోత్సాహం ఇవ్వబడుతుంది. ఈరకమైన పద్ధతి దేశంలో అనుసరించబడినంతవరకూ, ఈ దేశం సుసంపన్నమూ కాదు, ఈ దేశీయులు సుఖసౌభాగ్యా లనుభవించనూ అనుభవించరు.

ఈ నాడు దేశంలోని అన్ని తరహాల ప్రజలూ అసంతృప్తి చెందేఉన్నారు. ఈ అసంతృప్తికి కారణం ఈ పైన వివరించబడిన స్థితే నని గ్రహించ గలిగితే దేశాన్ని నడిపేవారు మంచి యోచన చేయగలరని మా విశ్వాసం.

మంచి యోచన చేయడానికే మనలో మనం ఇలా తర్కించుకోడం, ఎవరి యోచన గొప్పది ఎవరి యోచన తక్కువది - అన్న సమస్యగా మాత్రం తీసుకోకుండా ఈనాడు జరిగే అన్ని కార్యాలను మనం సమీక్షించగలిగితే, మనకు యదార్థం ఏదో స్పష్టంగా బోధపడుతుంది.

ఈనాడున్న ఈ అవ్యవస్థ కంతటికీ కారణం మనదేశంలోని విశ్వవిద్యాలయాల విద్యా ప్రమాణంలోని లోపమేనని మనం స్పష్టంగా గ్రహించగల్గితే మనం త్వరలో ఒక నిర్ణయానికి రా గల్గుతాం. మనం మన విద్యావిధానం ఎలా మార్పు చేసుకుంటే దేశానికి హితం కలుగుతుందో నిర్ణయానికి రాగల్గుతాం.

వ్యవసాయంలో మార్పు రావాలంటున్నాం. వ్యవసాయోత్పత్తిలో పెంపుదల కావాలంటున్నాం పరిశ్రమలలో మార్పు రావాలంటున్నాం. ప రి

శ్రమల ఉత్పత్తిలో మార్పు రావాలంటున్నాం. వస్తునిర్మాణంలో మార్పు రావాలంటున్నాం. వస్తునిర్మాణంలో నైపుణ్యం పెరగాలంటున్నాం. ఇలాంటివన్నీ కావాలని కొన్ని నిర్ణయాలుచేసి, వాటిని ఆచరణలో పెట్టమని దేశంలో ప్రజలందరినీ కోరుతున్నాం. అయితే ఇదే పద్ధతిలో వీటన్నింటినీ కడుసమర్థతో నిర్వర్తించవలసిన విద్యావిధానంలో మార్పును స్పష్టం చేయగలిగిన రీతిని ఎందుకు అనుసరించ లేకపోతున్నాం? ఇందుకు ఏదో కారణం వుండి వుండాలి. ఇది పాశ్చాత్య విద్యావిధానంపై ఉన్న మమకారం అయి అయినావుండాలి. లేక, మనలోని దాస్యభావమైనా అయివుండాలి. ఈ రెంటిలో ఏ ఒకటి కారణమైనా మనకు హానే కలుగుతుంది. మనకు మనం హాని చేసుకుంటూ ఎవరిని ఏమని అన్నా నిష్ప్రయోజనమే అవుతుంది. మనకు దేశంలో తగినంత సహకారం రావటంలేదని విచారిస్తున్నాం. మనకు తగినంత సహకారం రాకపోవడానికి కారణాన్ని గ్రహించటం లేదు. మనకున్న లోపమేఇది. ఈలోపం మన విద్యాబోధనలోనే ఉంది. మన విద్యావిధానంలోని విషయ నిర్ణయంలోనే వుంది. ఇది చక్కబడాలి.

జర్మనీ దేశస్థులు వారి మాతృభాషలోనే సర్వవిద్యలూ నేర్చుకుంటున్నారు. శాస్త్ర పరిజ్ఞానంలో ప్రపంచంలో విజ్ఞులందరికన్నా మిన్నయైన స్థానంలోనే ఉన్నారు, ఫ్రెంచివారు వారి మాతృభాషలోనే అన్నివిద్యలూ నేర్చుకుంటున్నారు. వారూ ప్రపంచంలోని అందరు శాస్త్రజ్ఞులతో తులతూగగలిగిన స్థాయిలోనే వున్నారు. ఇటలీవారు, జపానువారు, రష్యావారు, చైనావారు - ఇంకా ప్రపంచంలోని మహమ్మదీయ రాజ్యాలవారుకూడా-వారి వారి మాతృభాషలలోనే అన్ని విద్యలూ నేర్చుకుంటున్నారు. ఒక్క మనంమాత్రమే ఇంగ్లీషు భాషను వదలితే ఎందుకూ పనికిరానివాళ్ళ మైపోతామని బాధపడుతున్నాం. ఈ బాధకు కారణం ఈభాషను వృత్తిగా చేసికొని జీవించడమే అని స్పష్టపడుతుంది. ఈ భాషను వృత్తిగా చేసికొని జీవించేవారికి సంపాదన వుంది, గౌరవం వుంది, హోదావుంది, హుందాతనం వుంది. దర్జా వుంది-అని ఈ ఇంగ్లీషు భాషపై వృత్తి చేసుకొని జీవించేవారందరూ మాతృభాషపై మక్కువ గలవారందరిలో ఒక విధమైన ప్రచారాన్ని చేస్తున్నారు, మాతృభాషలు నేర్చినవారికి ప్రపంచంలో ఇంగ్లీషు నేర్చిన వారెందరో, దాని సంఖ్యాబల మెంతో తెలియనే తెలియదని భావిస్తున్నారు. ప్రపంచంలోని అన్ని దేశాల ప్రతినిధులూ కలిసి సమావేశం జరుపుకుంటారు. ఆ సమావేశంలో ఎవరి జాతీయ భాషలోవారు మాట్లాడుతారు, అంతేకాని అక్కడికి వచ్చినవారందరూ ఇంగ్లీషులో మాట్లాడరు. ఇంగ్లీషు రాని కారణంవల్ల ఆయా దేశాల ప్రతినిధులైనవారు ఏమాత్రం నష్టపడరు. ఎవరూ ఏమాత్రం నష్టపడకుండా అక్కడున్నవారందరికీ వారి వారి భాషలలో అనువదించి అచ్చొత్తించి అన్ని విషయాలూ అందిస్తారు. ఇది చూస్తే వివేకవంతులైన వారికి ఆంగ్లవ్యామోహం వెర్రితనంగా కనిపిస్తుంది. ఇంగ్లీషు నేర్వని కారణంవల్ల దేశం అధోగతి పాలై పోతుందని వాపోయేవారి వ్యర్థప్రలాపంగా స్పష్టపడుతుంది.

మనం భారతీయులం. మన కొక ధర్మం వుంది. మన కొక జీవన విధానం వుంది. మన ప్రవర్తన మన కట్టుబాటు మన వ్యవహారమూ, మన పద్ధతీ అన్నీ ఒక ప్రత్యేక ప్రతిపత్తి కలిగివున్నవి. మన దేశంలో పలు ప్రాంతాలున్నాయి. అందరికీ ఒక్కొక్క భాష వుంది. మనలో మనకు ప్రత్యేక భాషలున్నా, మనమందరమూ కలసి జీవించే ఒక ప్రత్యేకమైన సంస్కృతి వుంది. అది మన నందరినీ బంధించి మన మంతా భారతీయులమే నన్న భావాన్ని ఎప్పటి కప్పుడు స్పష్టం చేస్తూనేవుంది. ఇది ఇంత బలంగా వుండటంవల్లనే ఎవరు ఎన్నివిధాల దాడి చేసినా, ఎవరు ఎన్నివిధాల నిర్బంధించినా ఎవరు ఎన్ని తరహాలుగా మనకు నష్టం కల్గించాలని సంకల్పించినా మన ప్రత్యేక ప్రతిపత్తిని మనం కాపాడుకుంటూనే, అన్ని చిక్కులనూ అధిగమించి పురోగమిస్తున్నాం. మనజాతి సజీవమై, సద్భావం కలిగి ఇప్పటికీ ఉన్నదని ప్రపంచ మంతా ప్రశంసిస్తూవుంది. ఈ మనలో వున్న ఉన్నతమైన ఏదో ఒక భావం ఇప్పటికీ ప్రతిష్ఠాగౌరవాలను కాపాడుతూనే వస్తున్నదని మన కందరకూ తెలుసు. ఇన్ని తెలిసిన మనం మన మాతృభాషలలో విశ్వవిద్యాలయ విద్యావిధానాన్ని ఎందుకు రూపొందించలేక పోతున్నాం? మన జాతిలోని శక్తిసామర్థ్యాలను వికసింపజేసుకోడానికి దోహదం చేసే మాతృభాషా విద్యావిధానాన్ని ఎందుకు ఆచరణలో పెట్టలేకపోతున్నాం? ఏ మాతృభాషా ప్రచారంద్వారా జాతిని సమైక్యం చేసి, జాతీయతాభావాన్ని పెంపొందించి, సంపూర్ణ స్వతంత్రభారతంగా నిర్మించుకొన్నామో ఆ మాతృభాషాప్రబోధంద్వారానే ప్రజలందరినీ విజ్ఞానవంతులను చేసి, జాతిని సుసంపన్నం చేయటానికీ, సువ్యవస్థను నిర్మించడానికీ, సుఖసౌభాగ్యాలతో తులతూగడానికీ దోహదం చేయగల పద్ధతిని ఎందుకు అనుసరించలేక పోతున్నాం. మనలో ఎక్కడ ఈలోపం దాగివుందో యోచించి, సత్వర పరిష్కారానికి పంచవర్ష ప్రణాళిక సరిక్రొత్త రూపంలో రూపొందించబడాలి. అప్పుడే మన సమస్యలన్నీ పరిష్కరించబడేది.



# శ్రీమద్రామాయణ కల్పవృక్షము: శిల్పదృష్టి
# సీతారాముల శృంగారము

ఆ సమయంబునన్ విచలితాత్ములు నిత్య పరస్పరాభి లా
షా సము ధీణిమానసులు సర్వతనూ పరివాంఛిత ప్రియా
భ్యాస సమాగముల్ రఘువరాన్వయ రత్న కిశోర దంపతుల్
మానసరమైన యట్టి మధుమాస దినంబులకున్ వశంవదుల్.

వసంతర్తువు వచ్చినంతనే సీతారాముల శృంగార జీవనము వర్ణించుట యారంభింపఁబడినది. వారు విచలితాత్ములు. అభిలాషామానసులు. తనూ సమాగములు. చలించిన ఆత్మ గలవారు. అనఁగా ఆత్మస్వరూపులై అవతరించినవారు. అభిలాషామానసులు - మానవజన్మ యెత్తుటచేత ఈ లక్షణము. మఱియును తనూ సమాగమముకూడ.

ఒక పరిగూఢమైన మధురోహ జనించినఁజెప్పికోఁ ద్రపా
చకితులు చేయఁగా మధుర సాధ్వసులై మృదు సాహసంబునన్
ప్రకటితమై త్రపాహసన భాసి కపోలము లూఁది చూచుకో
రొకరి మొగంబు నొక్కరు రహో బహు భావగత త్రపాహతుల్.

ఇద్దరిలో నెవరికో యొకరికి సంభోగ శృంగారము నందలి యొక విశేష చేష్ట స్ఫురించును. అది చేయుటకు భయపడుదురు. సాహసముతోఁ జేయుదురు. సిగ్గు పడుదురు. ఒకరి మొగ మొకరు చూచుకోరు.

మానవ శరీర సంబంధమైన ఇట్టి క్రియలు వారికి నిజముగా నిష్టమైనవి కావు. వారి నిజమైన ప్రేమయెట్టిదనఁగా

అలయకయే పరస్పర హృదంతర నాథ మనస్కు లిద్దఱున్
దెలియకయే సుఖాతి పరిధీకృత ధీ పరిణాము లిద్దఱున్
గలయకయే సమాగమ సుఖ ప్రవిభాగ కృదాత్ము లిద్దఱున్
సలలిత మూర్తులౌ జనకజా రఘురాములు దివ్యకాములై.

లోకములో స్త్రీ పురుషులు పరస్పర ప్రేమ సంపాదించుకొనుటకు బహు ప్రయత్నములు చేయుదురు. వారికట్టి శ్రమయేలేదు. సహజముగానే సీత గుండెలో రామచంద్రుడు నిండియుండెను. రామచంద్రుని గుండెలో సీత నిండియుండును. సౌఖ్యముయొక్క పరమానుభూతి వారు పొందుదురు. అది ఈ మార్గమున పొందితిమని వారికిఁ దెలియదు. వారు కలిసియున్నపుడు రత్యంతమునందు కలిగెడు సుఖమునే పొందుచుందురు. ఆ సుఖముయొక్క ప్రవిభాగము వారి యాత్మలకుఁ దెలియును. సంయోగ జనిత సుఖ విజ్ఞాతామూర్తులని తాత్పర్యము.

సీతయు రామచంద్రుఁడును జేతములందు యుగాలుఁగల్పముల్
నాతియుఁ బూరుషుండుగ ననంతర దంపతిభావ యాపనా
వ్యాతత సంస్కృతి ప్రథముపైనటు లాత్మఁదలంచు చుందురా
సీతకు రామచంద్రునకుఁ జేతములందలి ప్రేమ యెట్టిదో!
వారిద్దరు ఎడతెగని దాంపత్య మనంత కల్పములుగాఁ జేయుచున్నట్లు భావించుచుందురు.

ఒలయు దివావియోగభర మోపరు మేనుల దూరసంస్థితిన్
గలిసి నిశార్ధ భాగమునఁ గాంచిన యంత నొకళ్లొకళ్ళమే
నులఁదగు దూర సంస్థితిని నూల్కొను నయ్యెడబాటు కాఁకమే
నులదని విస్మరింతురు కనుంగొను చొక్కరి నొక్కరట్టులే.

పగలొక రొకరు దూరముగా నుందురు. వియోగ మనుభవింతురు. ఈ వియోగ మెందు కనుభవింతురు. వారి రెండు శరీరములు కలిసిలేవు గనుక. ఇద్దరు నొకచోట లేరుగనుక. రాత్రులందు కలిసికొందురు. పవలు వియోగమనుభవించుటకు కారణము శరీరములు దూరదూరమున నుండుటచేతఁ గదా! కలిసినంతనే కౌగిలించుకొనవలయును. రాత్రులం దొకరినొకరు చూచినంతనే, ఒకరినొకరు చూచుకొనుటయేగాని, ఈ శరీరముల పగటిదూరముచేత దుఃఖపడితిమికదా! రెండు శరీరములను కలుపవలయునన్న యూహ యుండదట! ఒకరినొకరు చూచుకొనుటయే చాలును.

కలయికయున్ వియోగము జగజ్జనులందు సుఖంపు దుఃఖపున్
బొలములలో వికృష్టముగఁ బూన్చు నొకానొక దూరసంస్కృతిన్
ఛలమటి తోఁచెడున్ జనకజా రఘురాములకున్ వియోగ సం
చలనము సంగమం బసహజ స్థితియున్ సహజ స్థితిం బలెన్.

లోకములో జనములకు కలయిక వలన కలిగెడి సుఖము సహజమైనదికాదు. వియోగము వలన కలిగెడి దుఃఖము సహజమైనదికాదు. ఒకానొక యావేశము పొంది, అప్పుడు పైకిపోయి ఇప్పుడు క్రిందికి వచ్చి వాని ననుభవింతురు. సీతారాములకు సంయోగము లిట్టివికావు. సంయోగము సహజమైన స్థితి. వియోగమనహజ మైనది.

ఆహిత రామపుష్కరదయాహతలక్షణ సీత కోటి వ
ర్షాహత సర్వసాగర సరస్సరి దానఁత భావ మందుచో
సేహ నిరీహమౌఁ బ్రథమ సృష్టి వికస్వర సూక్ష్మదేవతా
దేహ సముజ్జ్వల ద్వరుణ దేవుని పోలిక రాముఁ డొప్పెడున్.

ఆమె సీత. ఆమె ఆహత లక్షణ. అనఁగా అన్వర్థ నామధేయ. సీత యనఁగా నాగేటి చాలు. ఈ సీత రాముఁడను మేఘమును పొందినది. ఆమె కోటి వర్షర్తువులందు మేఘజలము చేత కొట్టబడిన సముద్రములు చెరువులు నదులువలె నుండును. రాముఁడు సృష్ట్యాది యందలి జలమయ స్వరూపము. బిందుమాత్రముగా మన్న వరుణ దేవునివలె నుండును. ఇది స్త్రీ పురుషుల రతివేళానుభూతి వాత్స్యాయనాదుఁ చెప్పినది. స్త్రీ పురుషుల సృష్టి స్వరూపము చెప్పునది.

సీత ప్రకృతి. రాముఁడు పురుషుడు. ఆమె మాయ. ఈయన చైతన్యము. ఈభావము లన్నియు ఈ పద్యమునందు ధ్వనించుచున్నవి.

ఇది లోకములోని శృంగారమేకాదు. ఇది శృంగారమని చెప్పుటకే వీలులేదు. ఇతర శృంగారకావ్యముల యందువలె ఈ వర్ణనయే లేదు. ఒక మకరికాపత్రములు వ్రాయుటయో, ప్రణయకోపము వహించుటయో, ఆ కేకరప్రసారము చేయుటయో, ఇట్టివేమియు లేవు. ఇది ప్రకృతి పురుషుల సమాగమము. అందుకనియే—

ఏపున మంటినుండి యుదయించిన మైథిలి మింటినుండియా
వాపముగన్న రాఘవుఁడు వచ్చి యుగధ్యములందు నుండి ద్యా
వా పృథువుల్ సమాహరణ భావము పొందిన రీతి సంగమ
వ్యాప్తృతిఁ బండువెన్నెల మయంబుగఁ జేయుచు రాత్మరోదసిన్.

అని వారి సమాగమ రహస్యము చెప్పఁబడినది.

తరువాత రామునకు వైరాగ్యోదయ మైనది. సంస్కృత రామాయణములో సీతారాములు కలిసియుండఁగా నాఱు ఋతువులు గడచినవని యొక్క వాక్యమున్నది. ఆఱు ఋతువులకు ఆఱిరువదులు నూటయిరువది పద్యము లీ గ్రంథమునం దున్నవి.

రాజితమైన మోహము సిరంకుశమై రఘురామమూర్తి సం
ధ్యా జపమంత్ర హోమ నిశితాదర సూక్ష్మతరశ్లథాత్ముఁడై
(శ్రీ) జనకాత్మజా ప్రణయజీవన మోహన కారిప్రేమ కుం
డా జగలాయ మానధిషణా స్ఫురణంబులఁ జెంగలించుచున్.

కనుక పాత్రిక నింపిన యిరా రసములఁ దెచ్చి మైథిలికి నందిచ్చి యిచ్చి,
జిలుగు కుంకుమల మంజిష్ఠా హారిద్రల లలితాస్య పదము లలంకరించి,
కర్పూర ముస్తక కాలాగురు ద్రవ్యములు ధూపములువేసి వెలిచి వెలిచి,
గ్రథితమాలా మాఘ్యకల్హార మాలలు హస్తకైశిక కంఠమందుఁ జెరివి,
మెడమలుపు నోరచూపుల మెలచిచూచి యందముగ నున్నదో లేదోయనుచు నాడి
యందమురలెడు గాదే? యటంచు నాడి మూలల న్నిల్పి యొయ్యారములుగఁజూచి.

ఆడంజూడగఁ జూడనాడగను వారన్యోన్య నేత్రాంతర
క్రీడాదర్పణ దృశ్యమానము లసంఖ్యేయాత్మ రూపంబులన్
వ్రీడా ముగ్ధములన్ వినిశ్చలదృగా విర్భూత రోచిస్సులన్
గూడన్· దోరణబద్ధ మాలలఁగనన్ గూలంకషప్రేములై.

కోకిల దూరానఁ గూసిన నీవలే నన్నుఁబిల్చితి వంచు నవ్వుసామి,
తుమ్మెద గూటిలో ఝుమ్మన నిదియే రహస్యమూదునో యంచు నాడు సామి,
గృహ శిఖావళము తీర్చినఁ బింఛమును నీదుకైశికచ్ఛవి నెఱుంగదను సామి,
పెంపుడు లేడి ద్వారంపు కోసలఁజూడ నవనిజాతులఁ బోల్చియాడు సామి,
సీత చెఱఁగు గాలిచేఁ జిందులాడిన దాని నిగుడు వాలులోన నిలచి
పడవ లోన నేను బయనించుచుంటి నంచేలో భయము నభినయించు సామి.

తనపాద మామెపాదము జతగాఁబెట్టి యస్మత్పదంబు మోటని వచించు,
తనహస్త మామె హస్తముతోన జతఁజేసి ముదురాకు చివురాకు పదనులనును,
ఆమె ప్రక్కననిల్పి యానుకొమ్మని నన్ను విడి పోకవేయని విరిసిపోవు,
చెక్కిలిఁ జెక్కిలిఁ జేర్చి యా ప్రాతస్సులేవో రహస్యంబు లెత్తిపోయు,

తరుగుకొని పోవు ప్రేమ సంతాపహేతు వంచుఁ దన ప్రేమబరువు చూపించి పలుకు,
నొక్కసమయాన మనకు వియోగమైనఁ బ్రేమ యేమగునంచు వారింపఁబడును.

ఈ పద్యములే కొంచెముమాఱి, మేనకా విశ్వామిత్ర ఘట్టములోఁ గలవు. అవి ఇవి.

రాజితమైన మోహము నిరంకుశమై కుశికాత్మజుండు కృ
ష్ణాజినముం గమండలువు నగ్నులు దర్భలు మూలఁద్రోచి శా
లాజిర భూమి వన్యకుసుమాలి పరాగ ప్రణీత రంగ వ
ల్లీ జగతీ నిరంతర నిలీన రమాస్పదగాఁ బొనర్చుచున్.

వెదురు గొట్టాల నింపిన యిప్పపువుకల్లు తెచ్చియచ్చరకు నందిచ్చువేళ,
నరుణ వర్ణాభి రామానేక వృక్ష నిర్యాసముల్ పారాణి రాచువేళ,
ఘనసార చందన కర్పూర తరుఖండములు ధూపములు వేసి వెలుచువేళ,
నుదురు వాసనలతోఁ బొదలఁ బూచిన వన్యపుష్పముల్ కొప్పులో ముడుచువేళఁ,
దానె యిచ్చియిచ్చి తానుగా రాచుచుఁ దానె వెలిచి వెలిచి తానె ముడిచి,
యెదుట నిలిచి, కీవి యెల్లను నొడలి యంచులను దేఱ నవ్వి చూచుచుండు.

కోకిల కొమ్మలోఁ గూసిన నీవచే నన్నుఁ బిల్చితి వంచు నవ్వుమౌని,
తుమ్మెద పొదలోన ఝుమ్మన నిదియేమి మణితమే యని మేల మాడుమౌని,
వన శిఖావళము విప్పిన పింఛమునుదడి తుడుతుసే ాయని కొప్పు విడుచుమౌని,
యిట్టి ముంగట నిల్వనేమి చూపులెయంచు నతివకన్నులు ముద్దులాడు మౌని,
యాకుగదల భయమటంచును దనకును నువిద కౌగిలింత నొదుగుమౌని,
మౌనిమౌని కాదు మమతచే వాచాల సార్వ భౌముఁడయ్యె సౌర్యరత్న!

తన పాదమామె పాదము జతఁగాబెట్టి యస్మత్పదంబు మోటని వచించు,
తన హస్తమామె హస్తముమీద బోర్లించి నీచేయిలే దని నిహ్నవించు,
నామె ప్రక్కగనిల్చి యగునా బుజముదాక వచ్చితివే యని పలువరించుఁ,
జెక్కిలిఁ జెక్కిలిఁ జేర్చి గడ్డము గ్రుచ్చు కొన్నదాయని గ్రుచ్చిగ్రుచ్చియడుగు,
నానుకొని కూరుచుండి నీయచ్చమైన రత్నకాంతితనూ ప్రభారాశిక్రమ్మి
నా తనూకాంతి గూడ రత్నముల ప్రభలు చిమ్ముననని చిల్కరించును జికిలినవ్వు.

విశ్వామిత్రుని కథయంతయు శతానందుఁడు రామునితోఁ జెప్పెను. రామలక్ష్మణు లింటికిఁ బోయిన తర్వాత ఏకాంతమ్మున శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునితో నిట్లనియె:

ఈ ఋషులెవ్వరు చెప్పి సారకథాకథన మొక్కచాయనె నడచున్
వీరంతర్దర్శిష్టులు బహుధా రూపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ.
నీవికొక్క సంగతిచూచి వావె వత్స
అన్ని యంశమ్ములును చెప్పినట్టి తీరు
వేఱు మేనక కథ తీరు వేఱుగాదె
యనిన నౌననె లక్ష్మణుం డమృతమూర్తి.

శతానందుఁడు మేనకా విశ్వామిత్రుల శృంగారము చెప్పుచు, సీతను పెండ్లియాడఁబోవు చున్న రామునకు శృంగార చేష్టాదికములు బోధించెను. అవి రాముని మనసునకు పట్టినవి. అది యదియేకదా యని లక్ష్మణునితో నన్నాఁడు. అప్పటికి సీతారాముల వివాహమే కాలేదు. ఐనను లక్ష్మణుఁడు అన్నవదినల శృంగారమునుగూర్చి మాటాడలేదు.

సీతా రాముల ప్రధాన శృంగారము ప్రకృతిపురుషుల కలయిక వలె నున్నది. ఆతేండ్ల యిన తర్వాత, అరుంధతి మొదలైన వారు బోధించిన తర్వాత, మరల రాముఁడు సీతయందు సంసార భావముతో మెలఁగి నాఁడు ఈ ఐదేండ్లు సీత రాముని వైముఖ్యముచేత తల్లడిల్లు చున్నది. ఆమె నిశ్చయించుకొన్నది—ఆయన యిష్టము వచ్చిన యట్లుండును పోనిమ్మని. ఆమెకు వైరాగ్యము బలసినది, అప్పుడు రాముఁడు లోకదృష్టిగా నామె ప్రేమను సంపాదింప వలసి వచ్చెను. ఆయన కింకొక మార్గము స్ఫురించలేదు. పూర్వ మెప్పుడో శతానందుఁడు మేనకా విశ్వామిత్రములోని తచ్చేష్టాదికములు, తను సీతయందు నెఱపినాఁడు. అందుకనియే.

శ్రీమనోనాథు లీలా విశేషమరసి
సీత "ఓ స్వామి యెందునేర్చి"తని యడుగ
నేను నేర్చిన దేమున్నదే లతాంగి,
కౌశికుండుపదేష్టయుగాని" దనును.

సర్వాస్త్రములు విశ్వామిత్రుఁడే యుపదేశించెను. ఈ మన్మధ విద్యకూడ కౌశిక కథ నుండియే తెలిసికొనెనని యర్థము.

కావ్యాదియందు సరస్వతీ స్తోత్రము చేయుచు, "చాలితాన్యోన్య సౌందర్య సరతుము లును నైన పలుకుల కూడిక యనఁగ నొప్పు శారదమూర్తి."

యనినాఁడు కవి. ఆ శిల్పమే ఇచ్చట పొదివినాఁడు.

పూని వైదేహి మైథిలి జానకి య
టంచు శ్రీరామమూర్తి నోరారఁ బిలుచు
ఆ పిలుపుసవ్వడి తరంగలమ్మువారు
ప్రాణ మోదమ్ములందున హత్తుకొనగ

రాముఁడు సీతను వైదేహీ, మైథిలీ, జానకీ - అని పిలుచును. సీతాయని పిలువడు. విదేహ దేశము మిధిలానగరము, జనకరాజు. ఆసీతను చూచినంతనే రామునకు ఆమె అచ్చటి కూతురు అన్నదే పరమప్రియమైన విషయము. ఆమెకు ఆ పిలుపులు ప్రాణోద్దీపకములు. ఇది వారిప్రేమ. సీతను గూర్చి యాయన భావన అంత మృదువైనది. స్వామి కంఠస్వరము చాలును సీతకు, ఆమె ప్రాణములు లేచి వచ్చును.

శ్రీరామ చంద్రుఁడు సీతయందు ఉన్న జ్ఞాన భాగమును జూచును. అనఁగా ప్రకృతి యందు తాను ప్రతిబింబించుచున్నాఁడు. తన ప్రతి బింబమును తానే చూచుకొనునని యర్థము. సీత యతని కంఠస్వరమును ప్రాణములందు హత్తుకొనును. ప్రకృతికి ప్రత్యక్ష పరమేశ్వర స్వరూపము శబ్దము.

ఇది లక్ష్మీనారాయణులైన వారి సంయోగములోని పరమమైన లక్షణము. వెంటనే లౌకికమైన వారిప్రేమ యెట్టిది? అన్నప్రశ్న వచ్చుచున్నది.

సీత శ్రీరామచంద్రుని చిత్తపదము
రామచంద్రుఁడు జానకీ ప్రాణపదము
రామసర్ప ఫణామణీ రమణీ సీత
ధరణి జా జీవితాతప తరణిస్వామి

సీతను గూర్చియే రామచంద్రుఁ డెప్పుడాలోచించును. రామచంద్రుఁడు లేనిచో జానకికి ప్రాణమే లేదు. సీత రాముఁడన్న పాముయొక్క పడగమీదనున్న రత్నము. ఆ రత్నమును తాకుటకు వీలులేదు. తాకినచో మృత్యువు నిస్సంశయము. సీతయొక్క బ్రతుకు అనునెండ రాముఁడను సూర్యునినుండి వచ్చుచున్నది. ఆయన లేనిచో సీమెలేదు. తనవలన నున్న సీమె యందుఁ దనకంత యిష్టము. లౌకికమైన యర్థముగా నిది లోక సహజమైన వృత్తి. ఈ పద్యములయందు ప్రకృతి పురుష సంబంధమైన వేదాంతమంతయు నున్నది.



# కాంగ్రెస్ మూలసిద్ధాంతము-కార్యక్రమము

డాక్టర్ సంపూర్ణానంద్

గడచిన కొంతకాలం నుంచీ, కాంగ్రెస్ సంస్థ కేవలం నిర్మాణాత్మకమైన స్వభావంలో సాగించిన కృషి మాత్రమేకాక, ప్రభుత్వం ఉద్యమించిన అభివృద్ధి కార్యక్రమాలు కూడా ఏవిధంగానూ దేశంలో ఉత్సాహాన్నీ, ఆసక్తినీ కలిగించలేక పోయాయనీ, అందుకు కారణం దేశ నాయకత్వం ఒక మూలసిద్ధాంతాన్నీ, ఒక జీవన తత్వాన్నీ ప్రజలముందు పెట్టకపోవడమే నన్న ఒకానొక అభిప్రాయానికి అంతకంతకూ ఆధారం ఏర్పడుతూ వచ్చింది. ఈ ఆరోపణ కొత్తదేమీ కాదు కానీ ఇటీవల కాలంలో, పరిస్థితుల ఒత్తిడి వల్ల ఇది మరింతబలాన్ని పోగుచేసుకున్నది. 1921 లగాయతూ 1942 వరకూ కాంగ్రెస్ నిర్వహించిన రాజకీయ ఆందోళనోద్యమాలు దేశంలో ఎక్కువ భాగం ఒక రకంగా కొనసాగినవి. కార్యస్థానంలో కూర్చొని ప్రధాన వ్యవహారాలు నడిపే ప్రభుత్వాలలో సయితం కాంగ్రెస్ వ్యక్తులే అధికంగా ఉండడం సంభవించింది. శతాబ్దాల తరబడి దాస్యంలో మగ్గిపోయి జాతి కంటూ వచ్చిన కలలు, అనేక సంవత్సరాల పోరాటంలో నిర్మించుకుంటూ వచ్చిన ఆశలు, ఆకాంక్షలు ఇప్పుడు నిజమై కార్యరూపం తాల్చే తరుణం ఆసన్నమైంది. ఇలాంటి తరుణంలో, పునర్నిర్మాణంకోసం, అభివృద్ధికోసం, కొనసాగే మహాత్కార్యాలు సఫలీకృతం కావడానికి ప్రతి ఒక్కరూ తమ శక్తివంచన లేకుండా సహాయపడతారని ఆశించడం జరిగింది. కాని, దురదృష్టవశాత్తూ ఈ ఆశ అడియాస అయింది. కాంగ్రెస్ నిర్మాణానికి ఆత్మచైతన్యం ప్రధాన లక్షణంగా ఉండడానికి మారుగా, ఒకవిధమైన భంగపాటు, సాధారణ మాంద్యం అంతటా అలుముకున్నాయి. కాంగ్రెస్ కార్యకర్తలు కార్యస్థానంలో పదవుల కోసం, ప్రాబల్యంకోసం తమలో తాము పోట్లాడుకోవడం తప్ప మరి చేసేదేమీ లేనట్లు కనుపించింది. వారు అన్యాయానికీ అవినీతికీ పాల్పడ్డారనీ, లంచాల కోసం దేవుళ్లాడుతున్నారనీ ఎవరైనా ఆరోపించవచ్చు. కాని, దానివల్ల ఏ సమస్యలూ పరిష్కారం కావు. కొద్ది సంవత్సరాల క్రితమే తమ ఆస్తిపాస్తులనే కాక, తమ ప్రాణాలను సయితం ప్రజాక్షేమం అనే దైవపీఠం ముందు బలిదానం చెయ్యడానికి సంసిద్ధులయిన మనుష్యులు ఇప్పుడింతలోనే హఠాత్తుగా ఇంత నీచస్థితికి ఎందుకు దిగజారిపోయారు? ప్రభుత్వంతో సహకరించమని చేసిన విజ్ఞప్తులకుకూడా ప్రజలలో నుంచి తగినంత సమాధానం, ఉత్సుకత కనుపించడం లేదు. ప్రజలు 'శ్రమదానం' చేయడం ద్వారా సాధికార ప్రయత్నాలకు దోహదం చెయ్యవచ్చు. కాని తాము ప్రత్యక్షంగా భాగస్వాములు కాని కార్యక్రమ నిర్వహణకు తోడ్పడమని ప్రజలను ఉత్సాహ పరచడం అసాధ్యమైన

విషయం. లేనిపోని ఆక్షేపణలతో విమర్శించే ధోరణి బహుమిక్కుటంగా ఉన్నదే కాని, ఒక తీవ్రమైన దీక్షతోనూ, ఒక కారణంకోసం జీవితాన్ని అంకితం చెయ్యాలన్న ధ్యేయంతోనూ కృషి సాగించడం మాత్రం అతి స్వల్పంగా కనుపిస్తోంది. విద్యార్థికి క్రమశిక్షణా రాహిత్యం మన విద్యా విషయిక సంస్థలలో ఒక జీర్ణించిన లక్షణమై పోయింది. ఈ వైపరీత్యం మొలకెత్తడానికి కూడా మూలకారణం అదే. కమ్యూనిస్టు పార్టీలో చేరిన ఒక యువకుడు తాను ఒక పవిత్ర సమరంలో పాల్గొన్నట్లు భావిస్తాడు. అంతటి పట్టుదలను ప్రదర్శిస్తాడు. అలాంటివాడి దృక్పథాన్ని మరోవైపు మళ్ళించడానికి కాంగ్రెస్ ఒక ఆదర్శాన్ని కాని, ఒక ఉన్నత ప్రణాళికను కాని అతని ముందు పెట్టడం జరగలేదు. ఇహ అతను, వ్యవస్థను సమూలంగా ధ్వంసం చేయడానికి తాను ప్రేరేపింప బడినట్లు అందుకు పూనుకుంటాడు.

ఇలాంటి అనుభవాలు గడించి కూడా, మనం పౌరుడికి ఏదో కొంత ప్రధాన ప్రాతిపదికను ఏర్పరచి, అతని శక్తి సామర్థ్యాలు ప్రదర్శించే కృషికి దోహదం చేయక పోవడం ఉన్నదే - ఇది అనేకమంది ఆలోచనా పరులను ఆశ్చర్య పడేటట్లు చేస్తున్నది మన దేశంయొక్క భౌతిక వస్తుసంపదను సమృద్ధంచేసే ప్రయత్నంలోనే ఉండి పోయి మనం, మానవ స్వభావం తాలూకు ఆధ్యాత్మికమూలతత్వాలపై ఎలాటి శ్రద్ధాశక్తులూ చూపలేక పోయాం. భారతపౌరుని ముందు మనం ఏ ఆదర్శాలనూ పెట్టలేదు. అతను ఎంత ఎత్తుకు ఎదుగవలసి ఉన్నదో మనం ఎత్తిచూపలేదు. మనం సంక్షేమ రాజ్యాన్ని గురించి తరుచు మాట్లాడుతుంటాం. కాని 'సంక్షేమం' అన్న పదానికి ఇతర వ్యాఖ్యానాలేవీ లేనప్పుడు సామాన్య పౌరుడు ఈపదానికి తక్కిన సదుపాయాలతో పాటు 'కూడూ, గుడ్డా' అని అర్థం చెప్పుకుంటాడు. ఇందులో 'కూడూ, గుడ్డా' మరీ ముఖ్యమైనవిగా భావిస్తాడు. అవుతే 'సంక్షేమం' అన్న ఈ పదంలో మేధోభివృద్ధి, మానసిక సౌందర్య వికాసం అనేవి ఇమిడి ఉన్నాయనడం తథ్యం. ఇది ఎవరూ లేదనరు. కాని, ఇంతకు మించి ఇదిపైకి పోనట్లు కనుపిస్తుంది. మతం, మత చైతన్యం అనేవి తక్కిన అన్ని విషయాలకంటె కూడా వేరైనవీ విశిష్టమైనవీను. వీటికోసమే మానవుడు తపిస్తాడు. ఇవి లేనిదే తాను పరిపూర్ణ మానవుడను కానని భావిస్తాడు. కాని, మతాన్ని ఈ సంక్షేమం అనేదానిలో ఏవిధంగా చేర్చినా, అలాచేర్చినవారిని బాహాటంగా అపహసిస్తారు. అది పునరుద్ధారణ తత్వమనీ, మత తత్వమనీ ఆరోపిస్తారు.

## 2

జాతి పరిపూర్ణ వికాసం పొందాలంటే దానిని ఈ అంధకార కూపం నుంచి బయట పడెయ్యాలి. భౌతిక వాదంయొక్క అనర్థాలను గురించీ, గతంలో భారతదేశం గడించిన కీర్తి

ప్రతిష్ఠలను గురించీ, ఆకాశం అంత ఎత్తున భారతీయ తత్వశాస్త్రం సాధించిన ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని గురించీ, కళలకూ విజ్ఞాన వికాసానికీ భారతదేశం గతంలో చేసిన అమూల్య సేవనుగురించీ అదేపనిగా ఉగ్గడించడం అవివేకమే అవుతుంది. ఇదంతా కూడా కేవలం గర్వింపదగిన విషయం మాత్రమే ఇది తరువాత కృషికి దోహదకారి అవుతే తప్ప, దీనివల్ల మనకు అంతగా ప్రయోజనం కలుగదు. కాని మనం గతాన్ని గురించి కలలుకంటూ మనలను మనం మరిచి పోరాదు గతంలో మనం గడించిన అనుభవాలు, సాధించిన విజయాలు ప్రస్తుత కాలపు సమస్యా పరిష్కారానికి సాధ్యమైనప్పుడల్లా వినియోగించుకోకుండా ఉండడం దోషమే అవుతుంది.

ఇది కేవలం సాధ్యం మాత్రమే కాక, ఆధ్యాత్మిక రంగంలో అత్యంత వాంఛనీయమని కూడా నేను నిస్సందేహంగా చెప్పగలను. వ్యక్తీ, జాతీ కూడా సదా ఒక లక్ష్యాన్ని కలిగి ఉండాలి. ఆ లక్ష్యంకోసమే జీవించాలి. అవుసరమైతే ఆలక్ష్యం కోసమే ప్రాణాలు త్యజించాలి. మట్టి ముద్దలుగా పడిఉన్న మూసలను బంగారంగా మార్చాడు.. మహాత్ముడు. ఆయన విజయంలోకల రహస్యం ఒకే ఒక వాస్తవంపై ఆధారపడి ఉంది - అంతవరకూ, మాంద్యంగా నిత్యజీవిత క్రమంలో కొట్టుకపోతూ వచ్చిన మన జీవితాలకు ఆయన ఒక లక్ష్యాన్ని, ఒక ప్రయోజనాన్ని ప్రసాదించాడు. సంక్షేమ రాజ్యాన్ని గురించి మనకు ఒక స్పష్టమైన భావనను కలిగించాడు. ప్రజాస్వామ్యమూ, సామ్యవాదమూ దాని ప్రధాన లక్షణాలని బోధించాడు. మనంకనుక కొంచెం ఆలోచించి నట్లయితే ఈ మాటలలో ఎలాంటి సందేహార్థాలకూ, అస్పష్టతకూ తావు కనుపించదు.

సామాన్య పౌరుల సమష్టి సంక్షేమం కన్నా ఇతరమైన దాన్ని ఆశించే ప్రభుత్వం కానీ, రాజకీయ పక్షంకానీ లేదు. కేవలం ఈ ఒక్కమాటలోనే ప్రత్యేకత ఉన్నదనడానికి సూచనఏమీ లేదుకూడా. దీనికి సామ్యవాదం అనేది సహాయకరంగా ఉండవలసిందే, కాని దురదృష్ట వశాత్తూ అలా జరగలేదు. సామ్యవాదంలో అనేక తరహాలున్నాయి. కాని భారతదేశంలో ఈ పదం ఉపయోగించేవారు, మార్క్సు, ఏంగెల్సు చెప్పిన సామ్యవాదమే సామ్యవాదం అన్నట్లు దీన్ని దాంతో ముడివేదుతున్నారు. దాన్నే విస్తరింప చేయడానికి చూస్తున్నారు. మార్క్సిస్టు సిద్ధాంతంలో అంతర్భూతమై ఉన్న జటిలతలను అర్థం చేసుకునేవారు కానీ, ఆమోదించేవారు కానీ కనుపించడం లేదు. అయినప్పటికీ వారికి సామ్యవాదం మార్క్సిజం యొక్క రూపాంతరంగా తప్ప మరోలా కనుపించదు. 'ప్రజాస్వామ్యం' అన్న విశేషణం దాన్ని కమ్యూనిజంనుంచి చమత్కారంగా వేరు పరుస్తున్నది. అవుతే మళ్ళీ ఇక్కడ ప్రజలు సందిగ్ధావస్థలో పడవలసి వస్తోంది. భారతదేశంలో ఉన్న ప్రతి రాజకీయ పక్షమూ, మత తత్వా

నికి చెందిన జనసంఘం వంటివికూడా, ఈనాడు సామ్యవాదాన్ని గురించే మాట్లాడుతున్నాయి. కమ్యూనిస్టుపార్టీ కూడా క్రిందటి మాటుజరిగిన కాంగ్రెస్‌లో అహింసా వాదాన్నీ, ప్రజాస్వామ్య సంవిధానాన్నీ అవలంభిస్తూ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఇహ అలాంటప్పుడు పద్ధతులలోనూ, కార్యక్రమాలలోనూ కాంగ్రెస్‌కూ, రాజకీయ రంగంలో ఉన్న తక్కిన రాజకీయ పక్షాలకూ భేదం ఏమిటి? ఈ వైవిధ్యాన్ని గుర్తించడం ఎలాగ? ప్రజల మనస్సును కలవర పరుస్తున్న ఈ ప్రశ్నకు సమాధానం కనుగొనవలసి ఉంది. పైకి ఒకలా అగుపిస్తూ దిగువన తుకతుక ఉడికిపోతున్న ఈ సంక్షోభాన్ని గొప్పగొప్ప నాయకులు తెలుసుకోక పోవచ్చు. కాని, మూలసిద్ధాంతంలో వచ్చిన ఈబాధ, క్రమ తొలిగి పోతేనే తప్ప, కాకపోతే పునర్నిర్మాణం కోసమూ, క్రమశిక్షణ కోసమూ మనం పడే పాట్లన్నీ గంగలో కలుస్తాయి. ఈ కృషిని కొనసాగించడంలో తాత్విక సంబంధమైన సమస్యలను కొన్నింటిని మనం చర్చించవలసి ఉంటుంది.

ప్రజాస్వామ్యంకానీ సామ్యవాదం కానీ, ఏదీ దేనికదే పరమావధి కాదన్న విషయం మనం స్పష్టంగా గ్రహించవలసి ఉంటుంది. కొంతమంది ప్రజలు వాటిని అవలంభిస్తున్నారూ అంటే, అవి తమ శ్రేయస్సుకు ఉత్తమ సాధనాలనీ, తమ నైతిక భౌతిక పురోభివృద్ధికి అవి నమ్మతగిన మార్గాలనీ వారు భావించడమే అందుకు కారణం. ఏ వ్యక్తులవల్ల సమాజం రూపొందుతూ ఉందో, ఆ వ్యక్తుల శ్రేయస్సు కంటె సమాజానికి వేరే శ్రేయస్సంటూ ఉంటుందా? దీన్ని అంగీకరించాలంటే హెగెలియన్ సిద్ధాంతాన్ని అంగీకరించవలసి ఉంటుంది—ఈనాడు మన కళ్ళ ముందు రష్యా, చైనావంటి దేశాలలో ప్రజాతంత్ర ప్రభుత్వాలని పిలువబడుతూ, మరో మాటలో చెప్పాలంటే నియంతృత్వ పరిపాలనలుగా రూపొందిన ప్రభుత్వాలు ఆ సిద్ధాంతానికి నిదర్శనాలు. ఆసిద్ధాంతం ప్రకారం, సమాజాన్ని మినహాయిస్తే, వ్యక్తికి ఎలాంటి అర్థమూ, ప్రాధాన్యత లేదు. దేశపాలకులెవరో, ప్రభుత్వం పేరుతో ఎవరు పరిపాలిస్తున్నారో వారి కోర్కెలు, ఇష్టాలే సమాజంయొక్క కోర్కెలూ, ఇష్టాలూ అయి ఊరుకుంటాయి. తమ వాంఛ లన్నింటికీ వారే ప్రాతినిధ్యం వహిస్తున్నారనీ ప్రజలంతా అంగీకరించవలసి ఉంటుంది వ్యక్తులు, పూర్ణ వికాసం కలిగి ఉన్నప్పుడు, ఒక్కొక్కతరి ప్రజల వాంఛలే వారి వాంఛలు అవనూవచ్చు, మరొకప్పుడు కాకపోనూ వచ్చు. ఇది కాకతాళీయంగా సంభవించే విషయం, ఇలాంటి విధానంలో చిక్కుకున్న వ్యక్తి తన జీవిత సుఖాన్నీ, సాఫల్యాన్నీ, సమాజ శ్రేయస్సుకే చేకూరుస్తున్నామని చెబుతూ పైన కూచున్న వారికోసం తన్నుతాను ఆహుతి చేసుకోడంలోనో లేక వారి చేతుల్లో ఆహుతి కావడంలోనో కోల్పోతాడు.

ఇహా ఇక్కడ మనం దీర్ఘమైన తాత్విక చర్చలలోకి దిగవలసిన పని లేదు కాని, పైన ఉల్లేఖించిన పరిస్థితిని మాత్రం మనం సుతరామూ అంగీకరించలేము. మనకు సమాజానికి వ్యక్తే మూలం. అతను తన శక్తి సామర్థ్యాలను పూర్తిగా అవగతం చేసుకోవాలి. తాను సంపూర్ణ వికాసం పొందాలి. తన ఉనికినీ, ఔన్నత్యాన్నీ గ్రహించుకోవాలి. తన్ను తాను పూర్తిగా తెలుసుకోవాలి. కాని ఒక వ్యక్తి సమాజం నుంచి విడిపోయి ఉన్నట్లయితే అతనిలోని విశిష్ట గుణగణాలు వికాసం చెందడానికివీలులేదు. అందుచేత అతను సమాజంలో ఉండి, సమాజంలో భాగస్వామి అయితీరాలి. అతనుభాగస్వామి అయి ఉన్న సమాజం అతని పురోభివృద్ధికీ, వికాసానికీ తోడ్పడేదిగా, దోహదం చేసేదిగా ఉండాలేకాని, విఘాతం కలిగించేదిగా ఉండకూడదు. ఇక్కడ విద్యా విషయిక పద్ధతులు, ఆర్థిక, సామాజిక వ్యవస్థ, రాజకీయ ప్రభుత్వాల రూపురేఖలు ఇవన్నీ వస్తాయి. ప్రజాస్వామ్యం, సామ్యవాదం, తదితర రాజకీయ, సాంఘిక సిద్ధాంతాలన్నీ కూడా ఈ గీటురాయి మీదనే పరీక్షించ వలసి ఉంటుంది. పైన చెప్పినవన్నీ కూడా ఒక వ్యక్తి తన స్వార్థాన్నుంచీ, స్వప్రయోజనాల నుంచీ, తన ప్రేమలూ, ద్వేషాలూ, కావేషాలూ, ఆశలూ, ఆకాంక్షలనుంచీ, తనవాళ్ళూ తన బంధువులూ, మిత్రులూ, స్వార్థ స్వప్రయోజనాలూ అనేవలయంనుంచీ, అంతాతనదే, అన్నీతనకోసమే అన్న సంకుచిత భావాలనుంచీవిడి వడి అందరినీ ఆలింగనం చేసుకుని, తన సర్వస్వమూ అందరిదీ అనీ, తనవన్నీ అందరి క్షేమం కోసమే అనీ, అందరి క్షేమమే తన క్షేమమనీ విశాల, విశిష్ట భావాన్ని పెంపొందించుకొని, ఉన్నతంగా ఎదగడానికి ఎంతవరకు దోహదం చేశాయన్నదే ఆ గీటురాయి. ఇటువంటి విశిష్టలక్షణంగల ధోరణిలో సంక్షేమం అన్నా. సమష్టి శ్రేయస్సు అన్నా ఒక టే అవుతుంది. ఎందుచేతనంటే సంక్షేమం అనేది కేవలం ఒక వ్యక్తి యొక్క స్వార్థానికీ, స్వప్రయోజనానికీ పరిమితంచేయబడలేదుకనుక. ఇది కేవలం ఎవరికి వారు అవగతం చేసుకోవలసిన విషయం. సంపూర్ణ విశ్వాసంతోనూ, వివేకంతోనూ, ఆసక్తితోనూ ప్రతి ఒక్కరూ సాధనచేస్తే వారి మనస్సుల్లో ఒక స్పష్టమైన రూపకల్పన ఏర్పడుతుంది. నిజంగా సమాజం ఎందుకోసం ఉన్నదో, ఆ లక్ష్యంకోసం, ఆ ప్రయోజనంకోసం అప్పుడు వారు ఉపయోగపడడం జరుగుతుంది. దారిద్ర్యాన్నీ, వ్యాధినీ, అజ్ఞానాన్నీ ఒక్క భారత దేశంలోనే కాక, ప్రపంచంలో ఎక్కడ కనుపించినా సరే, వాటిని నిర్మూలించడానికీ, రాజకీయ దాస్యమనే మహోపద్రవం నుంచీ, ఆర్థిక దోపిడీనుంచీ మానవ జాతిని విముక్తి చెయ్యడానికి సంకల్పిస్తే, అది మన పవిత్ర ఆరాధనలో ఒక అమూల్య వర ప్రసాదం అవుతుంది.

ఇటువంటి వ్యవస్థ భౌతికవస్తుసంపదను నిరాకరించదు. కాని, ఒక మనిషి ఎన్ని

లక్షలు గడించాడన్నదానిని బట్టి మాత్రం అతని విలువను గణించదు. ఒకమనిషియొక్క ఆధిక్యత, ఔన్నత్యం అతను ఇతరులకోసం ఎంత త్యాగం చేశాడనే దానిమీద ఆధారపడి ఉంటుంది. కాని, అతను ఎంత కూడబెట్టాడనే దానిమీద కాదు.

మరొక ప్రధానమైన విషయంకూడా ఉంది. 'బ్రతుకు పోరాటమనీ, అందుకు తగినవాడే నిలబడి ఉంటాడనీ' చెప్పే ఒకానొక ప్రవర్తనాతత్వానికి ఇటువంటి సమాజంలో తావులేదు. ఆదిమ సముద్రంలో మట్టితో ఏర్పడిన పల్చటిపాచు మొదలు శూన్యమైన అంతరిక్షంలోగుండా అనంత నక్షత్ర వీధుల్లోకి ఎగిరి పోవాలని కాంక్షిస్తున్న నవీన మానవుడి దాకా సాగుతూ వచ్చిన సుదీర్ఘ పరిణామ క్రమంలో జీవితం, ఈసూత్రాలు పని చేయడం ద్వారా ప్రయోజనాలను పొంది ఉండవచ్చు. కాని ఈ పాతకాలపు, పాత వస్త్రాలను తీసిపారేసే తరుణం వచ్చింది. ఆటవిక సూత్రాలు శాసించిన పద్ధతులకు మానవుడు ఒక నమూనా కాకూడదు. నీవా-నేనా అని పోటీ పడడంకాక, పరస్పర సహకారమే జీవితానికి మార్గదర్శక సూత్రంకావాలి 'విరాట్పురుష' రూపమైన భారతీయ భావనలో ఇది అతి సుందరంగా చిత్రితమయింది. అఖండ సృష్టిలో చేతనాచేతనము లయిన, ప్రతిదీకూడా 'విరాడ్రూపమే.' ప్రాణశక్తి ప్రవాహాలలో మునిగి తేలుతున్న ప్రతి అణువూకూడా అఖండ సృష్టిని ఆడిస్తోంది, పాడిస్తోంది. సూక్ష్మాతి సూక్ష్మమైన ప్రతి జీవకణంయొక్క సుఖంకానీ, దుఃఖంకానీ తక్షణమే అఖండ సృష్టిలో సుదూరంగా ఉన్న మూల మూలలకూ ప్రసరింపచేస్తోంది. అందుచేత జీవులన్నిటి శ్రేయస్సులోనూ ప్రతి ఒక్క జీవి శ్రేయస్సూ ఇమిడి ఉన్నది. ప్రతిఒక్క జీవి శ్రేయస్సు కూడా జీవులన్నిటి శ్రేయస్సూ అవుతున్నది. ఒకరు, ఇతరులను అలక్ష్యం చేసి కేవలం తన సుఖంకోసం, తన శ్రేయస్సుకోసమే శ్రమ పడినట్లయితే, ఆ శ్రమయావత్తూ కూడా వృధాయే. అంతేకాదు ఇలాటి పని, ప్రతి వ్యక్తియొక్క శ్రేయస్సుకోసం తమ శ్రమను వెచ్చిస్తున్న తక్కిన అందరి యెడలా కృతఘ్నత చూపడం, ఘోరమైననేరం చేయడం అవుతున్నది. ఆ తక్కిన అందరూ ఎవరో మనం ఎరుగకపోవచ్చు. కాని మన అజ్ఞానంవల్ల, వారికి మనం ఎంతగానో ఋణపడి ఉండడం జరుగుతుంది. ఒకడు తన బుద్ధిబలంతోను, దేహబలంతోను బలాత్కారంగా అవతలవాణ్ణి పడగొట్టి పోటీ లేకుండా చేసుకోవాలని వాంఛించడం, ఒకడు తన స్వలాభాలకోసం, స్వప్రయోజనాలకోసం పరాయివాళ్ళను దోపిడీ చెయ్యడం, ఒకడు తన అభిరుచులు తక్కినవారి అభిరుచులకంటె ప్రత్యేకమైనవనీ, ఆధిక్యత కలవనీ అనుకుని ఆ ప్రకారం తక్కినవారిని అవమానించడానికి, వంచించడానికి పూనుకోడం - వీటిని కళ్ళాలతో కట్టి అదుపులో పెట్టవలసి ఉంది. సాధ్యమైతే సమూలంగా తొలగించవలసి ఉంది. వీటిస్థానే సహ

కారం అనే చైతన్య శక్తిని ప్రతిష్ఠించ వలసి ఉంది. అయితే ఈ సహకారం తేనెటెట్టెలో తేనెటీగల సహకారంవలె చీమల పుట్టలో చీమల సహకారంవలె అంధత్వంతో కూడుకున్నది కాక, ఒక వివేకవంతమైన, ఒక ప్రయోజన కర మైన, ఒక సంకల్పాత్మకమైన, ఒక్క మానవుడికి మాత్రమే సాధ్యమైన సహ కారంగా రూపొందవలసి ఉంది.

ఇటువంటి వ్యవస్థలో హక్కులకు కాక, విధులకుమాత్రమే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడినట్లు స్పష్టంగా కనుపిస్తోంది. అందరికీ సహాయం చెయ్యాలనీ, అందరి జీవితాలు సఫలం కావాలనీ చేసేకృషి తుదకు ఒక విధమైన భయభక్తులకు, పూజ్యతకు, సహనమునకు త్రోవ తీస్తుంది. మతంయొక్క సారాంశం కూడా ఇవి కలిగి ఉండుటచే కాంగ్రెస్ ఎప్పుడూ కూడా మతానికి వ్యతిరేకి కాదు. మహాత్ముని నాయకత్వాన కాంగ్రెస్ మతానికి అనుకూలంగా నడి చిందనికూడానిశ్చయంగా చెప్పవచ్చు ఇవాళ మనం భారతదేశం ఒక 'మత ప్రసక్తిలేని రాజ్యం' అనిచెపుతున్నాం. ఈ మతరాహిత్యం అనేదాన్ని విశిష్ట మైన అర్థంలో చెప్పాలంటే, భారత దేశంలో సాంప్రదాయసిద్ధంగా వస్తున్న విధానమే ఇది. మహాసామ్రాజ్యాలు నిర్మించి పాలించిన హర్షుడు, అశోకుడు అక్బరువంటి చక్రవర్తులు తమ స్వీయ మత విశ్వాసాలను అట్టిపెట్టుకుంటూనే స్వీయ మతసిద్ధాంతాలను అనుసరి స్తూనే, అన్ని మతాలకు చెందినవారికీ కూడా రాజ్యంలోని ఉన్నత పదవు లను అప్పచెప్పారు. మతాన్ని వ్యతి రేకించేవారూ, మతవిశ్వాసాలను అప హసించేవారూ మతరాహిత్య వాదా నికి ప్రబలశత్రువులని చెప్పవచ్చు. విజ్ఞానం పేరుతో మతంపై చౌకబారు విమర్శనలు చేయడం, ఆధునిక విజ్ఞాన బోధనలకు అవివేకంతో, అనాగరి కతతో ద్రోహంతలపెట్టినట్లే అవుతుంది. మతమూ, తత్వశాస్త్రమూ, విజ్ఞాన శాస్త్రమూ, వీటి మధ్య ఈనాడు గల అగాధం, పూర్వాంకంటే బహుస్వల్పం. నిజమైన విజ్ఞానవేత్త తాను పరిశోధనా లయంలోను, బోధనా మందిరంలోను సాధించినవాటికంటె మిన్నయైన సిద్ధాం తాలు ఉంటాయని అంగీకరిస్తాడేకాని, అలా ఉంటాయని విశ్వసించేవారిని ఎన్నడూ అపహసించడు.

## 3

ఇటువంటి ప్రధానభావనలను దృక్ప థాలను అంగీకరిస్తే, వెంటనే కొన్ని పర్యవసానాలకు త్రోవ ఏర్పడుతుంది. వ్యక్తిని 'మళ్ళీ పూర్వస్థితికి తీసుకుని వచ్చి, సమాజానికి మూలం అతనేనన్న విషయం గుర్తిస్తే, మన అభిప్రాయా లనేకం పునస్సృష్టి జరగడానికి వీలవు తుంది. విద్యలో ఒకకొత్త మార్పు రావాలి. ఇప్పుడున్న విద్యా పద్ధతులకు కొత్తనమూనాలుకనుగొనవలెనని ఆలో చించేవారికంటె, మూలంలో ప్రధాన మైన మార్పు ఏదో ఒకటి రావాలి. కేవలం విజ్ఞాన శాస్త్రాలలో పాఠాలు తప్పని సరిగా చేయడంవల్లకానీ, లేక 'సిలబస్'లో వృత్తిపనులను ప్రవేశపెట్ట

డంవల్లకానీ ప్రయోజనంలేదు. కొత్త తరహాకు చెందిన మానవకోటిని మనం తయారుచెయ్యాలి. ఈ నవీన మానవుడు, ఆధ్యాత్మిక బంధాలు తనను తక్కిన మానవులందరిలో ఐక్యం కావిస్తున్నాయన్న జ్ఞానం కలిగి వ్యవహరిస్తాడు. పరిపూర్ణఆత్మవికాసం పెంపొందించుకునేందుకు పరిశ్రమిస్తాడు. ఆ పరిశ్రమలో ఏకరీతిగా, ఎడతెగకుండా ఎల్లప్పుడూ, మానవసేవ చేస్తూ జీవిస్తాడు. స్వసుఖాలను పరిత్యజించి' స్వేచ్ఛ, జ్ఞానం అందరికీ లభ్యం కావాలనే కాంక్షతో శక్తివంచన లేకుండా కృషి కావిస్తూ కాంతివంతమైన జీవితం గడుపుతాడు. సృష్టియావత్తూ 'విరాట్ స్వరూపం' అన్న భావన వ్యక్తిని బాల్యంనుంచీకూడా చైతన్యవంతుణ్ణిగా మారుస్తూ, విశ్వకల్యాణమే తన కల్యాణం అన్న విశాల దృక్పథాన్ని అలవరుస్తూ వస్తుంది.

ఇటువంటి సమాజం ప్రజాస్వామ్యమే అవుతుంది. ఎంచేతనంటే ప్రజాస్వామ్యం అన్నది స్వేచ్ఛా స్వాతంత్ర్యాల అభివృద్ధికి అనువుగా ఏర్పడిన ఒక రాజకీయ వ్యవస్థమాత్రమే కనుక. ఇదే సర్వ జనసమ్మతంగా కూడా ఉంటుంది. సామ్యవాదంకాని జీవన ప్రణాళిక ఏదైనా సరే, మానవ వ్యక్తిత్వాన్ని సంకుచితం కావిస్తుంది. మానవ ఔన్నత్యానికీ, మానవుడు మానవుడుగా జీవించవలసిన విధానానికీ హాని కలిగిస్తుంది. ఇటువంటి జీవన ప్రణాళికలాలూకు సామ్యవాదం మార్క్సు, ఆయన అనుచరులు చెప్పే సామ్యవాదం కాదు. మార్క్సు ఒక మహాపురుషుడు. కాని ఆయన అభిప్రాయాలు అన్ని కాలాల్లోనూ మానవజాతికి మార్గదర్శకం కావు. ఆయన సిద్ధాంతాలనుంచి చేసిన తుది నిర్ణయాలు కొన్ని అసత్యాలయినవని చరిత్ర రుజువు పరిచింది. 'వర్గరహిత సమాజం' కావాలనే అభిప్రాయాన్ని పదే పదే వెలిబుచ్చడానికి మనం మక్కువ పడుతున్నాం. ఒక సమాజంలో అనేక కూటముల రూపంలో వర్గాలు ఉండవచ్చు. ఈ వర్గాలు ఉత్పత్తివిధానంలో వివిధ వృత్తులు, కర్మలు నిర్వహిస్తూ ఉండవచ్చు. అయినప్పటికీ ఒక వర్గం మరొక వర్గాన్ని దోపిడీ చెయ్యనంత వరకూ, ఒక వర్గం హక్కులను మరొక వర్గం భంగం కల్గించనంతవరకూ ఇది నిస్సందేహంగా సామ్యవాద సమాజమే అవుతుంది. ఈ వర్గాలమధ్య గల సంబంధాలు క్షితిజసమాంతరంగా ఉంటాయిగాని, కోణాకృతిలో ఉండవు ఇతను యజమాని, ఇతను పనివాడు అన్న భేదం ఉండదు. అందరూ తమందరికీ సంబంధించిన ఒకానొక ఉద్యమంలో భాగస్వాములూ, సహోద్యోగులూ అవుతారు. ఇహ వర్గకలహం అన్న ప్రశ్న తల ఎత్తడానికి తావే ఉండదు. మహాత్ముడు పెట్టుబడిదార్లను ధర్మకర్తలుగా అనుకోవలసిందని కోరాడు. సాధారణ అభిరుచులను అట్టిపెట్టి ఉంచడం అవసరమన్న తలంపుతో ఇలా చేశాడు. ఇందువల్ల పారిశ్రామికులకు, నిర్మాతలకు సమాజంలో

(తరువాయి 60 వ పేజీ)

# పెళ్లి చూపులు

★

## శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి

★

పాత్రలు :

| | | |
|---|---|---|
| భాస్కరరావు | (నాటక రచయిత) | 40 ఏళ్ళ వయస్సు |
| మహేంద్ర | (సి. ఐ. డి. ఇన్స్పెక్టరు) | 38 ,, ,, |
| కిశోర్ | ఇంటర్వ్యూకి వచ్చిన యువకులు | 24 ,, ,, |
| రఘుపతి | | 25 ,, ,, |
| శేఖర్ | | 26 ,, ,, |
| తేజోమూర్తి | | 25 ,, ,, |
| రాజయ్య | (భాస్కరరావు యింటి నౌకరు) | 50 ,, ,, |

[భాస్కరరావుగారింట్లో మధ్యహాలు. ఆధునిక అలంకరణతో చాల అందంగా ఆకర్షణీయంగా వుంది. హాల్లో రెండు కుర్చీలు-ఒక సోఫా-చిన్న టేబిలు వున్నాయి. టేబిలు మీద చిందర వందరగా పుస్తకాలు - అలారం టైంపీసు-టెలిఫోను - మరికొన్ని ఆఫీసు పరికరా లున్నాయి. గడియారంలో ముల్లు నాలుగు చూపుతూవుంది. తెరలేచే సరికి హాల్లో ఎవ్వరూ ఉండరు. టేబిల్‌మీద టెలిఫోను మ్రోగింది. కొన్ని క్షణాలయ్యాక రాజయ్య గబగబా వచ్చి రిసీవరు (Receiver) అందుకొన్నాడు.]

రాజ : (ఫోన్‌లో మాట్లాడుతూ) ఎవరు బాబూ - ఎక్కణ్నుంచి మాట్లాడుతున్నారు?... నేనండీ... రాజయ్యనండి. భాస్కర్రావుగారి నౌకర్ని... ఏమంటున్నారు?... అయ్యగార్ని పిలవమంటారా?.... దొడ్లో స్నానం చేస్తున్నారండీ.... ఉఁహుఁ-ఇంకొక పది నిముషాలు పడుతుంది .... ఆఁ ... మీ పేరూ?.... ఆఁ? రఘుపతిరావా ? ... చెప్తానండి .... ఓ-అలాగే.

[రిసీవరు యధాస్థానంలో పెట్టేశాడు. లోపల్నుంచి భాస్కర్రావు వచ్చాడు. ఒడ్డూ-పొడుగూ-మంచి శరీరచ్ఛాయ గల మనిషి. పెదవుల్లో మందహాసం. ముఖంలో ప్రసన్నత స్ఫుటంగా కన్పిస్తోంది.]

భాస్క : (లాల్చీ బటన్లు వేసుకుంటూ శాంతంగా) ఎవరు రాజయ్యా?

రాజ : అయ్యా - ఎవరో రఘుపతి రావంట మీరున్నారా? అని అడిగాడండి. కాసేపుండి రమ్మన్నాను.

భాస్క: ఓ-వాళ్లొస్తున్నారన్న మాట.

రాజ : ఎవరండీ వాళ్లూ.

భాస్క: రాజయ్యా ! నీకో విషయం చెప్పడం మరిచాను.

రాజ : ఏమిటి బాబూ ?

భాస్క: మన అమ్మాయికి త్వరలో వివాహం జరుగబోతోంది.

రాజ : మన అమ్మాయికా!!!

భాస్క: నా కూతురు - నా ఏకైక పుత్రిక ఉషారాణికి.

రాజ : మీ కూతురు ఉషారాణికా! అలులేదు చూలులేదు కొడుకు పేరు సోమలింగం అన్నట్టుగా వుంది....(నవ్వి) మీ కూతురేమిటండీ ... హాస్యాలాడుతున్నారా?

భాస్క: అది కాదు రాజయ్యా...

రాజ : చాల్లే బాబుగారూ. ఆరేళ్ళ నుంచీ మీ దగ్గరుంటున్నాను. నాకు తెలీకుండా....

భాస్క: నీకు తెలిసిందంతే. మనిషిని చూడక పోయినంత మాత్రాన లేదని అర్థమా?

రాజ : ఉంటే రహస్యంగా దాచాల్సిన అవసరం ఏ మొచ్చిందండీ?

భాస్క: వచ్చిందయ్యా. వచ్చింది గనకనే దాచాను. ఇప్పుడు ఆ అమ్మాయికే పెళ్ళి తలపెట్టాను. పిల్లకు అన్ని విధాలా తగిన వరుణ్ణి వెదికి పట్టడం సులభమా? ఆ కష్టాలు మనంపడగలమా? అంచేత పేపర్లో వేయించాను....అప్పుడే మనకు అప్లికేషన్లుకూడా వచ్చాయనుకో.

రాజ : ఎంతపని చేశారండి.

భాస్క: అమ్మాయిని చూట్టానికి కొందరు అబ్బాయిలొస్తారు యివ్వాళ.

రాజ : ఇవ్వాళే?

భాస్క: ఆఁ-ఇవ్వాళే. ఈగంటలోనే ఇంక కొద్ది నిమిషాల్లోనే.

రాజ : (తల గోక్కుంటూ) అమ్మాయి విషయం నేను నమ్మలేకుండా వున్నానండీ.

భాస్క: కన్నతండ్రి చెప్తున్నా నమ్మకం లేదా? భలే వాడివే. ఆలోచన లేకుండా, అమ్మాయి లేకుండానే పేపర్లో వెయ్యించడానికి నేనేం పిచ్చి తుగ్లక్‌నా?.... ఉందయ్యా. వుంది. సరేనా?.... ఆ వచ్చినవాళ్ళకు తకి తకీమని మర్యాద చెయ్యడం నీ డ్యూటీ. కాస్త చురుగ్గా వుండాలి. అంతే.

రాజ : అలాగే లెండి.

[మహేంద్ర చేతిలో పేపరు పట్టుకొని హడా విడిగా వచ్చాడు.]

మహే: ఏమోయ్ భాస్కరం! నీ కొకఅమ్మాయి వుందీ?

భాస్క: మీ కంతా యిదే సందేహం పట్టుకుందేం? నాకేం కూతురు వుండకూడదనా, లేక కూతుర్ని పుట్టించే యోగ్యత నాకు లేదనా మీ ఉద్దేశ్యం?

మహే: నో. నో. ఇన్నేళ్ళుగా లేని కూతురు ఒక్కరోజుకే ఎలా ఊడిపడిందా అని. ఈ ప్రకట నేమిటి పేపర్లో! ఇది నువ్విచ్చిందేనా?

భాస్క: ఆఁ. నేనే.

మహే: నాతో మాటైనా చెప్పలేదు. రహస్యమా?

భాస్క: రహస్యంలేదు. నా మొహం లేదు. కాసేపట్లో అన్ని విషయాలు బట్టబయలౌతాయి. రెండు గంటలు ఓపికపట్టు.

మహే: చెప్పవయ్యా బాబు. వెధవ సస్పెన్సులో మమ్మల్ని ఎందుకు చంపుతావు. అన్నట్టు ఈ మధ్య నువ్వేదో కొత్త నాటకం వ్రాస్తున్నా నన్నావ్. పూర్తయిందా?

భాస్క: అసలు కథావస్తువే దొరకలేదు. మూడువారాలు బుర్ర బద్దలు కొట్టుకున్నా ఒక్క ఆలోచన రాలేదు. విసిగిపోయి కలం అవతల పెట్టాను.

మహే: దుఃఖాంతం అయిందన్న మాట.

భాస్క: కాదు. సుఖాంతం అయి తీరాలి. చూడు మహేంద్రా. నువ్వు నాకొక సాయం చెయ్యాలి.

మహే: ఏమి టది?

భాస్క: పెళ్ళి విషయం చర్చించడానికి ఇంటర్వ్యూ ఒకటి ఏర్పాటు చేశాను. నువ్వు నాతో వుండి మా అమ్మాయికి మంచి వరుణ్ణి సెలెక్టు చెయ్యాలి.

మహే: దానికేం. నాకూ ఏం పని లేదు. ఉంటాను.

(కాలింగ్ బెల్ మ్రోగింది)

భాస్క: (వీధివంకచూచి) రావచ్చు... ఎవరో ఘనుడు వస్తున్నట్లుంది.

(కిశోర్ ప్రవేశించాడు)

కిశో: గుడ్ మార్నింగ్.

భాస్క: నమస్తే.

కిశో: భాస్కర్రావు తమరే అనుకోవచ్చునా ?

భాస్క: నేనేనండి.

కిశో: (మహేందర్‌ను చూపిస్తూ) వీరు.........

భాస్క: నా స్నేహితుడు మహేంద్ర.

కిశో: చాల సంతోషం... నా పేరు కిశోర్ అంటారు. నే నొచ్చిన పని మీకు తెలిసే వుంటుం దను కొంటాను.

భాస్క: కూర్చోండి.... రాజయ్యా, కాఫీ తీసుకురా

(రాజయ్య వెళ్ళాడు)

కిశో: ఇంక ప్రారంభించండి. నన్ను గూర్చి మీకేమైనా సందేహాలుంటే అన్నీ యిప్పుడే ముఖాముఖిని అడిగి తేల్చుకోండి. నేను ప్రతి విషయంలోనూ ఖచ్చితమైనమనిషిని. ముక్కుకు సూటిగా పొయ్యే తత్త్వం నాది.

భాస్క: ఓ!

మహే: ఘటికులుగా వున్నారే. నిజానికి మీలాంటి వ్యక్తికోసమే భాస్కర్రావు ఎదురు చూస్తున్నారు. నిష్కపటంగా మాట్లాడే వ్యక్తులంటే ఆయనకి పరమానందం.

కిశో: మీరు ఇంకా ప్రశ్నలు అడిగి నన్ను పరీక్షించుకోండి. నా కేరక్టర్ని గూర్చి మా కాలేజి ప్రిన్సిపాల్‌కు వ్రాసి కనుక్కోవచ్చు.

భాస్క: అక్కర్లేదు. మిమ్మల్ని చూస్తేనే తెలుస్తోంది! మీరెలాంటి వారో!... ఉఁ. మీ రెంతదాక చదువుకున్నారు ?

కిశో: ఏం చదువులండీ ఒట్టి హమ్‌బగ్. వాటికి వెచ్చించే డబ్బు, బూడిదలో పోసిన పన్నీరు ఒకటని నా అనుభవంవల్ల తెల్సుకున్నాను. అందువల్లనే ఎఫ్. ఏ. చదువుతూ వున్నవాడిని వాటిమీద అసహ్యం పుట్టి – వన్స్ ఫర్ ఆల్ స్వస్తి చెప్పేశాను.

మహే: స్వస్తి చెప్పారా, వాళ్లే మిమ్మల్ని డిస్మిస్ చేశారా?

కిశో: వాట్!! మీరు అవమానకరంగా మాట్లాడుతున్నారు.

మహే: క్షమించాలి. మా సందేహాలుంటే నిర్భయంగా తీర్చుకోమన్నారు. కనుక అడుగుతున్నాను. కోప పడితే లాభంలేదు.

కిశో: డిస్మిస్ అయ్యే ఆఘాయిత్యం నేనేం చెయ్యలేదు. నేనేం కాలేజీలో

అమ్మాయిల్ని ప్రేమించానా? ప్రేమ లేఖలు వ్రాసి వాళ్ళ వెంట బడ్డానా? ఏ అమ్మాయి జడ పట్టుకు లాగలేదు, దవడ పేలగొట్టించుకోలేదు. ఎందుకవు తాను డిస్మిస్? ఎన్ని గుండెల్లో చేస్తాడు ప్రిన్సిపాల్?

మహే: మాకా సందేహం రాలేదు లెండి. మీకు మీరే భుజాలు తడుము కొంటున్నారు గాని.... అయితే ప్రస్తుతం ఏం చేస్తున్నారు?

కిశో: నేను స్వేచ్ఛావాదిని. ఒకరి క్రింద ఉద్యోగం చేస్తూ, వాళ్ళ చెప్పు చేతల్లో మెలిగే బానిసత్వం నేను భరిం చను. తీవ్రంగా ప్రతిఘటిస్తాను. అందు కనే స్వేచ్ఛా జీవితం అనుభవిస్తూ ఈ సువిశాల ప్రపంచంలో హాయిగా....

భాస్క: పక్షిలాగా....

కిశోర్: పక్షి ?? నన్ను పక్షితో పోల్చుతున్నారా! ఏమిటి మీ వుద్దేశ్యం ?

మహే: అందులో తప్పేముంది. ఆయన ఉపమాలంకారం ప్రయోగిం చాడు. మీకు తెలీదేమో. వీరు అమోఘ మైన కవులండీ అసలు పక్షి అంటే మీ రెందుకు కలవరపడ్డారు. పక్షంటే ఏమను కున్నారు. దానికన్నా స్వతంత్ర జీవి ఎక్కడైనా వుందంటారా? స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పర్యాయ పదమే పక్షి! పక్షిని గురించి విపులంగా చెప్పాలంటే...

కిశో: మీరు నన్ను ఫూల్ చేస్తు న్నారు. నన్ను కించపరచటం నే నే మాత్రం సహించను. నన్నిక్కడికి రమ్మని ఆహ్వానించి, తాహాతు గమనించకుండా యిదేనా మీరుచేసే మర్యాద?

భాస్క: ఇందులో అమర్యాదకు చో టెక్కడుందండీ. మీరు మా అమ్మాయి కోసం వచ్చారు. మిమ్మల్ని అవమానిస్తే నాకు వచ్చే దేముంది?

కిశో: మొదట్నుంచీ గమనిస్తు న్నాను. మీ వుద్దేశం వేరుగా వుంది. నే వెళ్తొస్తా. గుడ్ బై.

(వెళ్ళబోయాడు)

భాస్క: కిశోర్! ఆగవయ్యా. అంత లోనే ఆగ్రహమా? ఇంత ఆగ్రహం కల వాడివి మా అమ్మాయితో ఏంచేస్తావు సంసారం?.... కూర్చో.

(రాజయ్య ప్రవేశించి ముగ్గురికి మూడు గ్లాసుల్లో కాఫీ పోసి ఇచ్చాడు)

కిశో: ........................

భాస్క: మీరు మా అమ్మాయిని చూశారా యిదివర కెప్పుడైనా?

కిశో: కనీసం ఫొటో అయినా చూళ్లేదు. దారిన పొయ్యే ఆడవాళ్ళని, ఎంతటి రూపవతులైనా ఓరకంట చూచే అలవాటు మన జన్మలో లేదు.

భాస్క: మీరు కలియుగంలో ఉండా ల్సినవారుగా లేరు.

మహే: అస్ఖలిత బ్రహ్మచారి భీష్ముడు తర్వాత మిమ్మల్ని చెప్పుకోవలసినట్లుంది.

కిశో: అదుగో. మళ్ళీ మొదలెడుతు న్నారు. నేనేం ఉత్ప్రేక్షగా చెప్పటం లేదు.

భాస్క: అబ్బే! మీరు అనవసరంగా అపార్థం చేసుకొంటున్నారు. మీరు నాకు పూర్తిగా నచ్చారంటే కారణం చెప్ప లేను. కాని ...

కిశో: ఆఁ! నేను మీకు నచ్చినట్టేనా?

మహే: తొందరపడకండి. ఆయనకి నచ్చినవాళ్ళని అమ్మాయి సహజంగా నిరాకరిస్తూ వుంటుంది.




కిశో : ఆఁ!! (క్రుంగిపోయాడు)

భాస్క : ఆయన మాటకేంగాని ముందీ ఫొటో చూడండి.

(ఫోటో యిచ్చాడు.)

కిశో : (తన్మయుడై పోతూ) ఓహ్, బ్యూటిఫుల్, బ్యూటిఫుల్!! అప్సరసలా వుందండి. అజంతా కన్యకల అందాన్ని తలదన్నుతూవుంది. సినిమాతారలు ఈమె ముందు కాలిగోటికికూడా సరిపోరు. రావుగారూ, I am sorry మామగారూ ...

భాస్క: Wait. Wait.

కిశో : ఈ అమ్మాయిని చేసుకోడానికి నాకేం అభ్యంతరం లేదండీ ... ఈ తక్షణం మూడుముళ్లు వెయ్యమన్నా వేస్తాను.

మహే : ఆగవయ్యా! కూరగాయల బేరంలా వుంది నీ వ్యవహారం. మంచీ చెడ్డా మాట్లాడుకోవద్దూ? కులం, గోత్రం వంశం, సంప్రదాయం....

కిశో : అవన్నీ పట్టింపులేదని మీరే పేపర్లో వేశారు?

భాస్క : వేశాం. ఇప్పుడుమాత్రం కాదంటున్నామా? కులం, గోత్రం, చదువు సంధ్యలు, ఆస్తిపాస్తులు కాదు మేం కోరేది—సంస్కారం, విజ్ఞానం .... ఇంతకూ మీకు ఇల్లరికం ఇష్టమేనా?

కిశో: ఇష్టపడేగా వచ్చాను....

భాస్క : మీవాళ్లు ఒప్పుకొంటారా?

కిశో : మావాళ్లెవరండి, ఉన్నవాడ్ని నేనొక్కడినే.

మహే: అయితే ఏ చిక్కూ లేదు.... అమ్మాయిని పెళ్ళాడితే పరువుగా బ్రతికించుకోగల సామర్థ్యం వుందా?

కిశో: ఆఫ్టర్ ఆల్ భార్యను పోషించలేని చవటనా, ఆమాత్రం సామర్థ్యం ...

మహే: ఆ సామర్థ్యం లేకే మామగారి పంచకెందుకు [illegible] తున్నావని అనుమానం వచ్చి అడిగాను.

కిశో: అంటే ఉద్దేశ్యం ?

మహే: ఇప్పుడైతే మామగారి ఆస్తి వుందిగనక, తింటూ కూర్చుంటావు. డబ్బు శాశ్వతమా? రేపు నీగతి ఏమవుతుందో, నువ్వు నిరాధారంగా వీధిలో పడ్డప్పుడు ఏం చేస్తావు ?

కిశో: ఏమైనా చేస్తాను. ఎంతకష్టపడి అయినా సంపాదించి, ఏలోటు రానివ్వకుండా చూస్తాను. నా భార్యకోసం ఎంత త్యాగమైనా చేస్తాను. అవసరమైతే నా ప్రాణాలిస్తాను. వెధవడబ్బు. మనం సంపాదిస్తే వస్తుంది. డబ్బుకోసం కాదు నేను మీ అమ్మాయిని చేసుకొనేది. ఆమె అందాన్ని, గుణాన్ని చూసి

భాస్క : ఇంకేం. ఆ హామీ ఇస్తే ఫర్వాలేదు. నా ఉషను నీ చేతుల్లో పెట్టి నిశ్చింతగా వుండగలను.... కానీ....

కిశో : కాని ?

భాస్క : కిశోర్! నీహృదయం విప్పి చెప్పు .... నువ్వు డబ్బుకంటె శీలానికి ప్రాధాన్యమిస్తావా ?

కిశో : నిస్సందేహంగా. డబ్బుకు దాసోహం అనే నీచుడ్ని కాను. గుణానికి విలువిస్తాను.

(రెండు నిమిషాలు నిశ్శబ్దం. మహేంద్ర సిగరెట్ వెలిగించి అందరి ముఖాల్లో భావాలు గమనిస్తున్నాడు. భాస్కరరావు ముఖకవళికలు మారాయి. శూన్యంలోకి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. కిశోర్‌తో ఏదో చెప్పాలని మళ్లీ సందేహిస్తూ [illegible])

భాస్క : కి....శో....ర్ ....

కిశో : ఆఁ.... ఏమండీ.

వచ్చేసంచిక....

భాస్క : ఏమీలేదు — ఏంలేదులే కిశోర్.

కిశో: చెప్పండి. ఎందుకో సంశయిస్తు న్నట్టున్నారు.

భాస్క: కిశోర్....నాచిట్టితల్లి జీవితం నీచేతుల్లో పెట్టున్నా. అంతా నీమీదే భారం నాయనా. నిన్ను పూర్తిగా నమ్ము తున్నా. నన్ను రక్షించాలి, బాబు....ఇవి చేతులు కావనుకో.

కిశో: అయ్యో! ఇదేమిటండీ. నేను చేసుకొంటా నన్నాగా.

భాస్క : నాకు తెలుసు. నువ్వు యిచ్చిన మాటమీదనే వుంటావు. అయినా యథార్థం నీకు చెప్పడం అవస రం....లోకుల దృష్టికి నేనొక లక్షాధి కారిని....

కిశో : నాకు తెలుసు. తమరు చెప్పాలా ?

భాస్క: కానీ-ఈనాడు బిక్షాధికారిని

కిశో: (షాక్ తిని) ఆఁ !!

భాస్క : అవును. భిక్షాధికారిని. బ్రతికిచెడ్డవాణ్ణి...నా జీవితం బాల్యదశ నుంచీ పూలపాన్పుగా సాగింది. ఈచేతు లతో వేలూ, లక్షలూ మంచినీళ్ళప్రా యంగా ఖర్చుపెట్టిన రోజులున్నయ్. పదేళ్ళక్రిందట భార్య పోయింది. నిరాశా నిస్పృహలు నన్ను గట్టిగా పెనవేసు కున్నాయి. బంధువులు నాచుట్టుచేరి నా ఆస్తి హారతికర్పూరంలాగ హరించి వేశారు. కడకు పూటకు గతిలేని బికా రినిచేసి విడిచారు కళ్ళలో వొత్తులు పెట్టుకొని గారాబంగా చూసుకొంటూ వచ్చిన నా కూతుర్ని పోషించలేక పోయాను. (కంఠం రుద్ధమైంది) గతిలేక....గతి లేకనే నాచిట్టిని శరణా లయంలో చేర్పించాను. "నాన్నా, నే నిక్కడేవుంటా. ఇంట్లోనే వుంటా"నని ఎంత ఏడ్చింది పిచ్చితల్లి. ఎన్నికష్టాలు పడింది! ఎంత నిస్సహాయంగా పెరిగింది. ఏం తప్పుచేసిందని ఆ పిల్లకీ శిక్ష?.. ఈ విషయాలు తల్చుకుంటే నా గుండె చెరువై పోతుంది కిశోర్....నాశిథిలమైన జీవితానికి వెలుగుబాట చూపించుకిశోర్! నీమేలు మర్చిపోను కిశోర్.

మహే : భాస్కరం, ఏమిటిది? నీకే మైనా పిచ్చి పట్టిందా? ఏమిటీ పిచ్చి వాగుడు?

భాస్క: నువ్వుండు మహేందర్! నన్ను చెప్పనీ. రహస్యం ఎన్నాళ్ళు దాగుతుంది? రేపైనా బట్టబయలౌతుంది.

కిశో : రహస్యమా?

మహే : రహస్యంలేదు. రాద్ధాంతం లేదు ఇతనికి మతి చలించింది. దయచేసి నువ్వు వెళ్ళిపోవాలి.

కిశో : వాట్ యీజ్ దిస్. ఇతను పిచ్చివాడా?

భాస్క : అబద్ధం కిశోర్. నువ్వేమి భయపడవద్దు. నేను ఉన్నదున్నట్టు నిజము చెపుతున్నానని యితనికి కోపం. నేను పిచ్చివాణ్ణికాదు.

కిశో : ఆమాట నీవు చెపితే నమ్మకం?

భాస్క: నిజాన్ని నమ్మలేనంత బల హీనుడయ్యావేం? నాకు పిచ్చిలేదయ్యా. నేను చెప్పింది యథార్థం.

మహే : చాల్లేవయ్యా భాస్కరం. నువ్వు గదిలోకి వెళ్ళు.

భాస్క : వెళ్ళను.

కిశో : ఆఁ!

మహే : చూశావా?

భాస్కర్ : కిశోర్! ఈ యిల్లు ఎవరిదనుకున్నావ్?

కిశోర్ : ఇంకెవరిది? మీదే!

భాస్కర్ : కాదు. మహేంద్రగారిది.

మహే: నాదా!!

భాస్కర్ : అవును. నేను తిరిగే కారు కూడా మహేంద్రదే.

కిశో : విచిత్రంగా వుందే!!

భాస్కర్ : నా కూతురి పెళ్ళికోసం యివి రెండూ అరువు తీసుకున్నాను.

కిశో : ఎందుకూ?

భాస్కర్ : నా దౌర్భాగ్యాన్ని కప్పిపుచ్చడంకోసం. ఎదిగిన బిడ్డకు పెళ్లి చేయటానికి ఎంతో ప్రయత్నించి విఫలుడనయ్యాను. ప్రగల్భాలు పలికే ఒక్క యువకుడు కూడా ముందుకు రాలేదు నన్ను చూసి అందరూ అసహ్యించుకొన్నారు. మనిషి దర్జాగా వుండాలనీ, నాతో వియ్యమందడం వాళ్ళహోదాకు తగదని నిరాకరించారు. నా మొరాలకించే వాళ్ళు లేకపోయారు.

కిశో: అయితే....?

భాస్కర్: నాకూతుర్ని నిరాధారంగా యీ ప్రపంచంలో ఎలా వదిలిపెట్టను?.... దీని పరిష్కార మార్గం మహేంద్రను ఆశ్రయించాను. నలుగురి కళ్ళకు నేను ఒక మనిషిగా, దర్జాగా కనపడాలని ఈ యిల్లూ, ఈకారు, నౌకరును ఏర్పరచుకొన్నాను. నీలాంటి యువకులు....

కిశో: నాలాంటి యువకులను మోసం చేసి నువ్వు ఒక లక్షాధికారివని భ్రమపెట్టి నీకూతుర్ని కట్టబెట్టాలనుకున్నావా?

భాస్కర్: కాదు.

కిశో: ఏంకాదు, నీమోసం కనబడుతూనే వుంది. అదృష్టవశాత్తు ఆమాటలు నీనోటి గుండానే వచ్చాయ్. నాకళ్ళు కప్పగలవా ? నాదగ్గరా నీ ఆటలు, నీ పన్నాగం ?

భాస్కర్ : కిశోర్! నువ్వెంతో మంచివాడివనీ, ఉత్తముడవనీ ఉన్న విషయం దాచకుండా చెప్పాను. నిన్ను మోసం చెయ్యాలని ఉద్దేశ్యముంటే చప్పుడు లేకుండా పెళ్లి జరిపించి తర్వాత చెప్పేవాణ్ని. "డబ్బుకు దాసోహం అనను. గుణానికి విలువిస్తా"నని నువ్వుధైర్యంగా నిలబడిచెప్తే నేనెంతో పరవశుణ్ణి అయ్యాను. అనలేదా ? నువ్వా మాట అనలేదా ?

కిశో: అన్నాను. నీవింత మోసగాడివని తెలిశాక నా ఉద్దేశ్యం మార్చుకున్నాను.

భాస్కర్ : ఏం మోసం? నీతో నిజం చెప్పడం మోసమా ? నీ తో నేను శ్రీమంతుణ్ని అని చెప్పలేదే ?

కిశో: అలా అనిపించి కనుగప్పడానికి ప్రయత్నించావ్.

భాస్కర్: నువ్వలా భ్రమలో పడ్డావ్. దానికెవడు బాధ్యుడు? నిజపరిస్థితి నీతో నివేదించాను. ఇష్టపడితే చేసుకోమన్నాను.

కిశో: కాస్త మెదడున్న వాడెవడూ చేసుకోడు. నేనేం Idiot ని కాదు.

భాస్కర్: ఇప్పుడనుకోవాల్సి వస్తుంది.

కిశో: షటప్ ! నీలాంటి మోసగాడితో మాట్లాడ్డం నాకేపరువుతక్కువ. నువ్విలా ధనికులైన యువకుల్ని ఇంటికి రాబట్టి నీకూతురకి తార్చాలని ప్రయత్నిస్తున్నావు. పోలీసు రిపోర్టు యిచ్చి నీఅంతు తేల్చుకుంటాను- టేక్ కేర్ !

(వెళ్తున్నాడు)

మహే: ఆగు! (గర్జించాడు)

కిశో : (ఆగి తిరిగి చూశాడు)

మహే: రిపోర్టు ఇస్తావా ? నీకేం అధికారం ఉంది ?

కిశో: అధికారం — దొంగల్ని, పట్టపగలు దోచే దోపిడి గాళ్ళను ప్రభుత్వానికి పట్టించే అధికారం ప్రతివాడికీ ఉంది.

మహే : నీలాంటి అధములకు కూడానా ?

కిశో; నోర్మూయ్. అట్టే పేలావంటే....

మహే: మెడబట్టి గెంటిస్తాను.

కిశో : పేరుపడ్డ పత్రికలో ప్రకటన చదివి మోసపోయాను.

భాస్క : కాదు. మోసం చెయ్యడానికొచ్చావు. అనుకున్నది తారుమారై తిరిగిపోతున్నావు. నువ్వు సోమరిపోతువని, వంచకుడవని, అబద్ధాలకోరువని నిరూపించుకున్నావు.

కిశో : నేనా?

భాస్క : మరెవరూ?....ఈణం క్రితం పెళ్ళికి మాటయిచ్చి ఏవేవో త్యాగాలు చేస్తానని, త్రవ్వి తలకెత్తుతానని గాలి కబుర్లు చెప్పావే, ఇప్పుడెందుకు తిరిగి పోతున్నావు?

కిశో : బుద్ధిలేక వచ్చాను. తప్పు తెల్సుకున్నాను. వెళ్ళక ఏంచేస్తాను.

మహే · వెళ్లి ఏంచేస్తావు?

కిశో : చూస్తారుగా ఏంచేస్తానో.

మహే : పోలీసు కంప్లయింట్ యిస్తావా?(ఫోనుదగ్గరికెళ్ళి రిసీవర్ చేతికిస్తూ) ఇదిగో కానియ్...ఇక్కణ్నుంచే పోలీసుల్ని పిలువు ... ఊ-చూస్తావేం?.... దొంగలట దొంగలు! నువ్వు దొంగవు కాదు!

కిశో : మాటలు మీరుతున్నయ్.

మహే : నీలాంటి వాళ్ళెందర్నో చూశాను సంపాయించడం చేతకాక, స్వయంగా పోషించుకొనే శక్తిలేక డబ్బున్న మామగార్ని పెళ్ళాడవచ్చావు. మామగారిదగ్గర చెమ్మలేదని, దరిద్రుడని తెలిసి జారిపోతున్నావు. నువ్వెవరివో, నిన్నేమని పిలవాలో తెలుసా?

కిశో : కాస్త మర్యాద తెలిసి మాట్లాడు!నోటికి వచ్చినట్లు మాట్లాడితే..

మహే : ఓహ్ - పురుషోత్తముడు దిగొచ్చాడు! రాజమర్యాదలు కావాలా?....డబ్బు నీకు తృణప్రాయమనీ, గుణం ముఖ్యమనీ పిచ్చివాగుడు వాగావు. ఆ మాటమీదనే వుండక క్షణంలో ఉద్దేశ్యం మార్చుకున్నావు. నువ్వు అబద్ధాలకోరువని రుజువుచేసుకొన్నావు. సోమరిపోతువని చాటుకున్నావు దొంగకు నీకేం అధికారం వుంది. ఇతరుల్ని వేలెత్తి చూపడానికి? నీలాంటి తుచ్ఛులవల్లనే దేశం-సంఘం-అధోగతి పాలవుతుంది. పోపో, ఇక్కణ్నుంచి.

కిశో : వెళ్తాను. వెళ్ళి మీ ఆటలు కట్టించకపోతే నేను కిశోర్ని కాదు.

(విసురుగా వెళ్ళిపోయాడు)

మహే : ఆడదాని సొత్తుతో బ్రతకాలని! వీడిదీ ఒక బ్రతుకే? (క్షణంమౌనం) భాస్కరం! నువ్వు నాటక రచయితవే కాదు, గొప్ప నటుడవని ఇప్పుడు తెలిసింది. నీమేధాశక్తిని అభినందిస్తున్నాను. నువ్వు కాసేపు వూరుకుంటే తిన్నగా పిచ్చాసుపత్రిలో అడ్మిట్ చేసేవాణ్ని... అబ్బ. ఏం నాటకం ఆడావయ్యా. నీలాంటివాడు మా డిపార్టుమెంట్లో

వుంటేనా ....ఐనా ఉద్యోగం చేసే ఖర్మ నీకేం పట్టింది కాని.

(కాలింగ్‌బెల్ మ్రోగింది. వెంటనే తేజో మూర్తి ప్రవేశించాడు)

తేజో : నమస్కారమండి.

భాస్క ; నమస్తే దయచెయ్యండి.

తేజో : భాస్కరరావుగారు మీరే ననుకుంటా.

భాస్క : అవునండి

తేజో : సో, ఐ యామ్ కరెక్టు అనుకున్నాను. మీశాంత గంభీరస్వరం వినగానే ఊహించాను .... నాపేరు తేజో మూర్తి

భాస్క : ఎమ్. ఏ

తేజో : ఆఁ - జ్ఞాపకం వుంచుకున్నారే!!....మీ అమ్మాయిని చేసుకోడానికి మూడు ముక్కల్లో మీ నిబంధనలు ఏమిటో చెప్పండి.

భాస్క: అలాంటివేమీ లేవే ముందు మా అమ్మాయి మీకు నచ్చడం ప్రధానం. ఇదిగో మా అమ్మాయి (ఫోటో యిచ్చాడు)

తేజో : ఒహో — వెరీ నైస్. తప్పకుండా పెళ్ళాడతానండి.

మహే : ఎవర్నండీ?

తేజో : ఎవర్నేమిటి. ఏమిటా ప్రశ్న?

మహే : అందుకు కాదులెండి. ఈమధ్య కొందరుయువకులు పిల్లనటుంచి డబ్బును పెళ్ళాడుతున్నారని వింటున్నా. అంచేత అనుమానం వచ్చింది.

తేజో;చాలాహాస్యంగామాట్లాడుతారే

భాస్క: (నవ్వి) ఇతడు నామిత్రుడు-మహేంద్ర. భావగర్భితంగా మాట్లాడటంలో ప్రసిద్ధుడు.

తేజో : డబ్బుకోసం వ్యక్తిత్వాన్ని అమ్ముకునే వ్యక్తులు వేరు. ఆజాతివాణ్ని కాదు నేను. డబ్బును మనం సంపాదిస్తాము కాని, అది మనల్ని సంపాదించలేదు కదా! డబ్బుకోసం వ్యక్తిత్వాన్ని విక్రయించేవాడుపశువుకన్నాహీనమంటాను

మహే : ఎంత చక్కగా చెప్పారండి మాటవరసకైనా.

భాస్క : రాజయ్యా! (లోపల్నుంచి 'అయ్యా'అని వినిపిస్తుంది.) ఒక కాఫీ.

మహే: ఐతే మీరు చెయ్యదలచుకున్న కార్యక్రమమేమిటి?

తేజో : వివాహం చేసుకోవడం.

మహే : నే నడిగేది తదనంతర కార్యక్రమం

తేజో : తదనంతరం చెప్పేదేముంది?

మహే : అదికాదయ్యా! ఉద్యోగం చేస్తారా, లేక పై చదువులేమైనా....

తేజో; అమెరికావెళ్ళాలనుకుంటున్నాను

మహే : మామగారిడబ్బుతోనా?— అంటే-నా ఉద్దేశం....

తేజో : మీరు సూటిగా మాట్లాడితే బాగుంటుందేమో. డొంక తిరుగుడుగా మాట్లాడటం నా కిష్టంలేదు.

మహే : అబ్బే. ఇందులో డొంక తిరుగుదేముంది? మీరుఇల్లరికంఉంటారా?

తేజో : ఉంటే?....

మహే : అప్పుడేగా మీరు అమెరికా వెళ్లేది?

తేజో : అప్పటి విషయం ఇప్పుడెందుకండి. ఇంతవరకేమీ కాలేదు.

భాస్క : అమ్మాయి విషయంలో మీకేమన్నా అభ్యంతరాలు....

తేజో : ఏమీలేవు. ఎంత సింపిల్‌గా పెళ్లి జరిగితే అంతమంచిది.

మహే: కట్నంవిషయం ఇప్పుడే తేల్చుకోవడం మంచిదేమో ?

తేజో : డబ్బు డబ్బు అంటారేమి టండి? ఆ మాటకొస్తే నేనేం డబ్బుకోసం చదివానా ? ఇంతకాలం మీడబ్బుతోనే బ్రతికానా చెప్పండి ?

మహే : లేదనుకోండి. మీ ఉద్దేశ్యం-కట్నం ఏమీ అఖ్ఖర్లేదా ?

తేజో : కట్నం కానీ ఇవ్వక్కర్లేదు. నన్ను అమెరికాకు పంపించండి. దట్ యీజ్ ఇనఫ్.

(రాజయ్య ప్రవేశించాడు. గ్లాసులో కాఫీ పోసి అందిస్తూ - తేజోమూర్తి ని తేరిపార చూశాడు).

రాజ : (ఆశ్చర్యంగా) మి-మి-మీ-రా బాబూ!....

తేజో: (కలవరపడి) నె - నె - నేనే ! (వణికిపోతూ సాసర్ క్రింద పడేస్తాడు)

మహే: రాజయ్యా, పాపం ఆయన చేతులు వణుకుతున్నయ్. కాఫీ చల్లార్చి ఇవ్వు.

తేజో: వద్దండి. నాకు కాఫీ అఖ్ఖర్లేదు. (గ్లాస్ టేబిలుమీద పెట్టాడు)

రాజ: తాగండి బాబుగారూ. ఎన్నాళ్ళకు కన్పించారు.

భాస్క: వీరిని నీకు తెలిసినట్టుందే రాజయ్యా ?

రాజ: ఆఁ-వీర్ని మర్చిపోలేన్లెండి నా జన్మలో.

తేజో: (లేచి) ఎక్స్క్యూజ్ మి ! నాకు అర్జెంటు పనుంది. మరొకసారి కల్సు కుంటానండి

మహే: అప్పుడే వెళ్తారా? రాజయ్య పాపం మిమ్మల్ని చూసి చాల సంతోష పడుతున్నాడు.

తేజో: నాకు చాలా అర్జంటు పనుం దండీ.

రాజ : ఉండండి బాబుగారు.

తేజో: అవసరమైన పనుంది. రేపొస్తాను (వెళ్ళబోతాడు)

భాస్క: ఆగండి ఒక అయిదు నిము షాలు మీతో ఇంకొక విషయం చెప్పాలి.

మహే: రాజయ్యా మూర్తిగార్ని నీకెప్పట్నుంచీ తెలుసు ?

రాజ : మూడు సంవత్సరాల నుంచి ఎరుగుదును.

మహే: ఓ —

భాస్క: ఎలా పరిచయం.

రాజ: అయన్ని మూడేళ్ళ క్రిందట ఓ పెళ్ళిలో చూశానండి కట్నం తక్కువిచ్చారని, అనుకున్నది యివ్వలేదని లేచి పోయాడండి పీటల మీదనుంచి.

భాస్క: ఎవరూ ?

రాజ : ఈయనే.

మహే : నువ్వు పొరబడ్డావేమో. ఆయన యిటువంటి వెధవపనులకి పోడు. అసలు కట్నాల జోలికి పోయేవ్యక్తి కాదు, ఏమనుకున్నావో.

రాజ : అనుకొనేదేమిటి బాబు. ఈయన జీవానికి ఆ పెళ్లికూతురు అవమానం భరించలేక ఉరెట్టుకొని చచ్చిపోయింది.

భాస్క: ఆఁ !!<br>మహే:నిజమా? } (ఒకేసారిఅంటారు)

తేజో : అబ్సర్డు. ఇతను ఎవర్నో చూసి నన్నను కొంటున్నాడు.

రాజ: ఎందుకుబాబు. నన్ను బుకాయిస్తావు. చేసిన ఘోరం చాలక నలుగురి ముందు ఏముఖం పెట్టుకొని తిరుగుతున్నావ్. ఛీ! ఎందుకయ్యా. నీవల్ల ఆ కుటుంబం చితికి పోయిందే, సర్వ నాశన మయిందే - ఎందుకయ్యా నీ చదువు ?

తేజో: నాన్సెన్స్! వీడెవడో బ్రూట్... నన్ను యింటికి రమ్మని మీసర్వెంటుచేత ఇన్‌సల్టు చేస్తారా? ఇదేనా మీ మర్యాద?

మహే: సర్వెంటు మాత్రం మనిషి కాదూ? నువ్వుచేసిన ఘోరానికి ఇదేమీ పెద్ద ఇన్‌సల్టు కాదులే కూర్చో

తేజో: మీరుకూడా నన్ను అవమానిస్తున్నారా?

మహే: రాజయ్య మాటలు అబద్ధం అనుకోను. అలా చెప్పాల్సిన అవసరం అతనికిలేదు. నువ్వు చేసిన ఘోరానికి....

తేజో: నేనేఘోరం చెయ్యలేదు. మీది ఆధారంలేని అనుమానం. అర్థంలేని మాటలు.

భాస్క: మూర్తీ! లోకం అంత గుడ్డిది కాదు. నిజం తెలుస్తుంది, నిజాన్ని కప్పిపుచ్చాలని వ్యర్థప్రయత్నం చెయ్యకు మరింత చిక్కుల్లో పడతావ్.

తేజో: మీతో వాదించడం అనవసరం. మీ యిష్టమైనట్లు అనుకోండి.

(వెళ్తున్నాడు)

మహే: ఆగు!

తేజో: ఆగాల్సిన అవసరం నాకులేదు.

మహే: మూర్తీ! వీధిలో అడుగు పెట్టి ఎంతో దూరం వెళ్ళలేవు.

తేజో: ఏం. బెదిరిస్తున్నావా? నేనేం పల్లెటూరివాణ్ని అనుకొన్నావా?

మహే: వాళ్ళకు సంస్కారంవుంది- చదువు లేకపోయినా. నువ్వు చదువు కొన్న పశువ్వి.

తేజో: ఏమన్నావ్?

మహే: నువ్వు హంతకుడివి!!

తేజో: నోర్మూయ్ (మహేంద్ర చెంప ఛెళ్‌మంది)

భాస్క: మూర్తి (హాలుదద్దరిల్లుతుంది)

రాట: ఏయ్.. ఇంత ధైర్యమా? (కొట్టబోయాడు)

మహే: రాజయ్యా ఆగు అతన్ని విడిచిపెట్టు...మూర్తి, నిజంగా నీకింత పౌరుషం వుంటే కట్నం యాచించి ఉండవు. ఆఅమ్మాయి ప్రాణాలు ఆహుతి తీసుకొని వుండవు.

తేజో: నేనెవరి ప్రాణాలు తీయలేదు ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకొంటే నాకేం సంబంధం?

మహే: ఆ ఆత్మహత్య ఎందుకు జరిగింది? కారణం నువ్వుకాదా? వాళ్ళు కాళ్లావేళ్లా పడి నిన్ను బ్రతిమాలుకున్నప్పుడు - ఆ ప్రార్థన మన్నించివుంటే - ఆ అభాగ్యురాలు జీవించి వుండదా?.... నీ చెల్లెలికి యిదే జరిగివుంటే అది నీగుండెల్లో మంటపెట్టదా? డబ్బు మనిషిని బ్రతికించలేదని నువ్వే అన్నావ్ జ్ఞాపకముందా? మానవత్వాన్ని అవగతం చేసుకోలేని చదువెందుకు? ఎవర్ని ఉద్ధరించను చెప్పు? మాట్లాడవేం మూర్తీ? ఇతర్లను బాధించి, పిల్చి పిప్పి చేయడమేనా నువ్వు నేర్చిన విజ్ఞానం? ఇందాక నిన్ను హంతకుడవని పిల్చినందుకు నామీద విజృంభించావే. నిజంగా నీవల్ల హత్యగావించబడ్డ కుటుంబం సర్వవిధాలా నాశనమైన కుటుంబం, నీమీద ఎంత ఆగ్రహం చూపాలి? మనిషిని ఉత్తీర్ణుణ్ని చేసేవి, మానవజన్మ ఎత్తినపుడు దాన్ని పరిపూర్ణం చేసేవి - నైతిక విలువలు మూర్తీ. డబ్బుకాదు.

(తేజోమూర్తి కొయ్యబారిపోయి అంతా వింటూ నిల్చున్నాడు. మహేంద్ర మాటలు ఒక్కొక్కటి శూలంలాగ అతని హృదయాన్ని తాకుతుంది. అతనిలో చలనం కల్పిం

చింది. అవమాన భారంతో క్రుంగిపోతూ తల వాల్చాడు. కళ్ళలో నీళ్లు తిరిగాయి.)

తేజో:(దుద్ధమైనకంఠంతో)మహేంద్రం గారూ....క్షమించండి...ఆవేశంతో....

మహే: నన్నన్నందుకు నాకేం బాధ లేదు.

తేజో: మీరు నాకళ్లు తెరిపించారు. నాతప్పులకు నేను తలవంచుకొంటున్నా. నాజీవితంలో యిది మరపురాని ఘట్టంగా, చిరస్థాయిగా నిలిచిపోతుంది... మహేంద్రంగారూ .... నేనింకేమీ చెప్ప లేను....రాజయ్యా, భాస్కర్రావుగారూ వెళ్ళొస్తాను.నమస్తే. (నిష్క్రమించాడు)

రాజ; (మహేంద్రతో)మీచెంపఅరిగింది.

మహే: కాదు రాజయ్యా. అతని జీవితం మారింది. అతని జీవితానికి ఈరోజు ఒక నూతన శుభోదయం.... భాస్కరం! ఏం అలా చూస్తూ నిలబడి పోయావ్. నువ్వు సృష్టించే నాటకాలకూ, వాస్తవ జీవితానికి ఎక్కడా పోలికలు లేవనా ?

భాస్క: నాకిదంతా ఒక స్వప్నంగా కన్పిస్తోంది.

మహే: కవులెప్పుడూ స్వప్నవీధుల్లోనే విహరిస్తూంటారుగా. కొందరికి నిత్యజీవితంలో నిత్య సమస్యల్తో పనే ఉండదు.

భాస్క: నా ఎక్స్పరిమెంటు యింత విజయవంత మవుతుందను కోలేదు.

(రఘుపతి ప్రవేశించాడు)

రఘు: లోపలికి రావచ్చునాండీ?

భాస్క:వచ్చేశారుయింకేం...రాండి.

రాజ : (మహేంద్రగారితో) బాబుగారూ, యీసారి ఈచెంప భద్రం.

(కాఫీగ్లాసుతో వెళ్ళిపోయాడు)

భాస్క: కూర్చోండి.

రఘు: నేనిందాకనే మీకోసం ఫోన్ చేశాను.

భాస్క: మీపేరు రఘుపతిరావా ?

రఘు: ఎక్సాట్లీ....(కూర్చోబోతూ కంగారు పడ్డాడు. గోడకు తగిలించివున్న ఫోటోను చూసి) ఈఫోటో ఎవరిదండీ?

భాస్క: ఏమిటలా కంగారు పడుతున్నారు?

రఘు : అఁ- ఏంలేదు. ఎదురుగా వుంటేనూ....

భాస్క:మీకుభయంగావుంటేతీసేస్తాను.

రఘు: అబ్బే నాకెందుకండి భయం.

భాస్క: ఈఫోటో మాఅమ్మాయిది..

రఘు: ఒహో.

భాస్క: అని కొందరు భ్రమపడుతుంటారు. కాని, ఇది ఒక సినిమాతార ఫోటో. ఇది చూచారా ? ఇదీ మా అమ్మాయి ఫోటో. (అందిచ్చాడు)

రఘు: (చిరునవ్వు నవ్వుతుంటూ చూస్తున్నాడు.

భాస్క: అమ్మాయిని గురించి వివరాలు పేపర్లో వేశాం. సందేహాలుంటే అడగవచ్చు.

రఘు : అబ్బే - అక్కర్లేదండీ.

మహే : చూశారా! అమ్మాయితో పనేలేదండీ. ఈ రోజుల్లో ముందు కావల్సింది....

రఘు : సుగుణం.

మహే : ఒహో! మీరొక మెట్టుపైనున్నారే:

రఘు : అంటే ?

భాస్క : ఈయన అలాగే మాట్లాడుతుంటాడులెండి. నామిత్రుడు పోలీసు ఇన్స్పెక్టర్ ....

రఘు : (అదిరిపడి) ఆ! పోలీస్.?

భాస్క : ఆఁ పోలీసంటే మీకు భయమా అలా అదిరిపడతారు. నేననేది వీరు పోలీస్ ఇన్స్పెక్టరులాగా ప్రశ్ని స్తుంటారని. ఆయన మాటల తీరే అంత.

రఘు : (నవ్వి) కొందరు అలాగే మాట్లాడతారు తీవిగా, ధీమాగాను.

భాస్క : మా అమ్మాయి ఫొటో చూశారుకదా ? ఇష్టపడినట్లేనా?

రఘు : నేనిక్కడికి రాకముందే ఇష్ట పడ్డాను. గుణసంపదల్లో మీ అమ్మాయిని గురించి చాలా చాలా విన్నాను.

భాస్క : ఓ-అలాగా. అందం సంపద వుండి దానికి తగిన వరుణ్ణి కూర్చి పెళ్లి చెయ్యలేక పోతున్నాను.

మహే : ఇప్పుడు రఘుపతిగారికేం - లక్షణంగా వున్నారుగా.

('భాస్కరావు గారూ' బయట పిలుపు. క్షణంగడిచాక శేఖర్ లోనికి వచ్చాడు)

శేఖర్ : నమస్కారమండీ.

భాస్క : నమస్తే.

శేఖర్ : కుమార్! ఇక్కడే వున్నావు నువ్వు?

రఘు : నాపేరుకూడా మర్చిపోయి నట్టున్నావ్. నాపేరు రఘు.

శేఖర్ : ఓ - పొరపాటు. అయినా ఎన్నాళ్ళయింది నిన్ను చూసి. రావు గారితో ఏదైనా పనుండి వచ్చావా?

రఘు : ఆఁ.

శేఖ : అయితే యిద్దరిదీ ఒకే పనై వుండాలి.

(మహేంద్ర భాస్కరావు చెవిలో ఏదో చెప్పాడు.)

భాస్క : ఇప్పుడే వస్తాను. కాస్త ఆగండి.

(అతనివెంటనే మహేంద్రకూడా వెళ్లారు)

రఘు : నీకేం మతిపోయిందా? బుద్ధి లేదు? కుమార్ అని పిలుస్తావు.

శేఖర్ : పొరపాటు అన్నానుగా. అయితే నీమీద యింకా పోలీసులదాడి తప్పలేదా?

రఘు : ఇంకా పదేళ్ళదాకా తప్పే ట్టులేదు. అనుక్షణం వెన్నాడుతూనే వున్నారు. రోజుకురోజు ఒక గండం. మొన్నకుమొన్న మద్రాసులో చావు తప్పి కన్ను లొట్టపోయినంత పనైంది. నీ విషయం ఎలా వుంది?

శేఖర్ : ఈమధ్య కాస్త మెరుగ్గా వుంది, అయినా ఏం చెప్పుకోను. ఈ పోలీ సుల్ని నమ్మడానికి లేదు. ఒకకంట కని పెడుతూ నీడలాగ వెంటాడుతూనే వుంటారు.

[ప్రక్కరూమ్‌లో చప్పుడైంది]

రఘు : ఉష్ - చిన్నగామాట్లాడు... ఏరా, నీడబ్బు ఖాళీఅయిందా ?

శేఖర్ : ఇంకానా మరి. ఆరువేల రూపాయల నగలు ఎన్నాళ్లొస్తాయి. నీ దగ్గర యింకా కొరవ వుందేమిటీ?

రఘు : ఉంటే ఈ చిక్కులెందుకూ, ఒరేయ్ జగన్నాధం....

శేఖర్ : ఉష్.

రఘు : శేఖర్, నువ్వెళ్ళిపోరా.

శేఖర్ : ఏం నన్ను వెళ్ళమంటున్నావ్?

రఘు : భాస్కరరావు కూతుర్ని నా కివ్వడం ఫిక్సు అయిందిరా.

శేఖ : అయితే ?

రఘు : నువ్వెందుకూ యింకా యిక్కడ?

శేఖ : రానీ, భాస్కరావుతో చెప్పి వెళ్తాను.

రఘు : జగన్నాథం! నామాట విని వెళ్ళిపో. నన్ను సుఖంగా బ్రతకనివ్వరా.

శేఖ : నేను జీవితంలో బాగా అలిసి పొయ్యాను. నాకు ఆశలుండవా? కొండంత ఆశతో వచ్చాను. ఎందుకు వెళ్ళాలి నేను?

రఘు : ముందుగా నేనొచ్చాను. ఆ అవకాశం నాకు దక్కాలి.

శేఖ : అది నీయిష్టం కాదు.

రఘు : ఇదిగో చెప్తున్నా. ఇక్కడ్నుంచి పోతావా, పోవా?

శేఖ : ఉఁహూఁ- వెళ్ళను.

రఘు : వెళ్ళకుంటే ఫలితం అనుభవిస్తావు.

శేఖ : ఏం? ఏంచేస్తావ్? పోలీసులకి అప్పగిస్తావా?

రఘు : అనుకుంటే అంతపని చేసి తీర్తాను.

శేఖర్ : నన్ను బెదిరించి నువ్వేమీ చెయ్యలేవు. నీ బ్రతుకు నాచేతుల్లోవుంది. అనవసరంగా యిద్దరం పట్టుబడిపోతాం.

రఘు : అందుకనే ఆప్రమాదం రాక ముందే వెళ్ళమంటున్నాను. నిన్ను బ్రతిమాలుకొంటున్నా, వెళ్లు. వెళ్ళిపో.

శేఖర్ : నేవెళ్ళను.

(మహేంద్ర, భాస్కర్రావు వచ్చారు.)

భాస్క : రఘూ! ఎవర్ని వెళ్ళమంటున్నావ్?

రఘు : ఏంలేదు, ఏంలేదులెండి.

భాస్క : శేఖర్‌గార్ని వెళ్లమంటున్నావా? ఎందుకు?

రఘు : అతని చరిత్ర చాలా వుందిలెండి. ఇతనితో సంబంధబాంధవ్యాలు పెట్టుకొంటే మీరు చిక్కుల్లో పడతారు ఇతని ప్రవర్తన అంత మంచిదికాదు.

శేఖ : నోర్మూయ్. నీప్రవర్తన కన్న ఘోరంకాదు. నువ్వే ఈయింటికి అల్లుడవైతే మామగారు కోర్టుకూ, జైలుకూ తిరిగి చావాలి.

భాస్క : కోర్టేమిటి, జైలేమిటి!- ఏమిటీ మాటలు?

రఘు : ఏంలేదులెండి. అర్థంలేకుండా మాట్లాడ్డం యితనికి అలవాటు.

భాస్క: తిన్నగా మాట్లాడుకుందాం కూర్చోండి.

రఘు : ముందు అతన్ని వెళ్ళిపొమ్మనండి.

భాస్క : ఏందుకు వెళ్ళడం. ఏం చేశాడని?

రఘు : ఇతడు చాలమంది ఆడపిల్లల్ని మోసంచేశాడు.

శేఖర్ : రఘూ! (కోపంతో ముందుకొచ్చాడు)

మహే ; వెయిట్, వెయిట్ అతన్ని చెప్పనివ్వండి.

రఘు : ఒక అమ్మాయిని ప్రేమించినట్లు నమ్మించి - గర్భంచేసి - ఒకనాడు ఆమె వొంటిమీది నగల్తో పారిపొయ్యాడు.

మహే : నగల్తోనా?

రఘు : అవును.

శేఖర్ : కాదు-అబద్ధం.

రఘు : చాల ప్రమాదకరమైనవ్యక్తి

మహే : ఆ అమ్మాయి గతేమయింది?

రఘు : ఏ అమ్మాయి?

మహే : గర్భవతి అయిన అమ్మాయి.

రఘు : పాపం! ఏమైందో ఎవరికీ తెలియదు. ఆత్మహత్య చేసుకుందని కొందరు అంటారు. ఇతనిమీద పోలీసులు

రిపోర్టు యిచ్చారు. వీడి అసలు పేరు జగన్నాధం.

(మహేంద్ర వీళ్లు గమనించకుండా వెళ్ళి ఎవరికో ఫోన్ చేశాడు).

శేఖర్ : నేను ఏ అమ్మాయినీ ప్రేమించలేదు. మోసం చెయ్యలేదు. నామీద ద్వేషంతో ఎదేదో కల్పించి చెప్తున్నాడు. వీడు నా ఆగర్భ శత్రువు. వీడుమాత్రం పెద్దమనిషి అనుకున్నారా వీడికి పెళ్లి అయింది.

రఘు : చూశారా! నేను ఇతనిగుట్టు బయట పెట్టానని నామీద అభాండం వేస్తున్నాడు. నాకింతవరకు పెళ్లి కాలేదండి. వెంటనే యితన్ని వెళ్ళగొట్టకపోతే....

శేఖర్ : అపరా, హంతకుడా!

మహే : (ఆశ్చర్యపడి) వెయిట్. వెయిట్.

శేఖర్ : ఇతనికి పెళ్ళయింది. పది వేలు నగలు తెచ్చింది భార్య. మొదట్నుంచి యితనికి ఆమె అంటే యిష్టం లేదు. రోజూ ఆమెను నానా బాధలు పెట్టాడు. నగలిమ్మని రోజూ వేధించేవాడు. ఆమె నిరాకరించేది. అందుకని ఆ సమయంకోసం వేచివుండి....ఒకనాడు భార్యతో రైలుప్రయాణం చేస్తూండగా మంచి నిద్రలో వున్న తన భార్యను నదిలోకి త్రోసేశాడు. ఆ నగల్తో పరారై పొయ్యాడు.

మహే : ఇది జరిగి ఎన్నాళ్ళయింది?

శేఖర్ : సుమారు నాలుగేళ్లు.

మహే : ఇతని పేరు కుమార్.

రఘు : కాదు. కానేకాదండి, అసలు నాకేమీ తెలియదండి. నా పేరు రఘు. వీడు నామీద కల్పించి చెప్తున్నాడు. మీరు వాడి మాటలు నమ్మకండి.

మహే : షట్ అప్ నాకు తెలుసు. మీరిద్దరూ దొంగలే. మీ యిద్దర్ని పట్టడం కోసం నాలుగేళ్ళనుంచి పోలీసు డిపార్టుమెంటు తలక్రిందులయ్యేటట్టు ప్రయత్నిస్తూంది. అనుకోకుండానే మీయిద్దరు ఒక్కసారే— ఒక్కచోట దొరికారు.

(రఘు, శేఖర్ - ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు)

కుమార్! మీ సంభాషణ విన్నాను. నన్ను బుకాయించి లాభంలేదు. మీరింక తప్పించుకోలేరు. కుమార్, నువ్వు నేరస్తుడివి కాకపోతే- 'పోలీస్' అనగానే ఎందుకు అదిరిపడ్డావు? గోడకు తగిలించి వున్న ఫోటోలో నీభార్య పోలికలున్నాయనికదూ, నువ్వు భయపడ్డావ్? ఇతర్లెవ్వరు గమనించడం లేదనుకున్నావా? నాఅదృష్టం కలిసివచ్చింది. ఈనాటితో మీపాపం పండింది.

(బయట పోలీస్‌వ్యాన్ హారన్ విన్పించింది.)

అదిగో. బయట మీకోసం పోలీస్ వ్యాన్ ఆగింది.

రఘు : (జేబులో చెయ్యి పోనిచ్చాడు హఠాత్తుగా)

మహే : కుమార్! పిస్టల్ తీశావంటే ప్రాణాలు పోతాయ్ (బోత్ హాన్డ్స్ అప్) ఉం! మిమ్మల్ని బ్రహ్మదేవుడైనా తప్పించలేడు కదలండి, బయట మీకు ఆహ్వానం సిద్ధంగావుంది. పోలీస్ రెడీ

(ప్రవేశం : పోలీసులు భయ భయంగా అడుగులు వేసుకుంటూ రఘుపతి, శేఖర్ పోలీసులవెంట పోతారు. భాస్కరావు కొయ్యబారి చూస్తున్నాడు.

మహే : (వెంటనే వచ్చి) భాస్కరం కన్‌గ్రాచ్యులేషన్స్.

భాస్క : మధ్య వాకెందుకు? నేనేం చేశానని.

మహే : సి ఐ. డి. ఇన్స్పెక్టరుగా నేను చెయ్యలేని పని నువ్వు చేసిపెట్టావు. నీ కూతుర్ని యింతవరకు చూడలేదు గాని నాకు మహోపకారం చేసింది.

భాస్క : నువ్వు ఇంకా ఏలోకంలో వున్నావ్. (నవ్వుతూ) అసలు నాకు కూతురు ఎక్కడిదయ్యా?

మహే : మరి ఈతతంగమంతా ఎవరికోసం చేసినట్టూ?

భాస్క : నాటకంకోసం!

మహే : (ఆశ్చర్యంతో) నాటకం కోసమా!.... అంటే?

భాస్క : కొత్తనాటకం వ్రాయాలని నాలుగువారాలు ఆలోచించాను ఏమీ తోచక పెళ్లిపేరుతో వినోదంకోసం చేసిన పని ఇలా విషాదాంతం అవుతుందని కలలోకూడ అనుకోలేదు.

మహే : నా ఇన్వెస్టిగేషన్ పూర్తయింది.

(పోలీస్వ్యాన్ హారన్)

అదుగో! పోలీస్ హారన్ పిలుస్తోంది. వెళ్లొస్తాను.

తెర

# విశ్వనాథమధ్యాక్కఱలు
## మున్నంగి శతకము

### శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

నిదురించు చున్నప్డు మేలుకొని యుందా నీవు గోపాల
నిదురించుచుందువో మేలుకొన్నప్డు నీవు గోపాల
నిదురించుటయు మేలుకొంట రెండు రెండే లేక యొకడ
ప్రిదులని నిద్రా విలోల! మున్నంగి వేణుగోపాల!

మొదల మానవ శిల్పి నిన్ను రాతి రూపున సంతరింప
నెదలోన నెంచుట యెంత యుచితమో యెఱుగను రాద
కదలని మెదలని నీవు రాతివి గాక యేమగుదు
పెదవిపై నవ్వుల కేమి? మున్నంగి వేణుగోపాల!

ఒక కొంతకును మంచివాఁడు గావున నుపలంబు గొనియె
నికరంబుగాఁగ వజ్రంబు గైకొన్న నీ యలభ్యతయు
ప్రకటితంబై యుండు నీదు గుండియ పట్టిచ్చి యుండు
పెకలింపగా రాని వాడ మున్నంగి వేణు గోపాల!

అలుకమై నిది యందు రిద్ధి యన రన నగునె నీయంత
దులుపుక పోయెడు వాఁడు లోకానఁ దోచడు గాక
పలుక వంచును నీకు విసిగి పోయిన భక్తులు నిన్ను
పిలుచుటయే తెల్వి మాలి మున్నంగి వేణు గోపాల!

మొకరి యనుస్వారమునకు నాద్యంతములు లే వటంచు
నొక గొప్పగాఁ జెప్పు టెంత తెల్వియో యో స్వామి దాని
నకట! శూన్యం బంట అంత తెల్వియే వ్యాఖ్యాత లెల్ల
వెకలుఁలు నీకైన వారు మున్నంగి వేణు గోపాల!

సంకల్పము వికల్ప మివ్వి రెండును జంతుత్వ మెడయు
నంకమ్ము కార్య కారణ సమన్వయ మద్ది మానవత
యింకఁ దా మవి పట్టు నట్టి పొలమున నెఱుగుట నిన్ను
వెంకటపతి యద్ది తెల్వి మున్నంగి వేణు గోపాల!

కన్నులలో నీరు నిలచి గొంతులో గాద్గద్య మొప్పి
వెన్నులోపలఁ బులకరించి మద్భుజా వీధిలోఁ గదలి
కన్నుంబొమలమధ్య బర్వు దించిన కరణి భాసించి
వెన్నుడా నీ వనుకొందు మున్నంగి వేణు గోపాల!

నిదురపోవుచు నున్న యప్పుడు వెలుంగు నిల్చి యాచుఁ
గదలకుండగ నున్న యప్పుడు వెలుంగు కల దన్న కలదు
నిదుర మేల్కని యున్నయప్పుడు సహస్ర నిర్ఘ రంబులుగ
ప్రిదిలినప్పుడు కదా వెలుగు మున్నంగి వేణు గోపాల!

వెలు గన్నయట్టిది స్వస్వరూప మావృత్తియా, వృత్తి
వెలుగుకు సహజమా యత్నకృత మట్లు వృత్తి కల్పితము
అలయికయే వృత్తి సముపసంహృతియా స్వస్వరూప
విలసన మిది యెల్ల నీవ మున్నంగి వేణు గోపాల!

ప్రభు! ఉపాధిగత సౌందర్య మననంబు వస్తు స్వరూప
విభవంబు ప్రాపింపఁ జేయునే వస్తు విభవంబు మనన
విభవంబు రెండు నంచులను నేకమై వెలసినఁ గాక
విభు! సాధ్య సాధ నైక్య మవు మున్నంగి వేణు గోపాల!

గిరి శేఖరస్థమే సరసి సుందరాకృతి కృపీటగమై
గిరియెత్తు ప్రస్తర శ్రేణి విన్యాసకృత రేఖ పొలుపా
పరగ నా కూడికో రుక్మిణీ సత్యభామా సమేత
విరచి తానంద తటాక మున్నంగి వేణు గోపాల!

నీ యంద మంతయు నందసుత నీవు నిద్రించు వేళ
మాయురే యెంత వర్ణించి తృప్తి యన్మాట కన్పడదు
ఓయి నీ వొకవేళ నిదుర మేల్కొందువో యన్న భయము
వేయి చెప్పము నీవు గాని మున్నంగి వేణు గోపాల!

ఆ నిద్రలో నీదు పెదవిపై నాడు నా చేఁత నవ్వు
ప్రాణమ్ములందునఁ గూరుచున్నది ప్రాణేశ మాకు
ప్రాణమ్ములను నీవు మేలుకొనునూహ రానీవు నిత్య
వేణు నాద విమోహ కారి మున్నంగి వేణు గోపాల!

వేని నిద్దుర పట్టరాని మోహమ్ము వెలయించు నింత
వాని మేల్కనుట యీ మోహ విచ్ఛిత్తి పచరించు నంత
కాన మేల్కాన వీవు మేలుకొన నీవు కలకల మమ్ము
పీనమా మత్తులోఁ బెట్టి మున్నంగి వేణు గోపాల !

నిన్ను నిద్దుర లోన నుండి లేపగా నిశ్చయించితిని
నన్ను మోహంపెట్ట లేవు నీ వింక నవ్వుల తోడ
న న్న జాగ్ర జ్జ్యోతి వైన యీ కల్గు లవి యెట్టు లుండు
వెన్నుడా చూడనే వలయు మున్నంగి వేణు గోపాల !

కనురెప్ప సంపంగిరేక పోల్కగాఁ గ్రమ్మిన మత్తు
వినివారితమ్ముగాఁ దమ్మి పోల్కగా విప్పవే కన్ను
అనితర లభ్య సౌందర్యసౌఖ శాయనికుడ నాచు
వినిపింతుఁ బ్రాభాత గీతి మున్నంగి వేణు గోపాల

మేలుకోవే స్వామి మేలుకో స్వామి మిలమిల లైన
యీ లీల వెలుగుల కేమి లే స్వామి హేరాళమై య
లోల చ్ఛటా పూర్ణమై మెఱుపు తీవలో యున్న సరసి
వేలా కమం బైన లీల మున్నంగి వేణు గోపాల!

మేలుకోవే స్వామి మేలుకో స్వామి మృదుల సౌదామి
నీ లతా నవ పిశంగ చ్ఛటా హాసంతీ నట త్స్నమము
మేలుకోవే స్వామి మేలుకో చల న్మేచ కాంభోద
వేళా హాస దిరమ్మదముగ మున్నంగి వేణు గోపాల!

మేలుకో నా స్వామి నాదు గుండెలో మేలుకో కలిత
మాలా చల ద్గాఢ దుఃఖ నిచయ సంహారణమ్ము గాఁగ
కేళీ మన స్సమాకృష్ట మోహ నిచయ నికృంతనమ్ముగను
భీ లతా మూలమ్ము తునుగ మున్నంగి వేణుగోపాల!

మేలుకో నాదు గుండియను దయచేసి మేలుకో వయ్య
మేలు కోరినవారి కొఱకు జాగుగా మేలుకొందు వని
కాలాన మేల్కాను సరికిఁ బ్రాణాలు కడఁబట్టు నంచు
వే లుదాహరణముల్ కలవు మున్నంగి వేణు గోపాల!

నిదుర మేల్కొను మంచు మాటిమాటికి నీకిట్లు చెప్ప
నిదురపోయెదు వాఁడిచట నెవం డని నీ వందు వేని
నిదుర నాకును మాత్ర మున్న దా యేమి నిద్రాభి నయము
ప్రిదిలించు కొను మంటి గాని మున్నఁగి వేణు గోపాల!

అభినయించుచు నిద్ర మేలుకొని యుంటి ననుఁ కొంట వేఱు
అభితో వినిద్రా గతుండు నా రీతి ననుకొంట వేఱు
సభయులు మాదృశుల్ స్వామి రెండవ జాతి నీ కరుణ
విభు! లేదు, లేదు జాగ్రత్త మున్నంగి వేణు గోపాల!

ఉన్నదా నందన వనము వని కుడి కొగ్గి మిన్నేఱు
చన్నది మలుపుగా మలుపులోఁ దురాసాహుని మేడ
కన్నా కగు సుధర్మ వీధి కని చెప్పఁ గన్నట్టు లౌన
విన్న మాత్రాన స్వర్గంబు మున్నంగి వేణు గోపాల!

పెదవిపైఁ జిన్నారి జాజి పూనవ్వు పిల్లన గ్రోవి
నుదురుపై నెమలి పించియము క్రొన్నిడ నూల్కొను ననగ
మదన గోపాలుని వదన మండల మాధుర్యమెల్ల
విదిత మైనదియె గుండియకు మున్నంగి వేణు గోపాల!

విన్నాము నినుఁ గూర్చి లక్ష మారులు వేణు గోపాల
విన్నది విన్నట్లు గాక కన్నట్లు వెలయింతు వీవు
నిన్నుఁ గన్నది లేదు సుంత యిది సుమీ నీ దొంగ తనము
వెన్నయుఁ బెరుగును గాదు మున్నంగి వేణు గోపాల!

ఇది త్రోవయని చెప్పి దారి పోలిక లవెల్లను చెప్ప
నది గమ్య మనుకొంట కన్న నవివేక మని వేర కలదె
పదిబార లేగి గమ్య స్థల ప్రాప్తి పగిది నాడెదరు
బెదరి నిదుర మసలు గతి మున్నంగి వేణు గోపాల!

సగము ముప్పావును కించి దూనంబు సాధించి నట్టి
నిగమాంత వేత్తలు స్వీయ పథము వర్ణించిన దెల్ల
తగ వారి యనుభూతి పెఱల కది యొక్క తగనట్టి భ్రాంతి
పెగల నీయని నిద్రత్రోవ మున్నంగి వేణు గోపాల!

# ప్రతీకారం

★

ఆంటొన్ పి. చెకోవ్

అనువాదం : రెంటాల

తన భార్య పరపురుషుడితో సంబంధం పెట్టుకున్నదని తెలుసుకున్నాడు ఫెదొర్ సిగయెవ్. ఆ ఉత్తర క్షణంలోనే ప్రతీకారం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. అందుకోసం తుపాకులు, పిస్తోళ్ళు అమ్మే అంగడికి వెళ్లాడు. ఊళ్ళోకల్లా షుమక్స్ అండ్ కంపెనీ పెద్ద షాపు అక్కడ రకరకాల ఆయుధాలు, మందు గుండు సామగ్రులు అమ్ముతారు ఫెదొర్ ఎకా ఎకి షాపుకు వెళ్ళి ఒక మంచి రివాల్వరు చూపించమని అడిగాడు. అతని ముఖంలో కోపం, విచారం, తిరుగులేని ఒకానొక నిర్ణయం - ఇవన్నీ ద్యోతక మవుతున్నాయి.

"ఇప్పుడేం చెయ్యాలో నాకు తెలుసు. నా గౌరవం కాస్తా గంగలో కలిసింది. కుటుంబ ప్రతిష్ట యావత్తూ కూలిపోయింది. ఈ భ్రష్టురాలి వల్ల నేను తల ఎత్తుక తిరిగే ప్రాప్తం లేకుండా పోయింది. ఇందుకు ప్రాయశ్చిత్తం చేసి తీరాలి. పగ తీర్చుకోవాలి - ముందు నా భార్యను, దాని మిండగాణ్ణి కాలుస్తాను. తరువాత నేను -" ఇలా తనలో తాను అనుకో సాగా డతను.

'ఆలూ లేదూ, చూలూలేదూ కొడుకు పేరు ఏదో-అన్నట్లు' ఇంతవరకూ అతను రివాల్వరు కొననూలేదు, ఎవర్నీ కాల్చనూ లేదూ- అప్పుడే అతని ఆలోచనలు చాలాదూరం పోయి, ఆకాశం అంటాయి. వింత వింత ఊహలు విను వీధుల్లో విహరించ సాగాయి. ఆ ఊహాజగత్తులో, తను చేయబోతున్న ఘోరకృత్యం అతని కనులముందు పొడగట్టింది. 'తానుముందు భార్యను కాలుస్తాడు.తరువాత ఆవిడ ప్రియుణ్ణి హత్య చేస్తాడు. తుదకు తన్నుతాను కాల్చుకుని చనిపోతాడు. ఈ ఘోరాన్ని తిలకించడానికి ఎక్కడెక్కడి చుట్టాలు, స్నేహితులు, ఊళ్ళో జనం వచ్చి తన ఇంటిచుట్టూ గుమి కూడతారు. ఈభయంకరమైన వార్తను పత్రికలవాళ్లు ఇంతింతలావు అక్షరాలతో శీర్షికలు పెట్టి ప్రకటిస్తారు. చిన్నాభిన్నమైపోయిన తన కుటుంబాన్ని గురించి సంపాదకీయాలు వ్రాస్తారు.' ఈ దృశ్యాలన్నీ అతని మనోఫలకం మీద ముద్రితమైనాయి.

షాపులోవున్న గుమస్తా పొట్టిగా ఉన్నాడు. ఇంత లావుబాన పొట్ట. కాని మనిషి మాంచి చలాకీగా కనుపిస్తున్నాడు. ఇస్త్రీ మడత మాయని, తెల్లటి చొక్కా వేసుకున్నాడు. రకరకాల రివాల్వర్లు, ఫెదొర్ ముందుపడేసి, చిరునవ్వులు ఒలకపోస్తూ ఇలా అన్నాడు.

"చూడండీ! ఈ రివాల్వారున్నదే, ఇది చాలా మంచిది. సరికొత్తరకం, స్మిత్-వెస్సన్ కంపెనీవారు తయారు చేసింది. చూడండీ, ఎంత అందంగా తయారుచేశారో! మొన్న మొన్ననే వచ్చిందండీ 'మార్కెట్'లోకి. ప్రతి రోజూ ఈరకం డజన్లకొద్దీ అమ్ముతున్నామనుకోండి. దొంగలు, తోడేళ్ల-ఇంకా ఇతర బాధలనుంచి తప్పించుకోడానికీ, ఆత్మరక్షణ కావించుకోడానికి, ఈ రివాల్వరు ఎంతో బాగా ఉపకరిస్తుంది సుమండీ. చూడారూ? దెబ్బ తప్పడమంటూ ఉండదు. దూరంనుంచి అయినా సరే, గురిపెట్టి కాల్చారూ అంటే- గుండు దూసుకుపోవాల్సిందే, మరి తిరుగు లేదు. దుర్బుద్ధి పుట్టిన భార్యను, ఆవిడ ప్రియుణ్ణి-కళకట్టి కాల్చవచ్చు సుమండీ దీంతో. ఆఖరుకు ఆత్మహత్య చేసుకోడానికయినాసరే, ఇది అద్భుతంగా పనిచేస్తుంది, నా మాట నమ్మండి. నేచూచినంతలో దీనికన్నా మంచి రకం లేదు."

ఇలా అంటూ గుమాస్తా రివాల్వరు చేత పుచ్చుకున్నాడు. గాలిలో గురిపెట్టి 'ట్రిగర్' లాగి చూపించాడు. ఎంతో తమాషాగా దాని పనితనానికి తనెంతో మురిసిపోతున్నట్లు కనుపించాడు. నిజంగా అప్పుడతని ముఖకవళికలు పరిశీలిస్తే, అంతఅందంగా, అంత ముచ్చటగా 'స్మిత్-వెస్సన్' కంపెనీవారు తయారుచేసిన రివాల్వరు దగ్గర ఉండాలేకాని, ఒక విందు ప్రాణం తీయడం ఎంతసేపు అన్నట్లు అగుపించాడు.

"అవుతే దీని ఖరీదెంత?" అని అడిగాడు ఫెదొర్ సిగయెవ్.

"ఎంతోనా, నలభైఅయిదు రూబుళ్లు" అని చెప్పాడు షాపులో గుమాస్తా.

"అబ్బో, చాలా ఎక్కువే!"

"అవుతే ఉండండి. మీకు మరో రకం చూపిస్తాను-ఇంతకంటె చౌకరకం మా దగ్గర చాలా రకాలున్నాయి. ఎంతలో కావాలంటే అంతలో ఇస్తాను. చూచారా? ఫ్రాన్సులో తయారైన రివాల్వరు ఉంది. దానిధర పద్దెనిమిది రూబుళ్ళే. కాని-(ఇలా అంటూ అతను ముఖం చిట్లించుకున్నాడు) అదేమంత మంచి రకంకాదు. మన తాతలనాటి 'ఫ్యాషన్'లో తయారయింది. చాలా మొరటుగా ఉంటుంది. పనిపాటలు చేసుకునేవాళ్లు, పల్లెటూరి రైతులు తప్ప నవనాగరికులయిన వాళ్ళెవరూ దాన్ని వాడరు. చూచారా బాబుగారూ ? భార్యను కాల్చాలన్నా, ఆత్మహత్య చేసుకోవాలన్నా-దాన్ని ఉపయోగించడం ఈకాలంలో మోటయిపోయింది. వాడితే మీవంటివారు 'స్మిత్-వెస్సన్' కంపెనీదే వాడాలండీ."

"నేనెవరినీ చంపబోవడమూ లేదూ, ఆత్మహత్య చేసుకోవడమూ లేదయ్యా. మేంఉండే చోట దొంగలబోరు జాస్తిగా ఉంది. వాళ్ళను భయపెట్టడానికి ఒక రివాల్వరు కొందామని వచ్చాను అంతే. అంటూ అబద్ధ మాడాడు ఫెదొర్ సిగయెవ్.

"మీరు ఎందుకోసం కొంటేం మాకేమండీ-మాకు దాంతో పనిలేదు, వచ్చిన ప్రతిఒక్కరీన్ని 'దేనికోసం, ఏమిటి కథ?' అని ఇలా ఆరా తీస్తూ కూచుంటే మా వ్యాపారం చప్పగా, ఆరిపోతుంది. కొట్టు కట్టేసుకుని, నెత్తిన గుడ్డ వేసుకుని పోవాలి. చూచారా? దొంగలను హడలగొట్టాలంటే ఈ చౌకరకం రివాల్వరు పనికిరాదు. అసలిది పెద్దమోత మోగనే మోగదండీ. కాకపోతే మీకు మరో సలహా చెబుతాను వినండి. ఇలాంటివాటికి మామూలుగా అంతా వాడే 'మార్టిమెర్ పిస్తోలు' ఉంది చూచారా, ద్వంద్వ యుద్ధాల్లో ఉపయోగించేది ఆ పిస్తోలు కొనండి." అన్నాడు షాపులో గుమాస్తా సవినయంగా, కళ్ళు తిప్పుకుంటూ.

ఫెదొర్‌కు మెరుపులా ఒక ఆలోచన తట్టింది. "పోనీ, నా భార్యతో సంబంధం పెట్టుకున్న ఆ భటాచోర్‌ను పదిమందిలో నిలవేసి అడిగితే ; ఛీ, ఛీ వాడికంత తాహతు కూడానా ? అది వాడికి మరీ అలుసు ఇచ్చినట్లు కాదూ ? ఇప్పటికి అయింది చాలక - ఇంకా నలుగురిలో నగుబాట్లు నాపని. అలాకాదు. ఆ పుండాకోర్‌ను పిచ్చికుక్కను కాల్చినట్లు కాల్చాల్సిందే." అనుకున్నాడు తనలో.

షాపులో గుమాస్తా, రివాల్వర్లు టేబిల్‌మీద గుట్టపడేసి ఒక్కొక్కదాన్ని చూపిస్తున్నాడు. ముఖం అష్టవంకరలు తిప్పుతున్నాడు. పెదవులపై చిరునవ్వు చిందుతూనే ఉంది. మాట తీరుపోకుండా ఏదేదో మాట్లాడుతూనే ఉన్నాడు.

ఏమైనా ఫెదొర్‌కు తక్కిన వాటన్నిటికంటె 'స్మిత్ - వెస్సన్' కంపెనీ రివాల్వరే నచ్చింది. దాన్ని చేత పుచ్చుకుని ఆలోచనలో మునిగిపోయాడు. తను భార్యను ఎలా కాల్చేదీ, గుండు సూటిగా వెళ్ళి ఆవిడ గుండెల్లోనుంచి ఎలా దూసుకపోయేది,ఎలాఇల్లంతానెత్తురువరదలయి నేలమీద తివాచీలు, చాపలు తడిసి ముద్దయిపోయేదీ, ఎలా ఆ భ్రష్టురాలు ఆఖరు క్షణాల్లో గిలగిల తన్నుకుంటూ మరణవేదన పొందేదీ-అంతా ఊహించుకో సాగాడు.

"వీల్లేదు. ఆవిడ చావటానికి వీల్లేదు. ముందు వాణ్ణి చంపి తరువాత నేను చస్తాను.

ఆమెను ప్రాణాలతో వదిలిపెడతాను. ఇటు కట్టుకున్నవాడు, అటు ఉంచుకున్నవాడు చచ్చే సరికి దాంతో, దాని బ్రతుకు బండలయి పోతుంది. బ్రతికినంతకాలం కుళ్లి కుళ్లి చస్తుంది. ఒక్కసారి చచ్చేకంటే. ఊపిరి ఉన్నంతకాలం ఇలా కుమిలి కుమిలి చావడమే ఇలాంటి నీచురాలికి తగినశిక్ష. కామోద్రేకంతో కన్నూ మిన్నూ కానక ప్రవర్తించే నీచకాంతలకు ఇలాంటిశాస్తి కావల్సిందే" అనుకున్నాడతను.

తరువాత తన చావు, అతని కళ్ళముందు పొడగట్టింది. తనను శ్మశానానికి మోసుకు పోతుంటే, ఆవిడ నెత్తీ-నోరూ కొట్టుకుంటూ ఏడుస్తూ ఉండడం, ఇంతకీ ఘోరానికి కారణభూతురాలయిన ఆవిడవంక జనం ఆగ్రహావేశాలతో వళ్ళంతా కళ్లుచేసుకుని చూస్తూ ఉండడం-అతనికి కనుపించింది,

అంతలో గుమాస్తా "చూడండి బాబుగారూ! మీకు 'స్మిత్-వెస్సన్' కంపెనీ రివాల్వరే నచ్చినట్లుంది" అంటూ అతని ఆలోచనలకు అంతరాయం కలిగించాడు: "ధర చాలా ఎక్కువ అంటున్నారు కనుక-మీకోసం ఓ అయిదు రూబుళ్లు తగ్గించి ఇస్తాను. అదీ. మీ కోసం, లేదంటారూ, మరికొంచెం తక్కువ ధరలో కూడా ఉన్నాయి వేరే రకాలు ఇలా అంటూ అతను మరో సొరుగులో నుంచి, మరో డజను రివాల్వర్లు బయటికి తీశాడు.

"ఇదిగోనండి.. ఇది ముప్పయి రూబుళ్లు, మీవంటివారుకూడా ఇలా తటపటాయించడం బాగా లేదు, డబ్బుకు కటకట్లాడుతున్నదని అనుకోవచ్చు మీరు. విదేశాలనుంచి వచ్చే వస్తువులమీద రోజురోజుకు 'డ్యూటీ' పెరిగి పోతున్నదనీ అనుకోవచ్చు. కాని బాబుగారూ! ఒక్కమాట, కాస్త ఖరీదైన వస్తువులు తమ వంటివారే కొనడానికి వస్తాయిస్తే ఇహ, వ్యాపారస్తులం మా పనేం కావాలి? నోట మట్టి కొట్టుకొని పోవల్సిందే! రష్యాలో తయారయిన చౌకరకం రివాల్వర్లు అలగాజనం కొనుక్కు పోతుంటారు. వాటితోనే తృప్తిపడతారు వాళ్లు. మీ శాహతుకు అవి పనికిరావు. మాట వరసకు చెబుతాను. 'తులా'లో తయారుచేసిన రివాల్వర్లే చూడండి. చౌకకు చౌకే - కాని ఏం లాభం? దాంతో మీ భార్యను గురిపెట్టి కాలిస్తే ఆమెగారికి ఈషణ్మాత్రం దెబ్బ తగలకపోగా మీరెక్క మాత్రం ఊడివచ్చేటంత పని అవుతుంది!"

ఫెదొర్ సిగయెవ్‌కు అకస్మాత్తుగా ఒక విచారం ముంచుకొచ్చింది.- ఎవరైనా తన విరోధికి ప్రతీకారం చెయ్యదలుచుకుంటే అలా చేసి, దానిమూలకంగా ఆ విరోధి అల్లాడిపోతుంటే తాను కళ్ళారా చూడాలి. అప్పుడే అతనికి సంతృప్తీ. సంతోషమూ కలుగుతాయి, మరి తానూ? తాను ముందే కాల్చుకుని చని పోతే ఇహ భార్య పడేపాట్లు తాను చూచేదేమిటి? అప్పుడావిడ ఏమైపోతే ఎవరిక్కావాలి? కనుక ఈవిధంగా తలపెట్టిన ప్రతీకారం నిష్ప్రయోజనం అవుతుంది. ఇదే అతనికి పట్టుకున్న విచారం అతని ఆలోచనలు మరో వైపుకు మళ్ళింది. "ముందా 'ద్రోహి'ని చంపి, వాడి అంత్యక్రియలు కళ్ళారా చూచి, ఆ తరువాతనే నేను ఆత్మహత్య చేసుకుంటాను. అదే మంచిది" అని ఆలోచించడం మొదలు పెట్టాడు: "కాని నన్ను నేను కాల్చుకోకముందే, రివాల్వరుతో సహా పోలీసులు నన్ను పట్టుకుంటే? అందుచేత ముందు వాణ్ణి చంపి, ఆవిడను వదిలిపెడతాను. మరి నేను - నేను ముందు ఆత్మహత్య చేసుకోను. కాని అప్పుడైనా నన్ను అరెస్టు చేస్తారేమోనే! ఏమైనా ఒకమనిషి ఆత్మహత్య చేసుకునేందుకు కావలసినంత వ్యవధానం ఉంటుంది, ఇహ నన్ను అరెస్టు చెయ్యడమంటారా? చేస్తే చెయ్యనీ అది నాకు మేలేకాని కీడుకాదు అప్పుడు కోర్టు వారిముందూ, సంఘముందూ కూడా ఆ నీచురాలి ప్రవర్తన బట్టబయలవుతుంది. అలాకాక తెలివితక్కువగా ముందే నేను కాల్చుకుని చని పోతే, అప్పు డావిడకు పట్టపగ్గా లుండకపో వచ్చు. దాని పంతమే నెగ్గవచ్చు. అది అసలే ఆరితేరిన ఆడది. ఎంతకైనా తెగిస్తుంది. అబ

ద్ధాలాడడమంటే దానికి మంచినీళ్ళ ప్రాయం. తన మాయిమాటలతో కోర్టునూ, లోకాన్నీ కళ్ళుకప్పి తనతప్పు బయట పడకుండా చేసుకుంటుంది. నింద అంతా నామీదనే వేస్తుంది. ఏమో, ఎవరు చూచొచ్చారు? లోకం ఆవిడ చెప్పిందే నమ్మవచ్చు. ఆవిడనే నమర్థించవచ్చు. అప్పుడంతా నన్ను పిచ్చివాడి క్రింద జమకడతారు. నే చేసిన తెలివితక్కువ పనికి పగలబడి నవ్వుతారు. అలాకాక నేనే కనుక జీవించి ఉన్నట్లయితే అప్పుడూ ?—"

ఒక్కక్షణం ఆగి మళ్ళీ ఇలా అనుకున్నాడు:

"అవును. అంతేకాదు. నేను ఆత్మహత్య చేసుకుంటే, ముష్టి ఆవేశానికి లోనయి వెర్రి పని చేశాడంటారు. అంతా రకారకాలుగా అనుమానిస్తారుకూడా. నిజానికి, నేను ఎందుకు ఆత్మహత్య చేసుకోవాలి? పైగా ఆత్మహత్య అనేది ఒక మనిషి పిరికితనాన్ని ప్రకటిస్తుంది. అందుచేత ముందు ఆ 'వెధవ'ను చంపుతాను. ఆమెను ప్రాణాలతో వదిలిపెడతాను ఇహ నా మటుకు నేను-అరెస్ట్ అవుతాను. కోర్టులో విచారణ జరుగుతుంది. ఆమెను సాక్ష్యం చెప్పడానికి తీసుకొస్తారు. బోను ఎక్కిస్తారు నాతరపు ప్లీడరు ఆమెను ప్రశ్నలు వేస్తాడు! అప్పుడామె వాటికి సమాధానం చెప్పలేక కలవరపడుతుంది, నాకు తెలుసు, ఇహ, అలాంటప్పుడు పత్రికలవాళ్లు, ప్రజలుకూడా నాపట్ల సానుభూతి చూపుతారు. సందేహం లేదు."

ఇలా ఫెడొర్ అంతులేని ఆలోచనలలో మునిగి ఉండగా, షాపులో గుమాస్తా తన దోరణి తాను సాగిస్తూనే వచ్చాడు. తన సరుకంతా ముందుపడేసి, వచ్చిన బేరం పోకుండా ఉండడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు:

"ఇవిగోనండి, ఇంగ్లండులో తయారయిన రివాల్వరు, తాజావరుకు కాని మీరేమైనా అనుకోండి - ఇప్పటికీ నామాట ఒక్కటే 'స్మిత్-వెస్సన్' రివాల్వరుముందు ఇవి ఎందుకూ కొరగావు. నిన్నగాక మొన్న - పత్రికల్లో వార్త తమరు చూచే ఉంటారు. ఒక సైనికోద్యోగి మాదగ్గర 'స్మిత్-వెస్సన్' రివాల్వరు ఒకటి కొనుక్కొని వెళ్ళాడు. దాంతో ఆయన తన భార్య ప్రేమించినవాణ్ణి -ఒకణ్ణి కాల్చాడు. అప్పుడేమయిందనుకున్నారూ?— గుండు సూటిగావెళ్ళి అతని గుండెల్లో నుంచి దూసుక పోయిందట! అంతటితో ఆగిందనుకున్నారా ఏమిటి? పోయి అల్లంత దూరానఉన్న కంచు లాంతరు ఒకదాన్ని బ్రద్దలు చేసిందట - తరువాత 'పియానో' కు బలంగా కొట్టుకుని, వెనక్కువచ్చి అక్కడున్న పెంపుడు కుక్కపిల్ల ప్రాణాలు తీసి, చివరకు భార్యనుకూడా గాయి పరిచిందట! చూచారా, ఒకపెద్ద సర్కస్ 'ఫీట్' లాగా ఎంతచిత్రం జరిగిందో! ఏమైనా, ఆ రివాల్వరు మా షాపులో కొన్నదవడంచేత మాకొక ఘనత వచ్చిందనే మేం అనుకుంటున్నాం. ఆ ఉద్యోగస్థుణ్ణి ఇప్పుడు కొట్లో పెట్టారట. బహుశా విచారణలో అతని నేరం రుజువు కావచ్చు: ఎన్నో కొన్నిఏండ్లు కఠినశిక్ష విధించి అతన్ని సైబీరియాకు పంపుతారేమో కూడా. ఇలా ఎందుకు జరుగుతున్నదంటారు? మొదటిది మన చట్టాలు ఈ నాటివికావు, చాలా పురాతన మైనవి. రెండవ కారణం, మన 'జూరీలు' ఎప్పుడూకూడా ఇల్లాలితో సంబంధం పెట్టుకున్న ఆ దుర్మార్గుల పక్షమే వహిస్తుంటారు. ఎందుచేతనంటారేమో? మన జడ్జీలు, జూరీలు, పబ్లిక్ ప్రాసిక్యూటరు-వీరందరిలోనూ ఒకే ఒక బలహీనత ఉంది. అది 'మోజెస్' చెప్పిన పది ధర్మసూత్రాల్లోనూ పదవ సూత్రాన్ని ఉల్లంఘించడం. వీరంతాకూడా రష్యాలో ఒక్క స్త్రీకి భర్త తక్కువయినందుకు ఏ మాత్రం లెక్క చెయ్యరంటే నమ్మండి. ఇహ మన సమాజం అంటారా? భర్తలనందరినీకూడా దేశంనుంచి బహిష్కరిస్తే, మన సమాజానికి అంతకన్నా ఆనందకరమైన విషయం మరొకటి ఉండదేమోననిపిస్తుంది నాకు నిజంగా అయ్యోయ్యో! మీకో ఏమని చెప్పేదండీ - ప్రస్తుతం మన దేశంలో అనుసరిస్తున్న నీతులు ఎంత అధ్వాన్నంగా ఉన్నాయో, తలుచుకున్నకొద్దీ నావంటి

మీద తేళ్ళు, జెర్రులు పాకినట్లుంటుంది! అరెరె, ఇదెక్కడి పాపకర్మమండీ! పరాయి వాడి సిగరెట్ కాలిస్తే ఎంతో, పరాయి వాడి పుస్తకం చదువుకుంటే ఎంతో - 'ఆఫ్టర్ ఆల్' పరాయివాడి భార్యను ప్రేమించడం కూడా అంతేనా? రివాల్వర్లు కొనేవాళ్ళు లేక ఆపీటి కా ఏకు మా వర్తకం దిగనాసిళ్ళయి పోతోంది. అంటే అంతమాత్రంచేత కుటుంబ జీవితం పవిత్రంగా సాగుతున్నదనీ 'మోసెస్ చెప్పిన పదవ ధర్మసూత్రం ఉల్లంఘించడం జరగడంలేదనీ భావంకాదు సుమండీ. కేవలం భర్తలంతా చేసేదేమీలేక తమ దురదృష్టాన్ని, దుస్థితిని సహిస్తూ వస్తున్నారు. కోర్టులన్నా, శిక్షలన్నా భయపడిపోతున్నారు. అంతే"

ఇలాచెప్పి గుమాస్తా అక్కడెవరైనా వింటారేమోఅని అటూఇటూ, దిక్కులు చూచాడు పిమ్మట రహస్యంగా ఇలాఅన్నాడు:

"ఇదంతా ఎవరి తప్పంటారు బాబుగారూ? కేవలం మన ప్రభుత్వానిదే!"

"ఇలాచేస్తేదేశంనుంచి బహిష్కరిస్తారా?" అనుకున్నాడు ఫెదొర్ సిగయెవ్ తనలో. "నాకే కనుక శిక్షపడి సైబీరియాకు పోతే ఇహ నా భార్యను పట్టపగ్గాలుంటాయా? ఆవిడ వ్యవహారం విచ్చలవిడి అయిపోతుంది. మళ్ళీ పెళ్ళి చేసుకుంటుంది. నన్ను మోసం చేసినట్లే అరెండో భర్తనుకూడా మోసం చేస్తుంది. ఇలా ఎందరు మగవాళ్లో ఆమెకు ఆహుతి అయిపోతారు.అందుచేత ఆమెను చంపడంవల్ల ప్రయోజనంలేదు, నేనూ ఆత్మహత్య చేసుకున్నందువల్ల లాభంలేదు, 'అతగాణ్ణి' చంపకూడదు. మరో విధంగా ప్రతీకారం చెయ్యాలి. పగ తీర్చుకునేందుకు వేరేమార్గం కనిపెట్టాలి- ఇంతకంటె తెలివైన మార్గం, వాళ్ళకు బాధాకరమైన మార్గం ఒకటి ఆలోచించాలి-అవును, ఆమెకు విడాకులిస్తాను. వాడి వ్యవహారం, దాని వ్యవహారం కోర్టుముందు పెడతాను. లోకమంతా చూస్తుండగా అపఖ్యాతికరమైన ఆవిడ ప్రవర్తనను బట్టబయలు చేస్తాను. ఆ అవమానంతో ఆవిడ బ్రతికినంతకాలం కుళ్లి కుళ్లి కృశించిపోతుంది."

ఇంతలో షాపు గుమాస్తా మరోరకాను కొత్తరకం రివాల్వర్లు బయటికి తీశాడు. "ఈరకం చూడండి బాబుగారూ, ఎంత గమ్మత్తుగా తయారుచేశారో!" అంటూ చూపించసాగాడు.

ఇప్పుడు ఫెదొర్ సిగయెవ్ మనస్సు మారింది. ఇహ ఇప్పుడతనికి రివాల్వరుతో పనిలేదు. షాపులోనుంచి ఎప్పుడు వెళ్లిపోదామా అనుకుంటున్నాడు. ఈలోగా గుమాస్తా ఏమాత్రం విసుగు చెందకుండా, విధీ-విరామం లేకుండా, ఎలాగైనా బేరం పోనివ్వకూడదని నానాయాతనల్లు పడుతున్నాడు. ఇంకా ఇంకా ఉత్సాహం తెచ్చుకుని మాట్లాడుతున్నాడు.

అతని చిరునవ్వులు, ముఖభంగిమలు, చెప్పినమాట చెప్పకుండా మాట్లాడే తీరు, ఎలాగైనా తనకు నచ్చచెప్పి బేరం కుదర్చాలని అతను పడుతున్న పాట్లూ; ఇవన్నీ గమనించాడు. ఫెదొర్సిగయెవ్, జాలి కలిగింది.

"సరే నేను మళ్ళీ వస్తాను. లేదా మా మనిషిని పంపుతాను." అన్నాడు నింపాదిగా.

ఇలా అన్నాడేకాని, ఇంతసేపూ బేరంఆడి ఊరికే పోతే బావుంటుందా? మరి తన కేమో ఇహ రివాల్వరుల క్కర్లేదు. 'సరే, ఏదోఒకటి కొనాలి. లేకపోతే మర్యాదదక్కదు' అనుకున్నాడు ఫెదొర్ సిగయెవ్. కాని ఏంకొనాలి? షాపులో నలువైపులా కలయచూచాడు. చివరకు ఆయన దృష్టి తలుపు దగ్గర గోడకు వ్రేలాడుతున్న ఒక వలమీద పడింది.

"ఇది - ఇదేమిటీ?" అని అడిగాడు గుమాస్తాను, తర్జనితో నిర్దేశిస్తూ.

"ఇది పరిగె పిట్టలను పట్టే వల బాబుగారూ!" అని చెప్పాడు గుమాస్తా.

"దీనివెల ఎంత ?"

"ఎనిమిది రూబుళ్ళండీ."

"సరే, ఒకటి తీసుకుంటాను."

భార్యకు ప్రతీకారం చెయ్యాలని వచ్చిన ఫెదొర్ సిగయెవ్, ఎనిమిది రూబుళ్ళు ఇచ్చి పిట్టలను పట్టే వల కొని బయటపడ్డాడు.



అలంకరణ

★

చిత్రశిల్పి :
కుమారి కె. దివ్యజ్ఞాన సరోజినీ దేవి.

★

# మనుస్మృతి - ఆధ్యాత్మికసాధనలు

శ్రీ జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

మనువు చూపిన కల్యాణ మార్గము ఐహికాముష్మిక సుఖప్రాపకము మాత్రమే కాక ఆత్మవికాస హేతువు కూడనని గుర్తింప దగును. అంతఃకరణమును నిర్మలము గావించుకొనుటకును, మోక్షార్హతను చేకూర్చుకొనుటకును మానవు దవలంబింపవలసిన సాధనముల ననేకములను మనువు నిర్దేశించినాడు. మచ్చునకు కొన్నింటిని సమీక్షింతము.

## ఇంద్రియ నిగ్రహము

ఇంద్రియాణాం ప్రసంగేన
దోషమృచ్ఛ త్యసంశయమ్
సన్నియమ్యతు తాన్యేవ
తతస్సిద్ధిం నియచ్ఛతి.

త్వగింద్రియమును స్పర్శమీదకును నేత్రేంద్రియమును రూపముమీదకును, జిహ్వేంద్రియమును రుచిమీదకును, ఘ్రాణేంద్రియమును వాసన మీదకును, శ్రోత్రేంద్రియమును శబ్దము మీదకును ఆసక్తితో ప్రసరింపజేయుట వలనను, మనస్సును చపలముగ నుంచుకొనుట వలనను మానవుడు తప్పక దోషమును పొందును. వానిని నిగ్రహించుకొనుచో ఉత్తమ పురుషార్థసిద్ధిని - మోక్షమును గూడ పొందగల్గును.

నజాతుకామః కామానా ముపభోగేనశామ్యతి
హవిషాకృష్ణవర్త్మేన భూయఏవాభివర్ధతే

భోగముల ననుభవించుట వలన కోరిక చల్లారదు; పైగావృద్ధి పొందుచునేయుండును. అగ్ని హోత్రములో హవిస్సును వేయుటవలన అగ్ని ఆరిపోవుటకు బదులుగా వృద్ధియే చెందును గదా!

యశ్చైతాన్ప్రాప్నుయాత్సర్వాన్యశ్చైతాన్కేవలాంస్త్యజేత్
ప్రాపణాత్సర్వకామానాం పరిత్యాగోవిశిష్యతే.

ఒకడు కోరిన భోగముల నన్నిటిని పొందవచ్చును; మరొకడు అన్ని భోగముల పట్లను ఉపేక్షాభావముతో నుండవచ్చును. ఆ పొందిన వానికంటె ఈ యుపేక్షా భావము గలవాడు గొప్పవాడు. భోగములను పొందుటకంటె వాని నుపేక్షించుట ఎక్కువది. ఏలయన భోగములను పొందినవాడు వానిని అనుభవించు సాధనములను సంపాదించుకొనుటలో క్లేశపడవలసి యుండును. మరియు ఆ భోగములు ముగిసిపోవునపుడు దుఃఖమును పొందును. భోగముల నుపేక్షించువానికి ఈబాధ లేదు. వాడెల్లపుడును ప్రశాంతముగానే యుండును.

నతథైతానిశక్యన్ సన్నియన్తుమసేవయా
విషయేషుప్రజుష్టాని యథాజ్ఞానేననిత్యశః.

విషయానుభవములోనున్న ఇంద్రియములను నిగ్రహించుటకు రెండు మార్గములు కలవు :

(1) ఇంద్రియములను విషయముల చెంతకు పోనీయకుండుట (2) విషయభోగములు క్షణికములనియు, శరీరము అస్థిరక్త మజ్జాది మయమనియు నిరంతరము భావించుచుండుట. ఈ రెండవదాని వలన నిగ్రహింపబడినంతగా ఇంద్రియములు మొదటిదాని వలన నిగ్రహింపబడవు. ఏలయన: విషయములు దగ్గరలేక పోయినను మనస్సు వానికై పరితపించుట సంభవించును. జ్ఞానమువలన విషయముల పట్ల మనస్సులో కూడ ఉపేక్షాభావ మేర్పడును.

వేదాస్త్యాగశ్చయజ్ఞాశ్చనియమాశ్చతపాంసిచ
నవిప్రదుష్టభావస్య సద్ధింగచ్ఛంతికర్హిచిత్.

వేదములు, త్యాగము, యజ్ఞములు, నియమములు, తపస్సులు — ఇవి భోగాభిలాషచే దూషితమైన మనస్సు గలవానికి ఫలింపవు. (కామ రహితుడైన వీని నాచరించువానికి మోక్షార్హత కల్గును)

శ్రుత్వాస్పృష్ట్వాచదృష్ట్వాచ భుక్త్వాఘ్రాత్వాచ యోనరః
నహృష్యతిగ్లాయతివా సవిజ్ఞేయోజితేంద్రియః.

శబ్దములను వినుచును, వస్తువులను స్పృశించుచును, రూపములను చూచుచును, రుచుల నాస్వాదించుచును, వాసనల నాఘ్రాణించుచును గూడ ఏ మానవుడు సంతోషింపడో, బాధపడడో వాడు జితేంద్రియుడుగా తెలియ దగినవాడు.

ఇంద్రియాణాంతుసర్వేషా యద్యేకంక్షర తేంద్రియా
తేనాస్యక్షరతిప్రజ్ఞా ధృతేఃపాదాదివోదకమ్.

త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణశ్రోత్రేంద్రియములలో ఏ ఒక్క యింద్రియము విషయము మీదికి ప్రవరించినను మానవుని ప్రజ్ఞ జారిపోవును. నీళ్లుగల తిత్తికి చిల్లులు పడుచో ఆ చిల్లులున్న చోటున గల నీరేకాక తిత్తిలోని నీరంతయు కారిపోవును. అట్లే ఒక యింద్రియమునుండి ప్రజ్ఞజారుచో మానవుడు తత్త్వజ్ఞాన రహితుడగును.

వశేకృత్వేంద్రియగ్రామం సంయమ్యచమన స్తథా
సర్వాన్‌సంపాదయేదర్థా నక్షిణ్వన్‌యోగ తస్తనూ

ఇంద్రియములను స్వాధీనము చేసికొని మనస్సును కూడ విగ్రహించుకొనే వాడు ఉపాయముచేత శరీరమును పీడించుకొనని వాడు సర్వపురుషార్థములను సాధించుకొనవచ్చును.

కావున మానవుడు మనస్సును, వాక్కును, శరీరమును విచ్చలవిడిగా పోనీయరాదు. వానిని అణచిపెట్టి ధర్మమార్గములో నడపుకొన వలయును. ఎవడు ఇట్లు మనోదండమును, వాగ్దండమును, కాయదండమను గలిగి వానిని శిక్షించుకొనునో వాడు త్రిదండియని చెప్పబడును. అతడు కామక్రోధములను జయించి మోక్షార్హతను పొందును.

వాగ్దండోఽథమనోదండః కాయదండ స్తథైవచ
యస్యైతేనిహితాబుద్ధే త్రిదండీతిసఉచ్యతే.
వేదాభ్యాస స్తపోజ్ఞాన మింద్రియాణాంచ సంయమః
అహింసా గురుసేవాచ నిఃశ్రేయసకరంపరం (12-83)

వేదాభ్యాసము, తపస్సు, జ్ఞానము, ఇంద్రియ విగ్రహము, అహింస, గురుసేవ - ఇవి మోక్షము నొసగును.

సర్వేషామపిచైతేషా మాత్మజ్ఞానంపరంస్మృతం
తద్ధ్యగ్ర్యంసర్వవిద్యానాం ప్రాప్యతేహ్యమృతం తతః

ఈ యన్నింటిలోను ఆత్మజ్ఞానము గొప్పది. దానివలన అమృతత్వము లభించును. అది సర్వ విద్యలలోను శ్రేష్ఠము.

## ని త్య క ర్మ లు

జ్ఞాన వైరాగ్యములకు ప్రతిబంధక మయిన అంతఃకరణ మాలిన్యమును క్షాళనము చేయు శక్తి నిత్య కర్మానుష్ఠానమునకు గలదు. స్నానము, సంధ్య, జపము, హోమము, బ్రహ్మయజ్ఞము, దేవపూజ, అతిథ్యము, వైశ్వదేవము - అనునవి నిత్యకర్మలు.

బ్రహ్మముహూర్త మందు విప్రసుండి లేవగానే ధర్మార్థములను గురించి యాలోచింప వలయును. (అనగా ధర్మమునకు విరుద్ధము కాని విధమున అర్థార్జనమును గావించుట యెట్లో ధనముచే ధర్మము నెట్లాచరింపవలయునో ఆలోచింపవలయును.) మరియు ఏపని చేయుటవలన ఎంత అర్థము లభించునో ఎంత ధర్మము సంపాదించినట్లగునో బాగుగా నాలోచించుకొని ధర్మార్థములను తగినంతగా నెరవేర్చని ఈ శరీర క్లేశకరము లయిన పనులను విడచుటకును ధర్మార్థముల యభివృద్ధికి సాయపడు పనులను గావించుకొనుటకును నిశ్చయించుకొన వలయును. మరియు మేల్కొనిన సమయమున వేదతత్త్వార్థమును ఆలోచింపవలయును. (వేదము కర్మ బ్రహ్మోభయాత్మకము కావున పరమాత్మ తత్త్వమును గురించియు, ధర్మతత్వమును గురించియు, ఆలోచింపవలయును.)

బ్రాహ్మే ముహూర్తే బుద్ధ్యేత
ధర్మార్థౌ చానుచిన్తయేత్
కాయక్లేశాంశ్చ తన్మూలాన్
వేదతత్త్వార్థ మేవచ.

ఇట్లు ఆత్మ తత్త్వమును గురించియు ధర్మ మును గురించియు కొంత చింతించిన పిమ్మ టనే నిత్య కర్మానుష్ఠానములోనికిని పిమ్మట సమస్త వ్యవహారములలోనికిని దిగవలయు ననుటచే ఆత్మసాధన లక్ష్య మనపాయిగా హృదయములో నుండవలయునని స్పష్టమగు చున్నది.

## సత్యము

మనువు మతములో అసత్యము ఆత్మ ద్రోహము. సత్య ప్రాముఖ్యమును తెల్పు నీ క్రింది శ్లోకములో ఆత్మన్ శబ్దప్రయోగము గమనింపదగినది.

యోఽన్యథా సంత మాత్మాన
మన్యథా సత్సుభాషతే
సపాపకృత్తమోలోకే
స్తేన ఆత్మాపహారకః

అసత్య మాడువాడు తన మనస్సే రీతిగా నున్నదో యా రీతిగా కాక మరొక రీతిగా తన యాత్మను పైకి రానిచ్చుచున్నాడు. అస త్యముచే నితరులను మోసగించితినని వాడు తలచుచున్నాడు కాని యథార్థముగా తన యాత్మను తానే అపహరించుచున్నాడు. కనుక వాడు పాపులలో నెల్ల పాపాత్ముడు.

వాచ్యర్థా నిహితాస్సర్వే
వాఙ్మూలా వాగ్వి నిస్సృతాః
తంతుయస్తేనయే ద్వాచం
ససర్వ స్తేయకృ న్నరః.

అన్ని వస్తువులును శబ్దములయందే యున్నవి; శబ్దములే మూలముగా కలవి: శబ్ద మునుండియే వెల్లడి యగుచున్నవి; అట్టివాక్కు నెవడు అపహరించునో (అసత్యముగా పల్కునో) వాడు అన్నివిధములైన దొంగత నమును చేసినవా డగును.

## యమములు-నియమములు

యమాన్ సేవేత సతతం నిత్యంనియమాన్ బుధః
యమాన్ పతత్య కుర్వాణో నియమాన్ కేవ లాన్ భజన్ -

అహింస, సత్యము, బ్రహ్మచర్యము, చిత్తశుద్ధి, పరద్రవ్యము నపహరింపకుండుట - ఇవి యమము లనబడును. కోపము లేకుం డుట, గురు శుశ్రూష, పరిశుద్ధి తక్కువగా భుజించుట జాగరూకత - ఇవి నియమము లనబడును ఈ రెండును ఆచరింపవలసినవే. కాని యీ రెంటిలోను యమములు ముఖ్య ములు. ఉదాహరణముగా వ్యాఖ్యాతయైన కుల్లూకభట్టు చెప్పినది గమనింపదగును. ఒక ప్పుడు స్నానమునుగాని అహింసను గాని వదలుకొనవలసి వచ్చినచో అప్పుడు స్నానము నైనను మానవచ్చును గాని అహింసను వీడ రాదు.

## ధనశుద్ధి

అన్నశుద్ధి కేవలము బాహ్యశౌచము మీదనే యాధారపడి యుండదు అన్నమే కాదు, మన మనుభవించు సమస్త వస్తువులును దోషరహితములుగా నుండవలయు నన్నచో నవి న్యాయమార్గములో సంపాదింపబడి యుండవలయును. అన్యాయముగా సంపా దింపబడిన ధనముతో అనుభవింపబడు అన్నాదులు అంతఃకరణమునకు మాలిన్యమును గల్గించును పాపము పోవుటకై యెవరైనను దానము చేయగా వచ్చిన ధనమునకు కూడ నీపాపము అంటుకొని యుండును. అట్టి అన్యాయ ధనమును దరికి రానీయ రాదు. ఒక వేళ తెలియకరానిచ్చుచో తెలియగానే విడిచి పెట్టవలయును. కొంత అనుభవింప బడిన తర్వాత తెలిసినచో జపముచేతను, తపస్సు చేతను అంతఃకరణ శుద్ధిని గావించుకొన వలయును.

యద్గర్హితే నార్జయంతి
కర్మణా బ్రాహ్మణాధనం
తస్యోత్సర్గేణ శుద్ధ్యన్తి
జప్యేనతపసైవచ.

ఎక్కువగా డబ్బుగలవాని నుండి ధనము తీసికొనుచో వానికి హానిలేకపోగా మనకు లాభము గల్గును గావున తప్పులేదను భావము పాక్షికముగా మాత్రమే సత్యము. మనుస్మృతి

చెప్పునదేమనగా. ఆ ధనవంతుని వద్దనున్న ధనము అన్యాయార్జితమైనచో నీయంతఃకరణ మునకు మాలిన్య మంటుకొనును. కావున రాజైనను సరియే వాడుగా, పాపియైన వాని ధనమును ప్రతి గ్రహింపరాదు

యోరాజ్ఞః ప్రతిగృహ్ణాతి
లుబ్ధస్యోచ్ఛాస్త్ర వర్తినః
సపర్యాయేణ యాతీమాన్
నరకానేక వింశతిం,

శాస్త్ర వ్యతిరేకముగా నడచునట్టియు లోభి యైనట్టియు రాజునుండి యే దానమును తీసికొనరాదు అట్లు తీసికొనువాడు ఇరువదియైదు నరకములను పొందును.

మహాపాతకుల ధనమును తీసికొనుచో రాజుకూడ దోషి యగును.

నాదదీత నృపస్సాధుర్మహా పాతకినోధనం
ఆదదానస్తు తల్లోభాత్తేన దోషేణ లిప్యతే

సత్పురుషు డయిన రాజు మహాపాతకుల ధనమును తీసికొన కూడదు. లోభముచే తీసికొనుచో ఆదోషము వానినికూడ నంటుకొనును.

దోషులను దండించుటలో వీరి ధనమును రాజు లాగుకొనుట కిది యడ్డు కాజాలదు; వారి దోషము నుపేక్షించి సామాన్య పౌరుల నుండి వలెనే వారినుండి ధనమును గ్రహించుటనే యిది నిషేధించును.

## దానము

దాతృ సంకల్పము ననుసరించి దానఫల ముండును. (4-204) పరలోకములో కాని నరజన్మలో కాని యీ జన్మలోనే కాని శుభము కలుగవలయునని చేయబడు దానముల కా ఫలమే కల్గును. మోక్షము లభింపవలయునను కోరికతో చేయబడు దానమున మోక్షప్రతిబంధ మగు అంతఃకరణ మాలిన్యమును తొలగించును. అకార్య కరణముల నాచరించిన వారికి దానమువలన చిత్తశోధనము కలుగును. (దానే కార్యకారిణః)

## తపస్సు

ఆధ్యాత్మిక బలము నొసగగల వానిలో తపస్సు శ్రేష్ఠమైనది. అసాధ్యము లన్నియు తపస్సు వలన సాధ్యము లగును.

యద్దుస్తరం యద్దురాపం
యద్దుర్గం యచ్చ దుస్తరం
సర్వంతు తపసాసాధ్యం
తపోహి దురతి క్రమం

ఏది దాట శక్యముకానిదో, ఏది పొంద శక్యము కానిదో, ఏది ప్రవేశింప శక్యము కానిదో, యేది చేయశక్యము కానిదో అది యంతయు తపస్సుచే సాధింపబడును. తపస్సు నేదియు మించజాలదు.

కావున చిత్తశాంతి, వైరాగ్యమును, మోక్షమును కోరు మునులు తపస్సు చేయుట కాంచనగును. (కామ్యములకు తపస్సు చేయుటయు కలదు.)

## హృదయమార్దకము

మెత్తని స్వభావమును ఇంద్రియ నిగ్రహమును దాతృత్వమును గల్గి దృఢవ్రతుడయి క్రూరులతో స్నేహము చేయక ఎవరికిని హింస గావింపక యుండు మానవుడు స్వర్గమును జయించును.

దృఢకారీ మృదుర్దాంతః
క్రూరా చారై ర సంవసన్
అహింస్రో దమ దానాభ్యాం
జయే త్స్వర్గం తథావ్రతః.

పరలోకము లేదను బుద్ధిని, వేదనిందను, దేవతా దూషణమును, ద్వేషమును, దంభమును, దురభిమానమును, కోపమును, క్రూరత్వమును విడచిపెట్టవలయును.

నాస్తిక్యం వేదనిందంచ
దేవతానాంచ కుత్సనం
ద్వేషందంభంచ మానంచ
క్రోధం తైక్ష్ణ్యంచ వర్జయేత్.

## సంస్కారములు

తలి దండ్రులనుండి జన్మతోనే సంక్రమించు బైజిక గార్భికపాపము గర్భాధాన,

పుంసవన, సీమంతోన్నయన, జాతకర్మ, నామకరణాన్న ప్రాశన, చౌలోపనయన, వేద వ్రత, గోదాన, స్నాతక, వివాహములనెడు సంస్కారములచేత పోగొట్టుకొన దగినది.

గార్భైర్హోమై ర్జాతకర్మ
చౌడమౌంజీ నిబంధనైః
బైజికం గార్భికంచైనో
ద్విజానామప మృజ్యతే.

వేదాధ్యయనము చేతను, వ్రతములచేతను హోమముల చేతను త్రైవిద్యాఖ్య వ్రతము చేతను, బ్రహ్మచర్యములో దేవర్షి పితృతర్ప ణాత్మకమైన యజ్ఞము చేతను, గృహస్థాశ్రమ ములో పుత్రోత్పాదనము చేతను, పంచమహా యజ్ఞముల చేతను, జ్యోతిష్టోమాది క్రతువుల చేతను ఈ శరీరము (అందలి ఆత్మ) బ్రహ్మ ప్రాప్తికి అర్హత కలది యగుచున్నది.

## వే దా భ్యా స ము

వేద మే వాభ్యసే న్నిత్యం
యథాకాలమతంద్రితః
తంహ్యస్యాహుః పరంధర్మ
ముపధర్మోఽన్య ఉచ్యతే.

బ్రాహ్మణుడు నిత్యము వేదాభ్యాసము చేయు చుండవలయును. ముఖ్యముగా అవసరమునకు తగినట్లు శ్రేయో హేతుకములయిన మంత్రము లను జపించుచుండవలయును. ఇ ది యే బ్రాహ్మణునకు సర్వోత్కృష్టమైన ధర్మము. మిగిలిన ధర్మమంతయు దీనికి లోబడినదే.

వేదాభ్యాసేన సతతం
శౌచేవ తపసైవచ
అద్రోహేణచ భూతానాం
జాతింస్మరతి పౌర్వికీం

బ్రాహ్మణుడు వేదాభ్యాసము చేయుట చేతను, శుచిగా నుండుటచేతను, త ప స్సు చేయుట చేతను, ఏ ప్రాణికిని ద్రోహ ము చేయకుండుట చేతను పూర్వజన్మ జ్ఞానమును పొందగల్గును.

పౌర్వికీం సంస్మరన్జాతిం
బ్రహ్మైవాభ్యసతే పునః
బ్రహ్మాభ్యాసేనచాజస్ర
మనంతం సుఖమశ్నుతే.

పూర్వజన్మను స్మరించుట వలన సంసార మందు రోతపుట్టి మోక్షమునుకోరి తిరిగి వేదా ధ్యయనమునే చేయును. నిరంతరము వేదా భ్యాసము చేయుట వలన మోక్షానందమును పొందును.

ఇట్లు వేదాభ్యాసమొక గొప్ప యాధ్యాత్మిక సాధనముగా పేర్కొన బడినది.

యథైధస్తేజ సావహ్నిః
ప్రాప్తం నిర్దహతిక్షణాత్,
తథాజ్ఞానాగ్నినా పాపం
సర్వందహతి వేదవిత్.

అగ్ని యేరీతిగా కట్టెపుల్లలను తగుల పెట్టునో యట్లే వేదవిదుడు పా ప ము ను జ్ఞానాగ్నిచేత తగుల బెట్టును.

## ప్రాయశ్చిత్తములు

పాపము చేసినవాడు తన పాపము నితరు లకు చెప్పుకొనుట చేతను, పశ్చాత్తాప పడుట చేతను, ఉగ్రతపస్సు చేతను. లేదా గాయ త్ర్యాదిమహా మంత్రజపము చేతను, దానము చేతను పరిశుద్ధి నొందును.

యథాయథానరోధర్మం స్వయంకృత్వానుభాషతే
తథాతథాత్వచేవాహి స్తేనాధర్మేణముచ్యతే.

నరుడు తాను చేసిన అధర్మము నెంతగా చెప్పుకొనునో అంతగా వాడు పాము కుబుసము చేత విడువబడునట్లు ఆ యధర్మముచేత విడువ బడును.

కృత్వాపాపంహిసంతప్య తస్మాత్పాపాత్ప్ర ముచ్యతే
నైవంకుర్యాంపునరితి నివృత్త్యాపూయతేతు సః.

పాపముచేసి పశ్చాత్తాపపడువాడు ఆపాపము నుండి విముక్తుడగును. "ఇక నెన్నడును ఇట్లు చేయను" అని నిశ్చయించుకొని యాతడు పాపమునుండి మరల పవిత్రుడగును.

ఏవంసంచిన్త్య మనసా ప్రేత్యకర్మ ఫలో దయం
మనోవాఙ్మూర్తిభి ర్నిత్యం శుభం కర్మ సమాచరేత్.

ఈరీతిగా మానవుడు తాను చేయు ఫలమును గూర్చి విచారించి మనోవాక్కాయముల చేత నెల్లప్పుడును శుభకర్మనే ఆచరింపవలయును.

అజ్ఞానాద్యదివాజ్ఞానా త్కృత్వాకర్మ విగర్హితం
తస్మాద్విముక్తి మన్విచ్ఛన్ ద్వితీయంన సమాచరేత్.

తెలిసికాని తెలియక కాని చెడ్డపనిని చేసినవాడు దానినుండి విముక్తిని పొందగోరుచో తిరిగి అట్టిపనిని చేయకూడదు. ప్రాయశ్చిత్తము చేసికొనవచ్చును కదా యని పాపము నాచరించుట గర్హితము,

పాపాపనోదనమునకును అంతఃకరణ శుద్ధికిని మనుస్మృతిలో బహువిధములైన ప్రాయశ్చిత్తములు చెప్పబడినవి అందు కృచ్ఛ్రసాంతపన మొకటి.

గోమూత్రం గోమయం క్షీరందధి సర్పిః కుశోదకం
ఏకరాత్రోపవాసశ్చ కృచ్ఛ్రం సాంతపనం స్మృతం 11-212

గోమూత్రము, గోమయము, గోక్షీరము, గోదధి, గోఘృతము, కుశోదకము కలిపి లోపలకు తీసికొనవలయును. ఆనాడు మరేమియు తినరాదు. మరునాడు పూర్తిగా నుపవాసము చేయవలయును.

ప్రాణాయామాదిక ప్రాయశ్చిత్తములు కొన్ని కలవు. వ్యాహృతులతోను ఓంకారముతోను కూడుకొన్న పదునారు ప్రాణాయామములను నెల దినములు నిత్యము చేయుచో మహాదోషములుకూడ పోవును.

సవ్యాహృతి ప్రణవకాః ప్రాణాయామాస్తు షోడశ
అపిభ్రూణహణం మాసా త్పునన్త్యహరహఃకృతాః

తాను చేసిన పాపముల నితరులకు చెప్పుటచేతను, పశ్చాత్తాప పడుటచేతను, తపస్సుచేతను, వేదపఠనము చేతను, దానము చేతను పాపమోచనము కల్గును.

ఖ్యాపనేనానుతాపేన
తపసాఽధ్యయ నేనచ
పాపకృన్ముచ్యతే పాపాత్
తథాదానేన చాపది

## అహింస

ఆధ్యాత్మిక సాధనములలో ముఖ్యమైనది అహింస. సన్యాసి సర్వమును పరిత్యజించినను అహింసా వ్రతమును మాత్రము పరిత్యజింపరాదని చెప్పబడినది.

ఇంద్రియాణాం నిరోధేన
రాగ ద్వేష క్షయేణ చ
అహింసయా చ భూతానా
మమృతత్వాయ కల్పతే.

ఇంద్రియ నిగ్రహముచేతను, రాగద్వేష పరిత్యాగము చేతను సర్వభూతముల పట్లను అహింస నవలంబించుటచేతను అమృతత్వము సాధ్యమగును.

యోబంధన వధక్లేశాన్
ప్రాణినాం నచికీర్షతి
ససర్వస్యహితప్రేప్సుః
సుఖమత్యంత మశ్నుతే.

ఎవడు ప్రాణులను వధించుటకుగాని, బంధించుటకుకాని, బాధపెట్టుటకు కాని యిష్టపడడో, ఎవడెల్ల ప్రాణులకును హితము కోరునో, వాడు అనంతమైన (మోక్ష) సుఖమును పొందును.

ఆహారము కొఱకు గూడ ప్రాణులను హింసింపకూడదు.

అనుమన్తా విశసితా
నిహన్తాక్రయ విక్రయీ,
సంస్కర్తా చోపహర్తాచ
ఖాదకశ్చేతి ఘాతుకాః.

మాంసమును తినువాడు, పెట్టినవాడు, వండినవాడు, అమ్మినవాడు, ప్రాణిని చంపినవాడు, అవయవములను విడదీసినవాడు, అనుమతించిన వాడు - అందరును చంపినట్లే.

యోఽహింసకాని భూతాని
హినస్త్యాత్మసుఖేచ్ఛయా
సజీవంశ్చ మృతశ్చైవ
నక్వచిత్సుఖమేధతే.

ఏజంతువులు మనుష్యులను హింసింపవో వానిని తమ సుఖముకొరకు హింసించువానికి ఈ లోకములోకాని పరలోకములోకాని సుఖ ముండదు.

అహింసయేంద్రియాసంగై
ర్వైదికైశ్చైవ కర్మభిః
తపసశ్చరణైశ్చోగ్రైః
సాధయంతీహ తత్పదం.

అహింసచేతను, విషయసంగ పరిత్యాగము చేతను, వైదిక కర్మలచేతను, ఉగ్రతపస్సుల చేతను బ్రహ్మ పదమును చెందుదురు

## గాయత్రీ జపము

గాయత్రి మూడు వేదముల సారము. ఓంకారముతోడను, భూః, భువః, సువః - అను వ్యాహృతుల తోడను గూడిన గాయత్రిని సంధ్యాసమయములలో జపించు విప్రుడు మూడు వేదములను అధ్యయనముచేసిన పుణ్యమును పొందును. ఇట్లు జపము చేయనివాడు వేదాధ్యయనముచేసి యున్నను అధ్యయన ఫలమును పొందడు. అధ్యయనము చేయని వాడు కూడ నిట్టి జపము వలన మహాపుణ్యము పొందును.

ఏతదక్షర మేతాంచ
జపన్ వ్యాహృతి పూర్వికాం
సంధ్యయోర్వేదవి ద్విప్రో
వేదపుణ్యేన యుజ్యతే.

సంధ్యా సమయములలోనే కాక యితర సమయములలో కూడ గాయత్రిని నదీతీరమునను, అరణ్యములలోను వేయి పర్యాయములు జపించువాడు కుబుసముచేత పాము విడువబడునట్లు పాపముచేత విడువబడును.

సహస్రకృత్వ స్త్వభ్యస్య
బహిరేత త్త్రికం ద్విజః
మహతోఽప్యేన సోమాసాత్
త్వచేవాహి ర్విముచ్యతే.

యోఽధీతేఽహన్యహన్యేతాంస్త్రీణివర్షాణ్య తంద్రితః
సబ్రహ్మ పరమభ్యేతి వాయుభూతః ఖమూర్తిమాన్

ఎవడు గాయత్రీ మంత్రమును అశ్రద్ధ లేనివాడై మూడు సంవత్సరములు ప్రతిదినము జపించుచునే యుండునో వాడు వాయువువలె సర్వత్ర సంచరించు శక్తిగలవాడై బ్రహ్మయే యగును.

ఏకాక్షరం పరంబ్రహ్మ ప్రాణాయామాః పరంతపః
సావిత్ర్యాస్తు పరంనాస్తి మౌనాత్సత్యం విశిష్యతే.

ఓంకారము పరబ్రహ్మప్రాప్తి సాధనము. ప్రణవ వ్యాహృతి శిరస్సులను గలిగిన త్రిరావృత్తి గాయత్రితో కూడిన ప్రాణాయామములే మహాతపస్సు. గాయత్రి కంటె గొప్ప మంత్రము లేదు.

## జపవిశేషములు

విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టోదశభిర్గుణైః
ఉపాంశుస్యాచ్ఛతగుణః సాహస్రోమానసః స్మృతః

దర్శపూర్ణ మాసాది యజ్ఞములకంటె జపము పదిరెట్లు గొప్పది. ఆ జపములోను పైకి నుచ్చరింపబడు జపముకంటె ప్రక్కనున్న వానికికూడ వినబడనట్లు చేయబడు ఉపాంశు జపము నూరురెట్లు గొప్పది. ఉపాంశువు కంటెను పెదవులు, జిహ్వ, కదలకుండునట్లు చేయబడు మానస జపము వేయిరెట్లు గొప్పది. (అయినను మానస జపము చేయుశక్తి కలుగువరకు ఉపాంశువు, ఉపాంశువును చేయుశక్తి గలుగువరకు వాచికమును విడువరాదు.) ఈ జప విశేషములు కూడ యజ్ఞములే.

జప్యేనైవతు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణోనాత్ర సంశయః
కుర్యాదన్య న్నవాకుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే.

బ్రాహ్మణుడు యాగములు మున్నగువానిని చేయకపోయినను జపము చేతనే మోక్షార్హతను పొందును యాగములో పశుహింస యున్నది. కాని జపములో నదికూడ లేదు కావున యాగముకంటె జపము విశేషము గలది. ఇచ్చట యాగనింద ఉద్దేశింపబడలేదు.

యాగముకూడ వేదవిహిత మగుటచే దానిని వినిందించుట సంభవింపదు. "నహినిందా" న్యాయముగా ఇచ్చట జపముయొక్క ప్రాశస్త్యము చెప్పబడినది.

## ప్ర కీ ర్ణ ము

సత్పురుషులతోను, తపశ్శాలురతోను, జ్ఞానులతోను సాహచర్యము చేయుట, వారి సేవ గావించుట ఉద్ధారకములు. అట్లే మహాపాపులతో సాంగత్యము చేయుట పతన హేతువు. [11-54]

దేవతలను తృప్తిపఱచు ఇష్టములును (శాస్త్రీయారాధన విధానములును). మానవులకు సుఖమును గల్గించు వాపీకూపతటాకాది నిర్మాణరూపమైన పూర్తములును చిత్తశుద్ధికి తోడ్పడును. [4-227] అన్నవస్త్రాది దానములు పాపశాశనమునకు తోడ్పడును. వేదవిద్యాదానమన్నిదానములకంటె ప్రశస్తము [4-233]

ఆధ్యాత్మిక సాధనములలో ఆహారశుద్ధి యొకటి. మనువు గావించిన భక్ష్యాభక్ష్యనియమములు బహుళముగా గలవు.

సదాచార పరిపాలనము సర్వ విధముల శ్రేయోదాయకము. మనుస్మృతిలోని సదాచారములకు ప్రత్యేక విచారణము కావలసియున్నది.

మనువు ప్రదర్శించిన చతురాశ్రమ ధర్మములను మానవుని క్రమముగా మానవత్వమునుండి దివ్యత్వములోనికిని దివ్యత్వమునుండి బ్రహ్మత్వములోనికిని తీసికొని పోవుటకు సమర్థములై యున్నది. అతి విపులముగా ప్రతిపాదింప బడిన యాధర్మములనుండి వాన ప్రస్థ ధర్మములను మాత్రము కొన్నిటి నిట సంగ్రహించుచున్నాను:

గృహస్థుడు సుమారేబది సంవత్సరముల వయస్సు నిండగనే యింద్రియ నిగ్రహము గలవాడై గృహమును విడచి యరణ్యమునకేగ వలయును. వరి, యవలు మున్నగు నాహారమును విడచి వన్యమైన యాహారమును పరిగ్రహింప వలయును. నీవారధాన్యము, శాకములు, దుంపలు, పుష్పములు, ఫలములు మున్నగు పవిత్రాహారములనే తీసికొనవలయును. మధుమాంసాదులను సేవింపరాదు.

వానప్రస్థుడు పంచమహా యజ్ఞములను ప్రతి దినము చేయుచుండ వలయును. భార్యను కుమారులవద్ద విడచి యడవికి పోవచ్చును; లేదా తనవద్దనే యడవిలో నుంచుకొని బ్రహ్మచర్యముతో నుండవలయును. విఖనస మహర్షి రచించిన వానప్రస్థ ధర్మసూత్రముల ప్రకారము ప్రవర్తించుకొన వలయును. వానప్రస్థుడు తాను తినుదానినే యితరులకు పెట్టుచుండవలయును. దేనిని దానముగా పరిగ్రహింపరాదు. తానితరులకు దానముచేయు చుండవచ్చును. సర్వప్రాణులయందును ప్రేమ గలవాడుగా నుండవలయును. సర్వభూతములయందును దయగల్గి యుండవలయును. ఆశ్వయుజ మాసములో వెనుకటి ధాన్యమును జీర్ణవస్త్రములను వదలివైచి క్రొత్తవానిని గ్రహింపవలయును. ఆహారము అగ్నిపక్వము గావించుకొన వచ్చును. లేదా కాలపక్వము గావించుకొన దగును.

వానప్రస్థు డాచరింపదగిన వ్రతములలో చాంద్రాయణ వ్రతమొకటి. తాను తిను ఆహారము పదునాలుగు కబళము లగుచో మాసములో కృష్ణప్రతిపత్తు మొదలు 14 దినములు దినములకొక ముద్ద చొప్పున తగ్గించుచు అమావాస్యనాడు గంజిత్రాగి రెండవపక్షమున క్రమముగా దినమునకొక ముద్దచొప్పున ఆహారమును హెచ్చు చేయుచుపౌర్ణమినాడు తిరిగి గంజిని మాత్రమే తీసికొనవలయును.

వానప్రస్థుడు గ్రీష్మఋతువులో పంచాగ్ని మధ్యమున తపస్సు చేయవలయును. (అనగా నాల్గు దిక్కులను నాల్గు అగ్నులును, పైని సూర్యుడు నుండగా తపస్సు చేయవలయును.) వర్షఋతువులో వానలో నిలచుండి తపస్సు చేయవలయును. హేమంత ఋతువులో తడిబట్టలతో నుండి తపస్సు చేయవలయును. క్రమాభ్యాసముగా నిట్టి తపస్సు గావింపవలయును. ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము స్నానము చేయవలయును. దేవతలకును పితరులకును తర్పణము చేయవలయును. ఉగ్ర

తపస్సులచేత శరీరమును శోషింప చేసికొన వలయును.

వనములో నాహారము లభింపనిచో నాతడు గ్రామమునకేగి భిక్ష తెచ్చుకొని వనములో తిన వచ్చును. వివిధములైన ఉపనిషద్వాక్యములను పఠించుచు అర్థభావన చేయుచుండ వలయును.

వానప్రస్థ నియమములను పాటించువానికి చిత్తశుద్ధి కలిగి పిమ్మట ఉపనిషద్వాక్య సేవనముచే జ్ఞానోదయమై ముక్తి కల్గును.

సన్యాసాశ్రమము యొక్క యాధ్యాత్మిక సాధనతను గురించి వేఱుగా చెప్పనక్కర లేదు.

## ఉ ప సం హా ర ము

మనువు తాను నిర్దేశించిన ధర్మములను స్వర్గసాధకములనుగాను, ఐహిక సుఖప్రదములనుగాను, జన్మాంతర శ్రేయోదాయకములను గాను మాత్రమే కాక ఆత్మవికాస సాధనములనుగా నుద్దేశించెనని విదితమగు చున్నది.

పైని నిరూపింపబడిన యనుష్ఠానములకు ప్రాణభూతమైనది కామ పరిత్యాగము. ఆత్మ కల్యాణమునకు ప్ర బ ల ప్రతిబంధకమైన కామము సర్వథా త్యాజ్యము ; కాని యనృత జడదుఃఖాత్మకమైన సంసారమునుండి సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మను పొందవలయునను కోరికయు, తత్సిద్ధికై వేదోక్తసాధనముల నవలంబింప వలయునను వాంఛయు మాత్రము త్యాజ్యములు కావు.

కామాత్మతా నప్రశస్తా
నచైవేహా స్త్యకామతా
కామ్యోహి వేదాధిగమః
కర్మయోగశ్చ వైదికః (2-2)

కోరికలను గల్గియుండుట మంచిదికాదు. కాని బొత్తిగా కామములను వీడుట యనునది యుండదు. వేదమును నేర్చుట వేదానుసారము ప్రవర్తించుట కూడ కోరికకు సంబంధించినవే. కాని యట్టి కోరికలు నిషిద్ధములు కావు. వేదోక్తకర్మ నిష్కామముగా నాచరింపబడుచో నది చిత్తశుద్ధి ద్వారా మోక్షహేతు వగును. కావున నట్టి కర్మయోగముకూడ కామవిషయకమే యనుకొని వదలరాదు.



# కఠోపనిషత్తు

పండిత, శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

*

## ప్రథమాధ్యాయము

### ప్ర థ మ వ ల్లి

మున్ను వాజశ్రవసుఁడను మునివరుండు
విశ్వజిద్యాగ మొనరించి విశ్రుతముగఁ
దనదు సర్వస్వము నొసంగె దక్షిణలకు
నతనికిఁ గలండు నచికేతుఁడను సుతుండు.

యాగ దక్షిణలకు నేగు గో గణమును
బాలుఁడగు నచికేతుండు పారఁజూచి
తండ్రి గూర్చి వ్యాకులత లో దాపురింపఁ
దన మనంబున నిట్లని తలఁపఁ జొచ్చె.

గడ్డి తినలేని, నీళ్ళు త్రాగంగ లేని
కట్టి యీనని పాలీని దట్టెములను
ధేనువులఁ జావసిద్ధమౌ వానినీయ
ఘోరనారకమునఁ దండ్రి కూలు ననుచు.

"తండ్రి! నన్నెవ్వనికి నీయఁదలచితి?" వన
వినియు వినకున్న విడువక. వెంటఁబడుచు
రెండు మూఁడు మార్లడుగంగ మండిపడుచు
"ఎవనికోయేల, యమునకు నిత్తు" ననియె.

"పెక్కురకుఁ బ్రధానుఁడ, మఱిపెక్కురకును
మధ్యముఁడఁ, గాని యధముఁడ మాత్రగాన;
ఇటుల మాటాడెదేల, నేనేమి సేతు
యమున? కతఁడేమి సేయున?"న్నని వచించె

"తండ్రి, పెద్దలు తాత ముత్తాతలెట్లు
సత్య పరిపాలన మొనర్పఁ జాలినారొ,
ఆర్యులెట్లు వర్తింతురో యరయవలదె?
పూరివలె మానవుఁడుఁ జచ్చుఁ బుట్టు" ననియె.

అవల నచికేతసుఁడు గౌతమాజ్ఞచేత
శమను నింటికిఁజని త్రిరాత్రములు గడిపె;
నంత నెచటికో పోయినయముఁడు నింటి
కరుగుదేరఁ దత్పచివు లిట్లనిరి పెఱచ.

"అగ్నియే బ్రాహ్మణాకృతి నతిథి యగుచు
భువి గృహస్థుల యిండ్లకుఁబోవుఁగాన
నతిథి కొనరింత్రుగేస్తు లర్ఘ్యాది విధులు.
అటులగుట వేగిరమ్ము పాద్యమ్ముఁదెమ్ము!

అతిధి సత్కార మెఱుఁగనియట్టి మొఱకు
సత్యమాశా ప్రతీక్షలు సంగతమును
పుత్రకులును నిష్టాపూర్తములు పశువులు
నామరూపాలు లేక వినాశమొందు."

అనవిని "మహాత్మ, మాణవకా, మదంగ
ణమున భుజియింపకయ మూడు నాళులుంటి,
విదె నమస్కృతి స్వస్తి నాకెసఁగుగాక,
మూఁడువరము లిచ్చెదఁ గోరు మునికుమార!"

అని యముఁడువల్క "శాంతుఁడ నతిప్రసన్న
మతిని: పితృకోపము తొలంగుగతి నొనర్పు;
మతని నెడబాసినట్టి నన్నతని గూర్పు;
మిదియ మొదలి వరమనుగ్రహింపు" మనియె.

"నీదు తండ్రి గౌతముఁడు మన్నియతుఁడగుట
వెనుకటి విధాన నిను గౌరవించు, సుఖము
గా నిదురఁజెందుఁ, గోపమువాని ప్రీతి
నందు నీయందు"నని యముఁడాడుటయును.

"స్వర్గమందు రోగభయము జరాభయం
బవల మృత్యుభయము నాకలియును
దప్పికయు విచార మెప్పుడు నెఱుఁగక
విందు సుఖములందు చుందు నరుఁడు.

స్వర్గ సాధన మగ్ని విజ్ఞానమీవు
తెలియుదువు; శ్రద్ధగల నాకుఁ దెలుపుమయ్య!
నాకమొందుట యమరత్వ మందుటగుట
నిదియ రెండవవరముగా నిమ్ము దేవ!"

అని నచికేతుం డడిగిన
"యనంత లోకాప్తి హేతువదియ, విరాడ్రూ
ప నిఖిల విశ్వాశ్రయమది,
ఘన చేతఃకుహరదీపికయు"నవె యముఁడున్

అల జగత్తున కాదియౌ నగ్ని గూర్చి
యెల్ల విజ్ఞాన మెఱిఁగించెఁ గృపదలిర్ప,
చెప్పినది చెప్పినటు లొప్పజెప్పు శిష్యు
వెదలఁ బరితృప్తుఁడై యముడిట్టులనియె.

'వత్స, తృప్తుఁడనైతి నీ వలనఁ, గాన
నింక నొక్క వరంబిత్తు; నింతయేల?
అగ్ని నీ పేర వెలుగొందు నట్లొనర్తు,
నిదిగొ ఈ హారమును గూడ నీవు గొనుము.

నాచికేతాగ్ని త్రితయంబు నాచరించి,
తల్లిదండ్రుల గురువుల తలపుసేసి,
భూరి యాగాధ్యయన దానముల నొనర్చి,
భవమ గడచి యాతఁడు పరాత్పరుని దరియు.

త్రిణాచికేతుండు విద్వాంసుఁడీ త్ర
యమ్మెఱింగియు నాచికేతమ్మొనర్చఁ
దొలుత మృత్యుపాశమ్ములఁ ద్రుంచివైచి
శోక రహితుఁడై యపవర్గ సుఖములొందు.

రెండవ వరమ్ము నీవు కోరినద-అగ్ని
స్వర్గ మొసఁగుత, నీకు సంబంధియగుత,
వృద్ధి నాచికేతాగ్ని గాఁ బిలువఁబడుత;
ఇంక మూడవవరము నర్థింపు" మనుడు

"దేహము గతింపదేహి గతించునందు
రొక్క కొందఱు, కాదందు రొక్క కొంద;
ఱిద్దియేమి ప్రబోధింపు మీవు; ఇదియ
మూఁడవ వరం"బటన్న యముండు పలికె

"దేవతలకైన నిందు సందియము కలదు;
ఆత్మధర్మము సులువుగా నరయఁ బడదు,
పరమ సూక్ష్మమ్ము: మఱియొండు వరముగోరు;
మిది విడుము"మన్న నచికేతుఁ డిట్టులనియె.

"దేవతలకును నిందు సందియము కలిగి,
యీవు దుర్జ్ఞేయమని వచియింప - నింక
నీవుగాకున్న నీచిక్కు నెవఁడు విప్పు?
కరుణ నెఱిగింపవే!" యనఁగా నతండు.

"పుత్రులం బౌత్రులఁ జిరజీవులుగఁ గోరు,
మశ్వహస్తి గోహిరణ్యముల గోరు
మఖిల ధరణికి నాధిపత్యమ్ము గోరు,
మాయువును గోరు, మిది వీడుమయ్య!" నీవు.

దీనికి సమంబుగా నెద్దియైన నడుగు:
ధనము వలెనో, చిరంజీవితయె వలయునొ,
సార్వభౌమత వలయునో, సర్వకామ్య
సంభృత ఫలంబొ? కోరు మొసంగు వాఁడ

ఇచ్చవచ్చిన యవుగాము లెల్లఁగోరు,
మప్సరసలను దేవకన్యలను గోరు,
మఖిల సుఖముల నిసుఁదేత్తు: రడుగుమద్ది,
అడుగకుము మరణానంతరాత్మ తెఱుగు!"

అనిన నచికేతుఁ "డివియెల్ల నస్థిరములు,
ఇంద్రియ బలంబులను గృశియింపఁజేయు.
నెల్ల జీవిత మత్యల్ప మిది యెఱుఁగుదు;
నృత్త్య గీతాదికము నీవె నిల్పికొనుమ.

ధనమున నరుండు తృప్తి పెందినదిలేదు.
నిను గనిన యంతనే నవనిధులుఁ గలుగు.
మానవుల జీవితము నీయధీనమగుట
నింక నొకదేలవరము, మన్నింపుమయ్య.

అమరుల యనుగ్రహము నొందినట్టి నరుఁడు
చిత్తమున నమృతమ్ము వాంఛించుఁగాక,
క్షణిక సుఖములయందు నాసక్తుఁడగుచు
నెవఁడు చిరజీవియై బ్రతుకీద్వఁగోరు?

మరణమొందిన యవలి యాత్మను గుఱించి
దేవత లెఱుంగలేరంటి, నీవు దాని
గూర్చియే నాకు బోధింపు; గూఢమైన
యీ తెలివి దక్క వేఱొక్కఁ దేలనాకు?"



[ 20 వ పేజీ తరువాయి ]

ఒక గౌరవనీయమైన స్థానం లభించింది. ఎప్పుడైతే యజమానులు కాకుండా పోయారో, అప్పుడే వారిలో విరోధానికీ, ద్వేషభావానికీ తావులేకుండా పోయింది. ఇటువంటి సామ్యవాదాన్ని స్థాపించడానికి ఎప్పుడైనా సరే, ఎక్కడైనా సరే సర్వాన్ని ధ్వంసం చేయవలసినఅగత్యంకానీ, రక్తపాతంయొక్క అవసరం కానీ, వేధించి బాధించవలసిన పనికాని అణుమాత్రం లేదు. అధికారం నుంచి తొలగించబడిన వారికి నష్టపరిహారం చెల్లించి జమీందారీ విధానాన్ని రద్దుచేస్తూ కాంగ్రెస్ కావించిన కృషి ఇందుకు గొప్ప తార్కాణం. భారతీయ సామ్యవాదం ఒక జీవన విధానం కాని, ఒక మతంమాత్రం కాదు. అందుచేత ఇక్కడ అన్యమతావలంబకులను వేధించడంకాని, భావస్వాతంత్ర్యాన్ని నిషేధించడం కాని ఉండదు.

ఇటువంటి తత్వం కల సూత్రాలను కాంగ్రెస్ ఒకమారు అంగీకరించినట్లయితే ప్రస్తుతం అది ఎదుర్కొంటున్న అనేక సమస్యలనుంచీ, లోనవుతున్న అనర్థాలనుంచీ తప్పక బయట పడుతుందని నాకు తోస్తోంది. జీవితమూ, వ్యక్తీ మతమూ కూడా ఒకానొక లక్ష్యాన్నీ, ప్రయోజనాన్నీ, ఒక ఉన్నత ప్రణాళికనూ సంపాదించుకుని ఉండి ఉండేది. అవాంఛనీయమైన మూలతత్వాలన్నింటినీ దాదాపు పరిత్యజించడం తానంతట అదే జరిగిపోయి ఉండేది. ప్రస్తుతం ఉన్న కార్యకర్తలు ఇలా ఒక విధమైన ఆశాభంగంతో కృంగిపోవడం తటస్థించి ఉండేది కాదు. కాంగ్రెస్ కృషి ఒక నూతన అర్థాన్ని సంపాదించుకుని ఉండేది. మంత్రిపదవులకు ఎగబాకుతున్న ఎవరో కొద్దిమంది అదృష్టవంతులకోసం, తాము వారి చేతుల్లో కీలుబొమ్మలయి కేవలం విధానాలనూ, కార్యక్రమాలనూ ఆచరణలో పెట్టడం కోసమే ఉంటున్నామన్న భావం కాంగ్రెస్ కార్యకర్తలలో కలిగి ఉండేదికాదు. మానవులు జీవించడానికి సాగే ఒక నూతన నిర్మాణంలో తాము ఏజంట్ల వంటి వారమని వారు అనుకుని ఉండేవారు. మనలో ఉన్న ఉన్నతశక్తులన్నింటినీ కూడగట్టి పెల్లుబికేటట్లు చేసి, ఉన్నత అభిప్రాయాలతో, ఆశయాలతో ప్రజలకు ఒక పిలుపు అందించి, వారిలో ఉత్సాహశక్తులను రేకెత్తించి, తద్వారా మన అంతరాంతరాలలోని ఆత్మ వికాసాన్ని అంతటా విస్తరింపచేస్తే అదే మన జాతీయ సంస్కృతికి పునాది అవుతుంది.

★

# శ్రీ భరతమునిప్రణీత

# నాట్యశాస్త్రమ్

★

## ఆంధ్రభారతి

డాక్టర్, శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి,
ఎం. ఏ., ఎం. లిట్., పిఎచ్. డి.

★

రంగ పీఠస్య పార్శ్వేతు కర్తవ్యా మత్త వారణీ ౬౩
చతుః స్తంభ సమాయుక్తా రంగ పీఠ ప్రమాణతః

అధ్యర్థ హస్తోత్సేధేన కర్తవ్యా మత్త వారణీ ౬౪
ఉత్సేధేన తయో స్తుల్యం కర్తవ్యం రంగమండపం.

నాట్యమండపమున గల తూర్పుభాగమును రంగపీఠమందురు. పైనచెప్పిన వికృష్ట నాట్యమండపపు కొలతలను బట్టి దీని తూర్పుపడమరల నిడివి ఆరు గజములు, ఉత్తర దక్షిణములుగా ఇది ఇరువదినాల్గు గజములుండును. ఈ రంగపీఠమున ఉత్తరము వైపున, దక్షిణమున రెండు మదపుటేనుగులను నిర్మించవలెను. ఒక్కొక్క ఏనుగు నాలుగు స్తంభములను కలిసికొని యుండును.

రంగపీఠమున ఈశాన్యమూలగా ఒక స్తంభము, దీనికి పశ్చిమముగా ఆరు గజముల దూరమున రెండవస్తంభము, ఈ రెంటికి మూడు గజములు దక్షిణముగా ఇంకా రెండు స్తంభములు రాగలవు. ఈ విధముగా నాలుగువైపుల మొత్తము ఎనిమిది స్తంభములుండును. తూర్పు ముఖముగా ఆరు గజముల పొడవున ఉత్తర దిశలో ఒక మదపుటేనుగు, దక్షిణమున రెండవ ఏనుగు వచ్చినచో ఒక్కొక్క ఏనుగునకు నాలుగు స్తంభములతో సంబంధముండును.

ప్రేక్షకులు కూర్చొను భూమికి ఈ ఏనుగులు ఒకగజము నాలుగున్నర అంగుళముల ఎత్తుగా ఉండవలెను. మదపుటేనుగు లెంతఎత్తున కలవో అంతఎత్తున రంగ పీఠముండును అప్పుడు మదపుటేనుగులమధ్య గల రంగపీఠమునకు ఆరు గజముల వెడల్పు, పన్నెండు గజముల పొడవు ఉండగలవు.

తస్యాం మాల్యంచ ధూపంచగంధంవస్త్రం తథైవచ ౬౫
నానావర్ణాని దేయాని తథా భూతప్రియో బలిః.

ఆయసం తత్ర దాతవ్యం స్తంభానాంకుశలై రథః ౬౬
భోజనం కృసరాం చైవ దాతవ్యం బ్రాహ్మణాశనమ్

ఏవంవిధి పురస్కారైః కర్తవ్యా మత్తవారణీ ౬౭
రంగపీఠం తతః కార్యం విధి దృష్టేన కర్మణా.

మదపుటేనుగులను నిర్మించువేళ నానావర్ణములుగల పూలమాలలను, ధూపమును, గంధమును, వస్త్రమును అర్పించి, భూతముల కిష్టమైన బలిని వేయవలెను. అప్పుడు రంగపీఠమున కుండవలసిన స్తంభములక్రింద ఇనుముకుంచి, బ్రాహ్మణులకు పులగముతో భోజనమును పెట్టవలెను. ఇట్లు విధిపూర్వకములగు మంత్రములతో, కర్మలతో, మదపుటేనుగులను నిర్మించి, రంగపీఠమును పూర్తిచేయవలెను.

రంగశీర్షంతు కర్తవ్యం షడ్దారుకసమన్వితమ్ ౬౮
కార్యం ద్వారద్వయం చాత్ర నేపథ్యగృహకస్యతు.

రంగపీఠమునకు పడమరగాను, నేపథ్యమునకు తూర్పుగానుగల ఆరు గజముల నిడివిగల భాగమును రంగశీర్షమందురు. నేపథ్యగృహమునకు తూర్పున ఉన్న గోడవద్ద మధ్యగా రెండు స్తంభములను నిర్మించవలెను. ఈ రెండింటిమధ్య దూరము ఆరుగజములు. ఒక్కొక్క స్తంభమునకు తూర్పుగా మూడు గజముల దూరమున మరల రెండు స్తంభములుండవలెను. ఈ నాల్గింటికి క్రింద, పైన రెండు కొయ్యలను వేయగా వచ్చు మండపాకారమును షడ్దారుకమందురు

నటీనటులు వేషములను వేసికొను గదిని నేపథ్యగృహమందురు. ఇది నాట్యమండపమునకు పడమరగా నుండు చివరిభాగము. ఈ నేపథ్య గృహమునకు రెండు ద్వారములుండవలెను. షడ్దారుకములో వెనుకనున్న రెండు స్తంభములకు రెండు ప్రక్కల ఈ ద్వారములు రావలెను. పాత్రల ప్రవేశ నిష్క్రమణములకు ఈ ద్వారము లుపకరించగలవు. షడ్దారుకమున గాయకులు వాద్యములతో ఉండగలరు.

పూరణేమృత్తికా చాత్ర కృష్ణా దేయా ప్రయత్నతః ౬౯
లాంగలేన సముత్కృష్య నిర్లోష్టతృణ శర్కరమ్
లాంగలే శుద్ధవర్ణౌతు ధుర్యే యోజ్యే ప్రయత్నతః ౭౦
కర్తారః పురుషాశ్చాత్ర యేఽంగదోషవివర్జితాః
అహీనాంగైశ్చ వోఢవ్యా మృత్తికాపిటకైర్నరైః ౭౧
ఏవంవిధైశ్చ కర్తవ్యం రంగశీర్షం ప్రయత్నతః

నాట్యమండపభాగమును నాగలితో దున్ని ఎముకలు, వేళ్ళు మొదలగు వాటిని తీసివేసి, నల్లని మట్టితో నింపవలెను. భూశుద్ధిని చేయు నాగలికి బలిష్ఠమైన తెల్లని ఎద్దులను కట్టవలెను. అవయవ దోషము లేని బలిష్ఠులగు పురుషులచే ఈమట్టిని మోయించవలెను. ఈ రీతిగా రంగశీర్షమునుకూడ చేయవలెను

కూర్మపృష్ఠం నకర్తవ్యం మత్స్య పృష్ఠంతథైవచ ౭౨
శుద్ధాదర్శ తలాకారం రంగశీర్షం ప్రశస్యతే

రంగశీర్షము కూర్మపృష్ఠమువలె అన్నివైపుల పల్లముగానుండి, మధ్య ఎత్తుగా గుండ్రగా ఉండరాదు. మత్స్యపృష్ఠమువలె మధ్య ఎత్తుగా, పొడవుగా ఉండరాదు. నిర్మలమైన అద్దముయొక్క సమతల భాగమువలె ఉండు రంగశీర్షమే ప్రశస్తమైనది.

రత్నానిచాత్రదేయాని పూర్వే వజ్రంవిచక్షణైః ౬౩
వైడూర్యం దక్షిణేపార్శ్వే స్ఫటికం పశ్చిమే తథా
ప్రవాల ముత్తరే చైవ మధ్యేతు కనకం భవేత్ ౬౪
ఏవం రంగశిరః కృత్వా దారుకర్మ ప్రయోజయేత్.

రంగశిరస్సున భూమిలో ఉచితములైన రత్నములను విచక్షణుడగు నాట్యాచార్యుడు వేయవలెను. తూర్పున వజ్రమును, దక్షిణమున వైడూర్యమును, పడమర స్ఫటికమును, ఉత్తరమున ప్రవాళమును, మధ్యలో బంగారమును వేయవలెను. ఈ విధముగా రంగశిరస్సును నిర్మించి, కొయ్యపనిని తర్వాత చేయించవలెను.

ఊహ ప్రత్యూహ సంయుక్తం నానాశిల్ప ప్రయోజితమ్ ౬౫
నానా సంజవనోపేతం బహు వ్యాలోపశోభితమ్
భవేయుశ్చాత్ర విన్యస్తా వివిధాః సాలభంజికాః ౬౬
నిర్వ్యూహ కుహరోపేతం నానాగ్రథితవేదికమ్
నానావిన్యాస సంయుక్తం యంత్రజాల గవాక్షకమ్ ౬౭
సుపీఠ ధారణీయుక్తం కపోతాలీ సమాకులమ్
నానా కుట్టిమవిన్యస్తైః స్తంభైశ్చాప్యుప శోభితమ్ ౬౮
ఏవం కాష విధిం కృత్వా భిత్తి కర్మప్రయోజయేత్.

శిల్పియొక్క ఉహాపోహాలను తెలుపు వివిధశిల్పములతో చెక్కబడిన స్తంభములమధ్య స్త్రీమూర్తులగు సాలభంజికలు ఉండవలెను. వివిధ సన్నివేశములతో నుండి, అనేక పక్షులతో శోభించు రకరకముల సాలభంజికలను చక్కగా కూర్పవలెను. భేదింప శక్యముగాని వ్యూహములతో, వివిధవిన్యాసములతో. అనేక ఆకృతులు గల వేదికలను చెక్కవలెను. చతురస్రములు, గుండ్రనివి, ఎనిమిది కోణములు గలవి అగు ద్వారములను నిర్మింపవలెను. స్తంభములపైన తులాదండముల వలె నుండు పీటలను అమర్చవలెను. పావురాల గుంపులతో నిండినట్లు స్తంభములు కన్పించవలెను. అనేక విన్యాసములతోనున్న స్తంభములతో నాట్యగృహము శోభిల్లవలెను. ఈరీతిగా దారుశిల్పములను చేయించి, ఆ తర్వాత గోడలవిషయము నాలోచించవలెను.

స్తంభంవా నాగ దంతంవా వాతాయనమథాపివా
కోణంవా స ప్రతిద్వారం ద్వారవిద్ధం నకారయేత్. ౬౯

స్తంభముపైన వేయు నాగపుష్పమును నాగదంతమందురు. స్తంభమునకుగాని, నాగదంతమునకుగాని, కిటికీలకుగాని ద్వారవేధ కలుగరాదు. మూలలో ద్వారములున్నను వేధ కలుగును. కనుక అట్టి ద్వారముల నుంచరాదు.

కార్యః శైలగుహాకారో ద్విభూమి ర్నాట్య మండపః
మంద వాతాయనోపేతో నిర్వాతో ధీరశబ్దవాన్ ౭౦
తస్మా న్నివాతః కర్తవ్యః కర్తృభి ర్నాట్యమండపః
గంభీరస్వరతాయేన కుతపస్య భవిష్యతి. ౭౧

ముందు కూర్చొను ప్రేక్షకులు వెనుక కూర్చున్నవారికి అడ్డముగా నుండరాదు. కనుక క్రమక్రమముగా వెనుక కూర్చొనువారి ఆసనములను ఎత్తుగా నుంచుచు, వీటిని నిచ్చెన మెట్లవలె నిర్మించవలెను చిట్టచివరి ఆసనముల ఎత్తు రంగపీఠముయొక్క ఎత్తుకు సమానముగా నుండవలెను. ఇట్లుచేయగా ప్రేక్షకులుండు భూభాగము, నాట్యప్రయోగమును చూపు భూభాగము అను రెండు భూభాగములు రాగలవు. ఆసనములు సోపానమువలె నుండుటచే నాట్యగృహము కొండ గుహవలె కన్పించగలదు.

నాట్యమండపమున జల్లెడవలె అల్లిన కిటికీలు మాత్రమే ఉండవలెను. అప్పుడు మంద పవనమే లోనికిరాగలదు. గీతవాద్యములు మ్రోగునపుడు మందపవనమున్నచో చక్కని స్వరమురాగలదు. లేనిచో ప్రతిధ్వని బయలుదేరును. నాట్యాచార్యుడీ నియమములను గమనించి నాట్యమండపమును నిర్మించవలెను.

రంగపీఠమునకు రంగశీర్షమునకు మధ్య రంగపీఠమంత నిడివిగల తెర ఉండును. వనమును, ఉద్యానమును చూపునపుడు, అంతర్నాటికను చూపునపుడు రంగశీర్షము నుపయోగించవలెను. అప్పుడుషడ్దారుకమును కప్పివేయు తెరఒకటి ఉండగలదు.

భిత్తికర్మ విధింకృత్వా భిత్తిలేపం ప్రదాపయేత్ ౭౨
సుధాకర్మ బహిస్తస్యవిధాతవ్యం ప్రయత్నతః
భిత్తిష్వథ విలిప్తాసు పరిమృష్టాసు సర్వతః ౭౩

సమాసుజాత శోభాసు చిత్రకర్మ ప్రయోజయేత్
చిత్రకర్మణి చాలేఖ్యాః పురుషాః స్త్రీజనాస్తథా ౭౪

లతాబంధాశ్చ కర్తవ్యాశ్చరితం చాత్మభోగజమ్
ఏవం వికృష్టం కర్తవ్యం నాట్యవేశ్మ ప్రయోక్తృభిః. ౭౫

గోడలు పూర్తియైన తర్వాత గోడలకు రంగువేయవలెను. గోడలకు వెలుపలివైపున సున్నమును పూయించి, శుభ్రముగా, సనుముగా కన్పించి, శోభించుచున్న గోడలపైన బొమ్మలను వేయించవలెను. పురుషులను, స్త్రీలను, లతాబంధములను, తన కానందమునిచ్చుటకు అభిమతమగు చరిత్రను చిత్రలేఖనద్వారా చిత్రింపజేయవలెను. ఈ రీతిగా మధ్యమపరిమాణముగల వికృష్టనాట్యగృహమును నిర్మించవలెను.

వికృష్టనాట్య గృహములలో మధ్యమపరిమాణము గలదీ రీతిగానుండును.

షున రేవహి వక్ష్యామి చతురశ్రస్య లక్షణమ్
సమంత తశ్చత ర్వాత్కరాన్ ద్వాత్రింశ దేవతు ౮౬
శుభభూమివిభాగస్థో నాట్యజ్ఞై ర్నాట్యమండపః
యోవిధిః పూర్వముక్త స్తల్లక్షణమంగలానిచ ౮౭
వికృష్టేతాన్య శేషాణిచతురశ్రేపికారయేత్,

ఇక మధ్యమ పరిమాణముగల చతురస్ర నాట్యగృహముయొక్క లక్షణము లను చెప్పుచున్నాను. దీనిపొడవు 64 మూరలు లేక 48 గజములు. నలుచతుర మగుటచే వెడల్పుకూడ 48 గజములుండును నాట్యజ్ఞులు ఈ భూభాగమును శోధించి, వెనుకటివలె రెండుభాగములుగా చేయవలెను. వికృష్టనాట్యమండపమును వివరించునపుడేయే లక్షణములు, జపములు, శాంతులు చెప్పినారో, వాటిని ఇక్కడ కూడ చెప్పికొనవలెను. అక్కడ చెప్పని విషయములేవైన ఇక్కడ చెప్పబడినచో, వీటిని అక్కడకూడ చెప్పుకొనవలెనని శాస్త్రమర్యాద.

చతురశ్రం సమంకృత్వా సూత్రేణ ప్రవిభజ్యచ ౮౮
బాహ్యతః సర్వతః కార్యాభిత్తిః శ్లిష్టేష్టకాదృఢా
కృతాభ్యంతరతః కార్యం రంగపీఠం యథావిధి ౮౯
దశప్రయోక్తృభిః స్తంభాః శక్తామండపధారణే
స్తంభానాం బాహ్యతశ్చాపి సోపానాకృతి పీఠకమ్ ౯౦
ఇష్టకాదారుభిః కార్యం ప్రేక్షకాణాం నివేశనమ్
హస్తప్రమాణై రుత్సేధైర్భూమి భాగసముత్థితైః ౯౧
రంగపీఠావ లోక్యంతు కుర్యాదాసనజం విధిమ్.
షడన్యానంతరే చైవ పునః స్తంభాన్ యథాదిశమ్ ౯౨
విధినా స్థాపయేత్తజ్ఞో దృఢాన్ మండపధారణే
అష్టౌ స్తంభాన్ పునశ్చైవ తేషా ముపరి కల్పయేత్ ౯౩

దారముతో చతురస్ర నాట్యగృహపు భూమిని రెండు సమభాగములుగా చేసి, వెలుపలివైపున అన్ని ప్రక్కల ఇటుకతోను, సున్నముతోను గట్టిగా గోడలను కట్టవలెను నలుచదురముగా నుండు రంగపీఠము ఇక్కడ రాగలదు. దీనిపొడవు ఆరుగజములు, వెడల్పు ఆరుగజములు. ఈ రంగపీఠమునకు వెలుపలగా పది స్తంభ ములుండుట ప్రశస్తము. ఈ స్తంభములకు వెలుపలనున్న ప్రదేశమున ప్రేక్షకులు కూర్చొనుటకు నిచ్చెనమెట్లవలె ఆసనములుండవలెను. వీటిని ఇటుకతోను, కొయ్యతోను ఏర్పరచవలెను. ముందు మెట్టుకన్న వెనుక మెట్లు ఎక్కువ ఎత్తుగానున్నప్పుడే రంగపీఠమందరకు కన్పించగలదు.

ఈ చతురస్రగృహమున పది స్తంభములు విశేషముగా చెప్పబడినవి. తర్వాత ఆరు స్తంభములను, ఎనిమిది స్తంభములను, మరల విధించినాడు. 'అష్టౌస్తంభాన్ పునశ్చైవతేషా ముపరి కల్పయేత్' అని 'శక్తామండపధారిణే' అని, 'దృఢాన్

మండపధారణే' అని, 'భిత్తిశ్శైలేష్టకా దృఢా' అని భరతుడు పలుకుచు దృఢ, శక్తి, ఉపరి అనుపదములను ప్రయోగించినాడు. వీటినిబట్టి ప్రాచీననాట్యమండపములలో ఉపరిప్రాసాదము (పై అంతస్తు) ఉండెడిదని నిర్ణయింపవలెను.

రంగశిరస్సున గల స్తంభములను మండపాకారమున నిల్పినచో వీటిపైన స్వర్గాదులను చూపుటకొరకు ప్రాసాదమురాగలదు. రంగపీఠసమాన విస్తారముగల అంతస్తుకూడ రాగల వీలున్నది. దీనికి ఎనిమిది స్తంభము లుండగలవు. రంగశీర్షమునకు పైన ఆగ్నేయమూల ఒక స్తంభముండును. దీనికి ఉత్తరముగా ఆరుగజముల దూరమున ఒక స్తంభముండును. ఇట్లే ఈశాన్యమూలన ఒకటి, దీనికి దక్షిణముగా ఆరుగజముల దూరమున రెండవది రాగలవు ఇట్లే పశ్చిమమున నాలుగు స్తంభములుండగలవు. ఈ స్తంభముల మధ్యగల పన్నెండుగజముల భాగము పైఅంతస్తు కాగలదు. ఇదికూడా నలుచతురము కావలెను గనుక దీని వెడల్పుకూడ పన్నెండుగజములుండును. ఇక్కడ వేదికలక్రిందగాని, విడిగదులక్రిందగాని ఇటు మూడుగజములు, అటు మూడుగజములు పోగా పై అంతస్తు ఆరు చదరపుగజము లుండును.

ప్రేక్షకులు కూర్చొనుచోట పది స్తంభము లుండగలవు. గోడలకు తొమ్మిది గజముల దూరమున నివి రావలెను. ఒక్కొక్క స్తంభమునకు మధ్య ఆరుగజముల దూరముండును. పది స్తంభములకు గోడలకు మధ్యగల ప్రదేశమున సోపానాకృతిగల అసనములుండును. ఉత్తరమునగల స్తంభములకు, దక్షిణమునగల వాటికి మధ్యనున్న ఆరుగజముల భూమియందు ఉత్తమప్రేక్షకుల కాసనములుండగలవు.

గాయకాదులకు నిర్మింపబడిన షడ్దారుకము చతురస్ర నాట్యగృహములో నేపథ్యమున రాగలదు.

విద్ధాస్య మష్టిహస్తంచ పీఠంతేషు తతోన్యసేత్
తతః స్తంభాః ప్రదాతవ్యా స్తజ్జ్ఞై ర్మండపధారణే ౯౪
ధారణీ ధారణాస్తేచశాలస్త్రీభి రలంకృతాః.

మండపమున పద్మము మొదలైనవాటిని చెక్కిన ముఖ్య స్తంబములపైన ఆరుగజముల పీటను వేయవలెను. తులాదండమువలె దీనిని మూాయు స్తంభములపై శాలస్త్రీల అకృతులను చెక్కించి అంగమును పొదుగవలెను.

నేపథ్య గృహకంచైవతతః కార్య ప్రయత్నతః ౯౫
ద్వారం చైకంభవేత్తత్ర రంగపీఠ ప్రవేశనమ్
జనప్రవేశనం చాన్యదాభిముఖ్యేన కారయేత్ ౯౬

రంగశీర్షమునకు పశ్చిమముగా నేపథ్యగృహమును నిర్మించవలెను. దీనినుంచి నటీనటులు రంగపీఠమును ప్రవేశించుటకు వెనుకటివలెనే ద్వారము లుండవలెను. వీటితోపాటు ఈ రెంటికి మధ్య మరియొక ద్వారమీ నాట్యమండపమున మండ

వలెను. సామాజికులు నాట్యగృహమును ప్రవేశించుటకు రంగపీఠమున కభిముఖముగా, నాట్యగృహమునకు తూర్పున నాల్గవద్వారమును నిర్మించవలెను.

అష్టహస్తంతు కర్తవ్యం రంగపీఠం ప్రమాణతః
చతురస్రే సమతలం వేదికా సమలంకృతమ్ ౯౮
పూర్వప్రమాణ విష్టారి కర్తవ్యా మత్తవారణీ
చతుః స్తంభ సమాయుక్తా వేదికాయాస్తు పార్శ్వతః ౯౯



సమున్నతం సమం చైవరంగ శీర్షంతుకారయేత్
వికృష్టే హ్యున్నతం కార్యం చతురస్రే సమంతథా
ఏవమేతేన విధినా చతురస్రం గృహం భవేత్

రంగపీఠ మూరుగజముల చతురము. ఒక గజముపరక ఎత్తున సమతలము లగు వేదికలను దీనికి రెండువైపుల నిర్మించవలెను. ఒక్కొక్క వేదిక మూడుగజ ములుండును. ఒక్కొక్కప్పుడీ వేదికలు నాట్యయోగ్యములగు గదులుగా ఉండ గలవు. వీటిప్రక్కల వెనుక చెప్పినరీతిగానే రెండు మదపుటేనుగులు రావలెను. రంగపీఠము కంటె కొంచెము ఎత్తైన రంగశీర్షము వికృష్టమండపమున రాగలదు. కాని చతురస్రమున రెండును సమానముగా ఉండవలెను. ఈరీతిగా వచ్చు మధ్యమ నాట్యగృహములలో చతురస్రమిట్లుండ గలదు. ఈ చిత్రమున పైఅంతస్తును చూపుటలేదు.

అతఃపరం ప్రవక్ష్యామిత్ర్య స్రగేహస్యలక్షణమ్ ౧౦౦
త్ర్యస్రంత్రికోణం కర్తవ్యం నాట్యవేశ్మ ప్రయోక్తృభిః
మధ్యే త్రికోణమేవాస్య రంగపీఠంతు కారయేత్ ౧౦౧
ద్వారంతే నైవకోణేన కర్తవ్యం తస్యవేశ్మనః
ద్వితీయం చైవ కర్తవ్యం రంగపీఠ స్యపృష్ఠతః ౧౦౨
విధిర్యశ్చతు రస్రస్యభిత్తి స్తంభసమాశ్రయః
సతుసర్వః ప్రయోక్తవ్యః త్ర్యస్రస్యాపి ప్రయోక్తృభిః ౧౦౩

ఇక త్రికోణాకారముగా నుండు నాట్యగృహముయొక్క లక్షణము చెప్పు చున్నాడు. ఇది గుర్రపునాడావలె నుండు నాట్యగృహము. ఇచట రంగపీఠము కోణాకృతిలో నుండును. దీనికి పశ్చిమముగా రంగశిరస్సు, ఆ పైన నేపథ్యము ఉండగలవు. నేపథ్యగృహమునుంచి పాత్రలు ప్రవేశించుటకు రంగపీఠమునకు పడమర గా నున్న కోణములవద్ద రెండుద్వారము లుండవలెను చతురస్ర నాట్యగృహ సంద ర్భమున చెప్పిన రీతిగానే గోడలను, స్తంభములను నిలుపవలెను. వెనుక చెప్పిన నాట్య గృహ లక్షణముల నన్నిటిని ఇక్కడకూడ వర్తింపజేయవలెను.

ఏవమేతేన విధినా కార్యనాట్య గృహోబుధైః
పునరేషాం ప్రవక్ష్యామి పూజామేవం యథావిధి ౧౦౪

ఇతి శ్రీ భారతీయే నాట్యశాస్త్రే నాట్యమండప విధానంనామ ద్వితీయోఽధ్యాయః

ఈ విధుల ననుసరించి నాట్యగృహములను విద్వాంసులు నిర్మించవలెను. ఇక ఈ నాట్యగృహములలో జరుగవలసిన శాస్త్రీయమగు పూజావిధిని మూడవ అధ్యా యమున భరతుడు చెప్పగలడు.

శ్రీ భారతీయ నాట్యశాస్త్రమున ఆంధ్రభారతిలో నాట్యమండప విధాన మను రెండవ అధ్యాయము.

# శ్రీ లల్లి

శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

౧

నీ వెవరో తెలియదు, నే నెవరో తెలియదు నీతో ఐక్యమూ తెలియదు. దేహమే నేనని అనుకోడంవల్ల—'నీ వెవరు? నేనెవరు?' అని సంశయం. (౭)

౨

శివుడు గుఱ్ఱం, కేశవుడు జీను, ఆత్మ-భవుఁడు లాడాలు; తగిన రౌతుఎవడో నాకు చెప్పు. (౧౪)

౩

అప్పు సొప్పులు తీర్చుకోడం ఒక తీర్చుకోడం కాదు తిండి బట్టల భ్రమ తీర్చుకోవాలి. (౨౭)

౪

చలికిమాత్రం గుడ్డ; ఆకలికి మాత్రం కూడు. (౨౮)

౫

సహజావస్థకు శమదమాలు కారణం కావు; మరి వివేకం నీటిలో ఉప్పు కలిసినట్లు ఏకమయినా ఈ యవస్థ కాదు. (౨౯)

౬

సహజస్థితిలో భేదం అనేది కలికానికి కూడా కానరాదు। బయలులో బయలు కలిసినటులు కలిసిపోవడం సహజస్థితి. (౩౦)

౭

ఒకానొకడు నిదురపోతైనా జాగరూకుడే। ఒకడు జాగరూకుడైనా నిదుర పోతే। ఒకానొకడు ఆడంటు ఐనా పవిత్రుడే! ఒకడు స్నానంచేసినా అశుచే

౮

ద్వాదశాంతంలో తానే కట్టిన దేవళంలో కూచుని ప్రాణసూర్యుణ్ణి ప్రరోచనచేసి శంకరుడై పోయేవాడిక ఎవరిని పూజిస్తాడు? (౩౫)

౯

ఓయోగీ! నీకు జల స్తంభం ఎందుకు? అగ్ని స్తంభన ఎందుకు? ఆకాశగమనం ఎందుకు? కొయ్యావు పాలుపిండడ మెందుకు ? ఇదంతా బడాయి కాదా ?

౧౦

ఏ దిక్కున ఏ దారిని వచ్చానో మళ్ళా ఏదారిని పోతానో తెలియదు; ఉచ్ఛ్వాసమే నాకు ధైర్యం.

౧౧

ఓ ప్రభూ! నీకూ ఆరు. నాకూ ఆరు; నీవు పలికవు, నేను వెంకను: ఇదే తేడా. (౧౩)

౧౨

అయ్యా! దేహోద్భులైన ఆరు కోశాల అడ్డువల్ల నిన్ను కానక చాలా కాలం దుఃఖపడ్డాను। ఇపుడో ఉపాధి బద్దలయింది; విశ్రాంతి దొరికింది. (౪౪)

౧౩

ఆడుతూ పాడుతూ నవ్వుతూ ననుపుతూ నీదేహంలోనే వున్న ఆత్మదేవుణ్ణి చూడు; దేశాంతరంలో ఏమి వెతుకుతావ్ ? (౪౬)

౧౪

ఒజ్జా! నాకిది చెప్పు :—హోహ్, హూహ్, ఈరెండూ అస్య మతాలేకదా ! హోహ్ వేడిగా ఉండడ మేం? హూహ్ చల్లగా ఉండడమేం ? (౫౬)

౧౫

హోహ్, జఠరాగ్నితప్తమై నాభిదగ్గరనుంచి లేస్తుంది; హూహ్, ద్వాదశాంతంనుంచి పుటుతుంది; హోహ్ ప్రాణం; హూహ్ అపానం.

౧౬

లల్ల పత్తికాయలాగ జీవితం ఆరంభించింది. అది వికసించేసరికి దాన్ని కోశారు। ఒకరు పింజ తీశారు। ఒకరు ఏకారు। ఒకరు వడికారు। ఒకరు ఉతికారు। ఒకరు మగ్గంలోపెట్టి అటూ ఇటూ కొట్టారు। ఒకరు కత్తిరించారు। ఒకరు అంగీ కుట్టారు। అమ్మయ్య! అంతటితో దీనికి విముక్తి! జీవుడిదారి ముండ్లడొంక !

౧౭

నన్ను నేను తెలుసుకోడానికి శ్రమపడి శ్రమపడి ప్రాణాయామాదులతో అలసి అలసి అతివిజనమైన జ్ఞానమార్గంలో నడచి నడచి ఆనందసురా గృహం చూచాను। ఇక్కడ ఉన్నవన్నీ నిండుకుండలే। ఎవడు కాని ఈకల్లుపాక చేరీ, తాగకుండా పోతే, పోనీ; వాడి ఖర్మం!

---

లల్లనుగూర్చి Sir R. C. Temple ఇలా వ్రాశాడు :

**Thine is a song that enslaveth me,**
**Son of an alien kin and cline.**



సమ్మార్జన ★ చిత్రశిల్పి: శ్రీ డ్యె ధర్మారావు

శ్రీః

# జగన్నాథ పండితరాయ విరచిత

# లక్ష్మీలహరి

అనువాదకులు :- డాక్టర్ శ్రీ బూర్గుల రామకృష్ణరావు.

సమున్మీల న్నీలాంబుజ నికర నీరాజితరుచా
మపాంగానాం భంగై రమృతలహరీ శ్రేణిమసృజైః
ప్రియాహీనం దీనం భృశ ముదరలీనం కరుణయా
హరిశ్యామా సా మా మవతు జడసామాజికమపి.

శ్రీ నిత్యోదయ నీలనీరజరుచి శ్రీరాజి నీరాజితా
నూనాపాంగ తరంగితామృతరుచిన్ దోగించుతన్ నన్ ప్రదపా
హీనున్ దీనుని గుక్షిసంభరణ వృత్త్యేకార్థిను న్జడా
స్థానున్ భార్గవి విష్ణువల్లభ కృపాసారస్య సంభారయై. 1

సమున్మీల త్వంతఃకరణ కరుణోద్గార చతురః
కరి ప్రాణత్రాణ ప్రణయిని దృగంత స్తవ మయి
య మాసాద్యోన్మాద్య ద్విపనియుత గండస్థల గల
న్మదక్లిన్నద్వారో భవతి సుఖసారో నరపతిః.

కరిసంరక్షణ దక్షు సుందరి! భవత్కారుణ్య వీక్షాంచల
స్ఫురణంబయ్యది నాపయిన్ వెలయుతన్, శోభిల్లు నెద్దాన, ను
ర్వర మాద్యద్ద్విపకోటిగండ మద ధారాపంకిలద్వారుఁడై
సరస శ్రీసుఖసారుఁడై నరుఁడహో! సామ్రాజ్య ధౌరేయుఁడై. 2

ఉరస్యన్యత్రస్య త్కబరభర విర్యత్సుమనసః
పతంతి వ్వర్బాలాః స్మరశర పరాధీన మనసః
సురా స్తం గాయంతి స్ఫురితతను గంగాధరముఖా
స్తవాఽయం దృక్పాతో యదుపరి కృపాతో విలసతి.

ఈవు కృపామృతేక్షణము లెవ్వనిపై వెలయింతువో భువిన్
పూవులు కొప్పులం దొలుగఁ బూవిలుకానికిఁ జిక్కి దేవక
న్యావళి వ్రాలువాని యురమందు స్వయమ్ముగ శంకరాదులున్
బావన తద్యశః పరమ మంగళ గీతిక లాలపింపగన్. 3

సమీపే సంగీత స్వరమధుర భంగీ మృగదృశాం
విదూరే దానాంధద్విరద కలభోద్దామనినదః
బహిర్ద్వారే తేషాం భవతి హయహేషా కలకలో
దృగేషా తే యేషా ముపరి కమలే! దేవి! సదయా.

లలనా సుస్వర భంగిమన్ మధురముల్ సంగీతముల్ చెంత, ద
వ్వుల దానాంధ కరేణుశాబక ఘటాప్రోల్లాసి ఘీంకారముల్

లలిత ద్వారబహిః పథాన హాయహేలా ఘోషలుల్ సర్వవే
ళల విన్పించు భవత్కటాక్షరుచిమాలా పాత్రమే వారికిన్ 4

అగణ్యై రింద్రాద్యై రపి పరమపుణ్యైః పరిచితో
జగజ్జన్మస్థాన ప్రలయ రచనా శిల్ప నిపుణః
ఉదంచత్పీయూషాంబుధి లహరీలీలా మనుహర
న్నపాంగ స్తేమందం మమకలుష బృందం దలయతు.

పరిచితమై యగణ్య సురపాలక ముఖ్య సుపుణ్య కోటికం
దరికి, జగజ్జని స్థితి వినాశన శిల్పమునం దనల్పమై,
విరిసి మహామృతాంబునిధి వీచి విలాస విశేష మానునీ
దరనయనాంచలద్యుతి యదల్చుత మామక పాపపుంజముల్ 5

నమన్మౌలి శ్రేణి త్రిపురమథి ప్రతిలప
త్కపర్ద వ్యావృత్తి స్ఫురిత ఫణిఫూత్కార చకితః
లసత్ఫుల్లాంభోజ ప్రమదిమహరణః కోఽపిచరణ
శ్చిరం చేతశ్చారీ మమభవతు వారీశ దుహితుః.

పురహరి పంథివంచి శిరమున్ వినయమ్మున మ్రొక్కువేళయం
దొరగి వడిన్ గపర్దమున నుండిన యాఫణి పూత్కరింప, వి
స్ఫుర దరుణా రుణాబ్జరుచి సొంపెనయన్ గదలొందునట్టి శ్రీ
చరణము మన్మనశ్చరణ చారణమై విలసిల్లుఁ గావుతన్ 6

ప్రవాలానాం దీక్షాగురు, రపిచ లాక్షా రుణరుచాం
నియంత్రీ, బంధూకద్యుతి నికర బంధూకృతిపటుః
నృణా మంతర్ధ్వాంతం నిబిడ మపహర్తుం తవకిల
ప్రభాతశ్రీ రేషా చరణరుచి వేషా విజయతే.

దీక్షాచార్యక మాప్రవాళములకున్, దీపింప లాక్షారస ప్రా
ప్రక్షీణ ద్యుతికిన్ నియామకమునున్, బంధూక బంధుప్రభా
నిక్షేప, మ్మఖిలాంత రాంతర తమో నిర్ధూతిఁ బ్రాభాతిక
శ్రీ క్షీరాబ్ధి కుమారి నీదు చరణశ్రీరేఖ వర్ధిల్లుతన్ 7

ప్రభాతోన్మీలచ్ఛ్రీ కమలవన సంచారసమయే
శిఖాః కింజల్కానాం విదధతి రుజం యత్ర మృదులాః
తదేత న్మాత స్తే చరణ మరుణం శ్లాఘ్యకరుణం
కఠోరా మద్వాణీ కథమియ మిదానీం ప్రవిశతు.

అరుణార్కద్యుతి విచ్చు పద్మవని నీవందమ్ముగా మెట్ట, నీ
యరుణమ్మౌ చరణమ్ము శ్లాఘ్య కరుణ మ్మందందుఁ గింజల్కవి
స్ఫురితాగ్రమ్ములు నుచ్చి నొచ్చుకొను నవ్వో మత్కఠోరోక్తి వి
స్తర మేలాగునఁ దాక వచ్చుజననీ! త్వత్పాదసౌందర్యమున్ 8

స్మితజ్యోత్స్నా మజ్జ ద్ద్విజమణి మయూఖామృతఝరై
ర్నిషించంతీం విశ్వం తవ విమలమూర్తిం స్మరతియః
అమందం స్వంద్యంతే వదన కమలాదస్య సుకృతినో
వివిక్తా వై కల్పాః సతత మవికల్పా నపగిరః.

దరహాసేందురుచిన్ మునుంగు ద్విజరత్న శ్రీమయూఖామృత
స్ఫురణన్ విశ్వము నోలలార్చెడు భవన్మూర్తిన్ స్మరింపంగ, న
న్నరు నాస్యాబ్జమునందు జాలొకొను నమందజ్ఞానకల్పమ్ములీ
శ్వరి! యాకల్ప మనల్ప సూక్తుల వికల్పమ్ముల్ సుధాకల్పముల్ 9

స్మరో నామం నామం త్రిదజగదభిరామం తవపదం
ప్రపేదే సిద్ధింయాం కథమివ నరస్తాం కథయతు
యయా పాతంపాతం పదకమలయోః పర్వతచరో
హరో హరో సార్ధాం మనునయతి శైలేంద్రతనయామ్.

జగదభిరామ నీచరణ సారసయుగ్మము మ్రొక్కిమ్రొక్కి యే
యగణితసిద్ధి నొందెనో సుమాయుధుఁడయ్యది సెప్పనేర్తునే,
యగజ పదాబ్జమంటి మఱియంటి యొకానొక కొండకోయముక్
బగవగ గొన్నయామె బ్రతిమాలుటకుం గత మద్దియేకదా. 10

హరంతో నిశ్శంకం హిమకరకలానాం రుచిరతాం
కిరంతః స్వచ్ఛందం కిరణమయ పీయూషనికరమ్
విలుంపంతు ప్రౌఢా హరి హృదయహారా ప్రియతమా
మమాంత స్సంతాపం తవచరణ శోభాంబుజనఖాః.

శ్రీచరణారుణాబ్జ నఖరేఖ మదాంతర తాపమార్చుతన్
దోఁచి యశంకనిందు కళఁదోచురుచుల్, కిరణావళిన్ సుధా
వీచికలన్ వెలార్చియును, విష్ణుహృదంతరహార మండల
శ్రీచకిత ద్యుతిన్ కళలు చిందులు వార ముకుందవల్లభా. 11

మిషా న్మాణిక్యానాం విగళిత నిమేషం నిమిషతా
మమందం సౌందర్యం తవచరణయో రంబుధిసుతే
పదాలంకారాణాం జయతి కలనిక్వాణన పటు
స్సమంచ న్నుద్దామః స్తుతి వచన లీలాకలకలః

జలనిధికన్య! నీ చరణచారు విలాస విశేషముల్ మణి
చ్ఛలమున నిర్నిమేషమ్ముగ సారె కనుంగొనుచుండు, త్వత్పదో
జ్జ్వల మణి భూషణావళి రవమ్మదియింపగుఁ దత్ప్రశస్తిసం
లలితవచః కనత్కల కలమ్మనగన్ ; శ్రుతిమోహనమ్ముగన్ 12

మణిజ్యోత్స్నాజాలై ర్నిజతనురుచాం మాంసలతయా
జటాలంతే జంఘాయుగల మఘభంగాయ భవతు!

భ్రమంతి యన్మధ్యే దరదళిత శోణాంబుజ రుచాం
దృశాం మాలా నీరాజ నమివ విధత్తే మురరిపోః

హారిఫుల్లారుణలోచనాంబుజ సముద్య ద్దృష్టి తారావళుల్
పరమోదారరుచిన్ సముద్యతములై పల్మారు తామారతిన్
నిరతిన్ బట్టమణి ప్రభాజటిలతన్ స్వీయప్రభామాంసల
స్ఫురణం బోల్చు త్వదీయ జంఘలఘుమున్ బోకార్చి రక్షించుతన్ 13

హరద్గర్వం సర్వం కరిపతి కరాణాం మృదుతయా
భృశం భాభి ర్దంభం కనకమయరంభావ విరుహామ్
లసజ్జాను జ్యోత్స్నా పరణి పరిణార్ధం జలధిజే।
తవోరు ద్వంద్వంనః శ్లధయతు భవోరు జ్వరభయమ్.

కోమలతన్ మదేభకర కోటిమదం బడఁగించి, కాంతులన్
హేమమయాం శుమత్ఫల మహీజము గర్వముడించి, మించియున్
సామజయాన! జానుయుగ చంద్రికలన్ బరిణద్ధ మౌత్వదు
ద్దామ పృథూరుయుగ్మక మదల్చు భవజ్వర తాపవేగమున్. 14

కలక్వాణాంకాంచీం మణిగణ జటాలా మధివహ
న్వసానః కౌసుంభం వసన మపనం కౌస్తుభరుచామ్
మునివ్రాతైః ప్రాతః శుచివచనజాతై రతినుతం
నితంబస్తే బింబం హసతి నవ మంబాంబరమణేః.

కవితశ్రీమణి కింకిణీ క్వణనమౌ కాంచీకలాపమ్ము, ని
ర్మల కౌసుంభరుచి ప్రకీర్ణమగు చీరన్ కౌస్తుభ జ్యోతిమం
జులమై మించుచు వేకువన్ మునిశుచి స్తోత్రార్థమై అంబ! రం
జిలు నీ భూరినితంబ మంబరమణి శ్రీ బింబమున్ నవ్వెడిన్. 15

జగన్మిథ్యాభూతం మమనిగదతాం వేదవచసా
మభిప్రాయో నాద్యావధి హృదయమధ్యా విశదయమ్
ఇదానీం విశ్వేషాం జనక ముదరం తేవిమృశతో
వి సందేహం చేతోఽజని గరుడకేతోః ప్రియతమే.

జగములు వట్టి మిథ్యయని చాటెడు వేదనిరూఢ వాక్యముల్
తగునని యింతదాక మదిఁదట్టనలేద; స్ఫురించెనిప్పుడే,
ఖగపతి కేతనప్రియ! జగజ్జని హేతువు నీదుకుక్షిమి
థ్యగఁగని పింప; కారణగుణానుగతమ్మనుఁగార్య మెప్పుడున్. 16

అనల్పై ర్వాదీంద్రై రగణిత మహాయుక్తి వివహై
ర్నిరస్తా విస్తారం క్వచిదకలయంతీ తనుమపి
అసత్ఖ్యాతి వ్యాఖ్యాధిక చతురిమాఖ్యాత మహిమా
వలగ్నే లగ్నేయం సుగతమతసిద్ధాంత సరణిః.

ఖ్యాతిఁ వాదివరుల్ స్వయుక్తితతిఁ ద్రోయన్ శూన్యవాద, మ్మసత్
ఖ్యాతివ్యాఖ్య ననన్యసామ్య మహిమ మ్మా బౌద్ధసిద్ధాంత, మే
రీతిన్ బెంపును సొంపుసుందఱిగె ధాత్రిన్ నీడలేకుందునుక్
మాతా! నీదువలగ్న లగ్నముఖ యీమాత్రమ్ముగాఁ దోఁచెడిన్ 17

నిదానం శృంగార ప్రకరమకరందస్య కమలే
మహానే వాలంబో హరినయన రోలంబవరయోః
నిధానం శోభానాం నిధన మనుతాపస్య జగతో
జవే నాభీతిం మేదిశతు తవనాభీ సరసిజమ్.

నవశృంగార మరంద ధారకు నిదానమ్మై, నిధానమ్మునై
స్తవనీయమ్మగు శోభకున్, నిధనమై తాపాన, కాలంబమై
ధవు నాలోకన చంచరీకములకున్ ద్వన్నాభి పద్మమ్ము దా
నవలంబమ్మగుఁ గాక మా కభయదమ్మై వేగఁ బద్మాలయా! 18

గభీరా ముద్వేలాం ప్రథమరస కల్లోల మిళితాం
విగాఢుం తే నాభీ కమలసరసీం గౌర్మమ మనాక్
పదం యావ న్న్యవ్యత్యహహ వినిమగ్నేవ సహసా
నహి క్షేమం సూతే గురుమహిమభూతే ష్వవినయః।

శ్రీలుద్వేలములై గభీరమునునై శృంగారపీయూష క
ల్లోలోల్లోలము నీదునాభి సరసిన్ లోలోన మద్వాణితా
నోలాడన్ బదముంచు నంతటన నందున్మగ్నమై పోయెడిన్;
యేలా క్షేమమిడున్ మహామహిములం దేపాటి యౌద్ధత్యమున్ 19

కుచౌ తే దుగ్ధాంభోనిధికుల శిఖామండనమణే
హరేతే సౌభాగ్యం యది సురగిరేశ్చిత్ర మిహకిమ్
త్రిలోకే లావణ్యం హరణ నవలీలా నిపుణయో
ర్యయోర్ధత్తే భూయః కరమఖిలనాథో మధురిపుః

క్షీరాంభోధికులైకభూషణమణీ! శ్రీమేరుసౌభాగ్య సం
భారమ్మున్ హరియించు టబ్బురమె నీపాలిండ్లు, త్రైలోక్యశృం
గారాపూరణ పుణ్యదక్షములవో కంజాక్షహస్తార్పణో
దార స్వర్ణసువర్ణ పూరకలశల్ తథ్యమ్ము విష్ణుప్రియా! 20



# సంతాన నిరోధము

## మహాత్మా గాంధీ

సంతాన నిరోధముయొక్క యవసరమునుగూర్చి విప్రతిపత్తిలేదు. కాని దీనికి మన సనాతనమార్గము ఆత్మనిగ్రహము-అనగా బ్రహ్మచర్యము. ఇది నిర్దుష్టమైన రాజమార్గము. దీని నెవ్వ రాచరింతురో వారికిగూడ నిది మేలు చేకూర్చును జన్మనిరోధమునకు కృత్రిమపద్ధతుల వెదుకుట మాని, ఈ ఆత్మనిగ్రహమార్గము ననుసరించినచో, నట్టివారు వైద్యులమన్ననకు పాత్రులగుదురు.

కృత్రిమపద్ధతు లనుసరించుటయనగా మన వ్యసనమునకు మేలిముసుగు వేసికొనుట అందుచే స్త్రీ పురుషు లనియత వర్తనులగుదురు ఈ పద్ధతులవలన మానవునియందలి నిగ్రహశక్తి నశించును. వీని వలన గొడ్డుమోతుతనము, నరముల దౌర్బల్యము కలుగును. ఏతావతా, ఈ వైద్యము జాడ్యముకంటె బాధాకరమగును.

ఒకడు తానుచేసిన దానిఫలితము ననుభవింపకుండ తప్పించుకొన జూచుట తప్పేకాక, అవినీతికరము కూడ. అధికముగా తిన్నవానికి కడుపునొప్పి వచ్చుటయు, తరువాత నుపవసింపవలసి వచ్చుటయు మంచిది అతడు కడుపాత్రము కొలది తిని, తరువాత మందుల సహాయమున తత్ఫలమును తప్పించుకొనుట మంచిది కాదు. పాశవిక వాంఛలకు వశుడై, తానుచేసిన కృత్యముల ఫలితము ననుభవింపక తప్పించుకొనుట మరింత చెడ్డది. ప్రకృతి నియమముల నుల్లంఘించిన వానిపై ప్రకృతి పగతీర్చుకొని తీరును. నైతిక ఫల ముత్పన్నము కాగలదు తక్కిన నిరోధము లన్నియు దేనికొరకు వినియోగింపబడునో దానికే నిర్మూల మొనర్చును.

సృష్టికార్యము మీదనే ప్రపంచ స్థితి యాధార పడియున్నది. ఈ ప్రపంచము భగవంతుని క్రీడారంగము. ఇది అతని మహత్త్వమునకు ప్రతిబింబము. కనుక ప్రపంచము నియతాభివృద్ధి కొరకై సృష్టి కార్యము నియమిత మొనర్పవలసి యున్నది.

నిస్సందేహముగా మానవుడు కళామయుడు, సృష్టికర్త. నిస్సందేహముగా నతడు సౌందర్యమూర్తి. అందుచే నతని కొక రంగున్నది. ప్రతి వర్ణసంకరమున సౌందర్యము లేదనియు, ప్రతి సుఖానుభూతియు మంచిదికాదనియు వివేచించి తెలిసికొను శక్తి నతనికి, అతని యందలి యుత్తమ కళామయ సృజనాత్మక ప్రకృతియే కల్గించినది. సార్థక విషయమునందే సుఖానుభూతి పొందుట నతనికి అతని యందలి కళాదృష్టి నేర్పినది. అందుచే మానవ పరిణామమున తొలిదశయందె యూతము తినుట, అప్పటికిని మనలో కొందరివలె, తినుట కొరకు కాక, దేహధారణము కొరకని తెలిసికొనినాడు అటుపిమ్మట నాతడు తాను జీవించుటకు మాత్రమే జీవించుటలో సౌందర్యముగాని, సౌఖ్యముగాని లేదనియు, తన సోదరమానవులను వారి ద్వారా భగవంతుని సేవించుటకే తాను

జీవింపవలెననియు గ్రహించినాడు. అదే విధముగా స్త్రీపురుష సంయోగ సుఖమునుగూర్చి విచారించి, తక్కిన యన్ని యింద్రియముల వలెనే దీనికికూడ సక్రమ వినియోగమును అక్రమవినియోగమును కలవని కనుగొనినాడు. దాని ప్రయోజనమును, సరియగు వినియోగమును సంతానముకొరకేయని తెలిసికొనినాడు. అన్యథా వినియోగ మసహ్యమనుకొన్నాడు. అట్లుచేయుట ఆ వ్యక్తికే కాక, దేశమునకు సైతము హానికరమని కూడ గ్రహించినాడు.

జన్మావయవ ప్రయోజనము సంతానోత్పత్తియే యనియు తెలిసికొన్నచో, మరెందుకోసమైన సంగమమైనను ప్రాణవంతములైన శుక్లశోణితములను వ్యర్థము చేయుటయే యగుననియు, తన్మూలమున గలుగు నుద్రేక వశమున స్త్రీపురుషులశక్తిని వ్యర్థ మొనర్చుటయే యగుననియు తెలిసికొన వచ్చును.

సంగమము సుఖానుభూతి కొరకు కాదు, సంతానము కొరకు. కనుక సంతాన వాంఛ లేనప్పుడు సంగమించుట నేరము.

తమ కక్కరలేని సంతానమును కనుట పాపము. తానుచేసిన దాని ఫలితమును తప్పించుకొనుట అంతకంటె పాపము అది కేవలము అమానుషము.

పాశవికోద్రేకమున తగులుకొనుట తవసరమనియు, అది నిరపాయమని పాపరహితమని విశ్వసింప సాగినచో, మనము దానికి వశవర్తులమై దానిని ప్రతిఘటింప నశక్తులము కావలెను. అట్లు కాక, అది అపాయకరమని పాపభూయిష్టమని అనగత్యమని, దానిని నిగ్రహింపవచ్చునని తెలిసికొన్నచో, ఆత్మనిగ్రహము పూర్తిగా సాధ్యమని మనము గ్రహింపగలము.

మనుష్యునకును పశువునకును సమానముగా నిర్ణీతమైన సంతానోత్పత్తికితప్ప మరెందు కొరకుగాని సంగమింపరాదనియు, అందుకై నప్పుడుగాక రాత్రులందేక శయ్యాగృహముల పరిత్యజింపవలయుననియు భార్యాభర్తలు ఒక దృఢనిశ్చయము చేసికొన వచ్చును. జంతువు తన ఋతు ధర్మమును పాటించియే తీరును. కాని మానవుడు తనకున్న యవకాశమును పూర్తిగా దుర్వినియోగమొనర్చుకొన్నాడు. సంయోగ సుఖమును త్యజించినందువల్ల, అట్టి త్యాగము శారీరకమే గాక మానసికము గూడనైనప్పుడు, అనారోగ్యము కలుగదనియు, బల వీర్యములు పెంపొందుననియు స్త్రీ పురుషు లిర్వురును తెలిసికొనవలెను.

మానవుడీ రెండు మార్గములలో పైకో. క్రిందకో ఒక్కటి. కోరికొనవలెను. కాని తన యందలి పాశవిక ప్రవృత్తి కారణముగా సౌందర్య విలసితమైనప్పు డాతడధో మార్గమునే సులభముగా ననుసరించును,

మనమున్న ఈ చిన్నిగోళము నిన్నటి బొంగరము కాదు. అది కోటానుకోట్ల యేండ్లుగా నున్నను, ఇంత కాలములో నొక్కప్పుడుగాని పెరిగి పెరిగి జనులు బరువైనారని బాధపడి యెరుగదు. అట్టిచో మందులు మాకులువాడి నేటి జనముల సంఖ్య నరికట్టని యెడల తిండి

లేక ఈ భూమండలము నశించునని ఇప్పుడు కొందరకు హఠాత్తుగా జ్ఞానోదయమగుట యెట్లు సాధ్యము ?

స్త్రీ పురుష వాంఛ ఉత్తమ ధర్మమనియు, న్యాయముగా తీసికొన్న ఋణమును తీర్చుట యెట్టిదో అదియు నట్టిదేననియు, దానిని తీర్చుకొననిచో బుద్ధి జాడ్యము కలుగుననియు చెవినిల్లు కట్టుకొని చెప్పుచున్నారు. ఇక్కడ ఈ స్త్రీ పురుష వాంఛకు సంతానమునకు సంబంధము లేదు. గర్భధారణ మొక హఠాద్ఘటన మనియు, భార్యాభర్తలకు సంతానమక్కర లేనప్పుడు దానిని అరికట్టవలెనని ఈ కృత్రిమ సంతాన నిరోధక వాదులను చున్నారు. ఈ ప్రచారము మిక్కిలి ప్రమాదకరమని నా అభిప్రాయము.

శాస్త్రము పేరిట ఈ సంతాన నిరోధకౌషధములను ప్రవేశ పెట్టుటయును, దీనిని సంఘమందలి పెద్దలు అందముగా ననుసరించుటయు - రెండును గూడి ఈ సమస్యను క్లిష్టతర మొనర్చినవి. సంఘ జీవనము నందలి పవిత్రత కొరకై కృషి చేయు వారి కార్యభారమును దాదాపు దుస్సహ మొనర్చినవి.

సంయోగ వాంఛ మంచిదే. ఉత్తమమైనదే. అందులో సిగ్గిల వలసినదేమియు లేదు. కాని అది సంతానము కొరకే యుద్దేశింపబడినది. దానిని అన్యథా వినియోగ మొనర్చుట భగవంతునకును మానవత్వమునకును అపచార మొనర్చుటే యగును.

నేను అనుమతించు లైంగిక విజ్ఞానమునకు ఆ యుద్రేకమును లోబరచుకొనుటయును దానియందు దివ్యత్వ మొన గూర్చుటయు లక్ష్యములు. కనుక ఆ విజ్ఞానము మానవునకు పశువునకు గల వ్యత్యాసమును బాలుర కెరుగ జెప్పవలెను. మనస్సునకు హృదయమునకు సంబంధించిన అద్భుత శక్తులను కలిగి యుండుట మానవునకు కలిగిన అవకాశమనియు అదృష్టమనియు మానవుడు హృదయానుభూతి పొందు జంతువేకాక ఆలోచించు జంతువనియు బాలురచే గుర్తింపజేయ వలెను. ఇంద్రియోద్రేకములకంటె హేతు బుద్ధి ఉత్తమమని గ్రహించుటయే మానవుని యొక్క నిజస్థితి తెలుసుకొనుట కాగలదు.

# అల్లసాని వాని అల్లిక జిగిబిగి

## కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

### ౪

ప్రౌఢులైన కవులు పలు రహస్యములను కథ చెప్పుచు నిమిడింతురు. అట్టి రహస్యములను కథ చదువుచు పాఠకుఁడనుసరించినచో విస్పష్టత ఎక్కువ కలుగును. ఆ రీతిగా సిద్ధుఁడు పసరు ప్రవరుని కాళ్ళకు రాచెను. ఆ సమయ మెట్టిది? అన్న విషయము క్రమముగా తెలియవలయును.

ఆ మందిడి యతఁ డరిగిన
భూమీసురుఁ డరిగెఁ దుహినభూధర శృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షాపేక్షన్

ఈ పద్యమువలన ప్రవరుఁడు వెళ్ళినాడని మాత్రమే తెలియుచున్నది సిద్ధుఁడు పసరును పూసినపుడు, ఇది ఏమి పసరు ? ఎన్నాళ్లుండును ! మొదలైన వేవియు ప్రవరుఁ డడుగలేదు. ఇట్లడుగకుందురా? యని ప్రశ్న. 'అడుగ' రనునది సమాధానము. తీర్థయాత్రా కౌతుక వ్యగ్రత యొక్క లక్షణ మిది. ఎక్కడికి పోవలయును? మొదలైన ప్రశ్న ఎవనికుండునో, పలుచోట్ల తిరుగవలయునన్న యూహ ఎవనికుండునో, వానికా ప్రశ్న యుదయించును. ప్రవరుని తీర్థయాత్రా కౌతుకత ఒక్కడేఁ ఒక్కఁడు ప్రదేశమును గుఱించి కలదు. అక్కడికి పోవలయుననియే యుద్దేశ్యము. వెళ్ళి ఆ ప్రదేశమును చూచి వచ్చినచో తన సర్వమైన కోర్కెయు తీరినది. మఱియొక చోటికి పోవలయుననియే లేదు. ఆయొక్క ప్రదేశమునకే పోవలయును. ఆప్రదేశమునకు వెళ్ళి వచ్చుటకు ఈ పూత చాలునని ప్రవరుని యభిప్రాయము. ఆ ప్రదేశమేది? బదరీవనము.

కాలికి పసరు పూసినంతనే ప్రవరుని యూహ బదరీవనము పోవుదమనియే. ఇతఁడెప్పుడు బయలుదేఱి నాడనునది తరువాతి ప్రశ్న. తొలుత బదరీవనము హిమవత్పర్వతములో నున్నది. అచ్చటికి పోవలయుననియే ప్రవరుఁడు సంకల్పించినాడు. ఆ సంకల్పము ప్రకారము బదరీవనముఁనకే వెళ్ళినాడు. ఇది యంతయు కథనుబట్టి తెలిసికొనవలసిన విషయమే.

వెళ్ళినాడు. ఈ పద్యము ప్రథమాశ్వాసము చివరిపద్యము. వెళ్లినాడన్న విషయము మాత్రమే చెప్పును. కాని ఈ పద్యరచనలో నొక చమత్కారమున్నది. సరిగా హిమవత్పర్వతము మీఁదికి వెళ్ళిన స్థితి ఈ పద్యములో నున్నది. రెండవ చరణము చివర 'శృంగ' అన్న శబ్దము కలదు. చివరి హ్రస్వాక్షరము ఆకాశములో ఎంతఎత్తు వెళ్ళవలయునో అంత యెత్తు వెళ్లెను. అక్కడ నాగిపోవలయును. అచ్చటినుండి క్రిందికి దిగవలయును. అన్న యర్థ మీ హ్రస్వాక్షరములోఁ గలదు. అచ్చటినుండి క్రిందికి చూచినాడు. ఏమి కనిపించినది శ్యామల కోమల కాననములు కన్పించినవి. ఈ మూఁడును భగణములు. ప్రథమాక్షరములు దీర్ఘములు. తక్కిన రెండక్షరములు హ్రస్వములు. 'శృంగ'లో నున్న చివరి యక్షరము తరువాతి సంయుక్తాక్షరము చేత గురువైనది. ఈమూఁడు భగణముల లోని ప్రథమాక్షరములు మూఁడును

సహజముగానే గురువులు. ఎందు కిట్లు వ్రాసెను? ఆ పైనుండి ప్రవరుఁడు హిమవత్పర్వతమును జూచెను. ఆ పర్వతము శృంగములు నడుమ సానువులు- వీనిచేత ఎగుడు దిగుడులుగా నుండెను. ఆఎగుడు దిగుళ్ళలో ఒక విలక్షణత కలదు. దీర్ఘాక్షరములవలె కొమ్ములు పొడుచుకొని వచ్చినవి. హ్రస్వాక్షరముల మేర బల్లపఱుపుగా నున్నది. ఆ ప్రదేశము యొక్క స్వరూపము ఈ మార్పుచేత వ్యజ్యమాన మగుచున్నది.

అక్కడనుండి దిగ వలయును. 'హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షా పేక్షన్' ఈ మూఁడు 'రీ' కారములు ప్రవరుఁడు క్రిందికి దిగెడి లక్షణమును చెప్పుచున్నవి. అతఁడు మూఁడంచెలుగా దిగినట్లున్నది.

ఇచ్చట కొందఱు ఈ 'రీ' లు క్రిందికి దిగుట నేల చెప్పును? పై కెక్కుట నేల చెప్పకూడదని యందురు. ద్వితీయాశ్వాసము మొదటి పద్యము—

'అటఁ జనికాంచె...'

నని యున్నది. దిగక పోయినచో చూచుటలేదు కనుక ఈ 'రీ' లు దిగుటకే వ్యంజకములు. వ్యంగ్యము దాక నెందులకు? అర్థము కూడ సందర్భమునుబట్టియే. వ్యంగ్యము సందర్భమును బట్టియేకల్గును. ఏది ప్రస్తుతమో అదే వ్యంగ్యము కాగలదు.

అటఁజనికాంచె భూమిసురుఁ
డంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ ద
భంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనాను రూప పరి
ఫుల్ల కలాప కలాపి జాలమున్,
గటక చరత్కరేణు కర
కంపిత సాలము, శీత శైలమున్.

అతఁడు హిమవత్పర్వతమును జూచెను. ఆ హిమవత్పర్వతమును కవి రెండు సమాసములతో చెప్పెను. ఆకాశమునంటుచున్న పై భాగమునందు ప్రవహించుచున్న సెలయేళ్ళయొక్క ఎగురుచున్న తరంగముల మద్దెళ్ళ మ్రోతలకు తగినట్లు పింఛములు విప్పిన నెమళ్ళు కలది, కటకములయందు తిరుగుచున్న ఆడుఏనుగులచేత కదల్పఁబడిన వృక్షములు కలది. ఇవి రెండే సమాసములు ప్రవరుఁడు పర్వతము మీఁద నొకచోట దిగినాఁడనుకొందము. దిగినచో, దిగిన వానికెంత దూరము కన్పించును? ఆ దూరములో సెలయేళ్ళు ప్రవహించుట, వానికి నెమళ్ళు నృత్యము చేయుట కనుపించునా? చెట్లను కదల్చుచున్న ఆడుఏన్గులు కనిపించునా? కనిపించినచో నతనికి భయమువేయదా? అందుచేత ఈచూచిన చూపు పర్వతముమీద దిగకుండ చూచిన చూపు. కొంతఎత్తు నుంచి చూచిన చూపు. ఆ చూపునకే ఒక చదరపుమైలు ప్రదేశములో జరుగుచున్న విషయము కనిపించును. అదియంతయు నొకసారి కనుపించును. అతఁడటు నిటు చూచెను. ఒకవైపున నది కన్పించినది. రెండవ వైపుననిదికన్పించినది. ఒక్కదృష్టి ప్రసారమునకు కనిపించినది సమాసములో పెట్టి చెప్పినాడు. ఈసమాసములు వ్యర్థమైనవి కావు. ఇంత అర్థవంతములైనవి.

అటునిటు - అనుట యెందుకు? సెలయేళ్ళు మద్దెళ్లు మ్రోసినట్లు ప్రవహించు స్థలములు వేరు. కొండలపై ఎత్తిపోతలుగా పడుచున్నప్పుడుగాని అంత సవ్వడి కలుగదు. అందుచేత ఒక వైపున కనిపించిన ప్రదేశము కొండలు రాళ్లు గుట్టలు-

సెలయేళ్ళ మ్రోత. రెండవవైపున కనిపించిన ప్రదేశము కొండసానువులు. అడవిజంతువులు-అ కలములు మేయుచు తిరిగెడి ప్రదేశము. అవైపువేలు, ఈవైపువేలు.

"కాంచి యంత రంగంబునఁదరంగితం బగు హర్షోత్కర్షంబున" చూచినంతనే అతని హృదయమున మహానందముకలిగినది. ఎందునకు కలిగినది? అట్టి దృశ్యములు చూచినందువలన కలిగినదా? దిగినాడు. ఎచ్చట దిగెనో, అచ్చటనే దిగినందుకు కలిగినదా? ఎచ్చట దిగినాడు? బదరీవనమునందు దిగినాడు. అది బదరీవనమని తనకుఁ దెలియునా?

నరనారాయణ చరణాం
బురుహద్వయ భద్రచిహ్నముద్రిత బదరీ
తరుషండ మండలాంతర
వరణిన్ ధరణీసురుండు వనఁ జన నెదుటన్.

అతఁడిదివఱకీ బదరీవనమును జూడలేదు. చూడకపోయినను రేగుచెట్లెక్కువగా నున్నవి గనుక బదరీవన మనుకొన్నాడను కొందము. నర నారాయణుల కాలి గుర్తు లక్కడ నున్నవి. ఉన్నవా? ఇతఁడు మనస్సులో ననుకొనుచున్నాడా?

అంత నతనిమీద చల్లని గాలులు వీచినవి. అడవిలో ఏనుగులు చెట్లచివుళ్ళు లాగుచున్నవి. పెద్దపులుల గుఱ్ఱులు వినిపించుచున్నవి. అడవి పందులు ముస్తైలెత్తుచున్నవి. మనుబిళ్లు దూకుచున్నవి. మొదలైనవి చూచినాడు. అ ప్రదేశములకు తాను పోలేదు. దూరమునుండిచూచిన విషయములివి. పర్వతమునకు వచ్చుట జరిగినది. బదరీ వనమును జూచినాడు. అక్కడ నేమి చూడవలయును? 'తరుగహన గుహా విహార తత్పర మతియై, ఏమేమిచూచినాడు? భగీరథుఁడు తపము చేసినచోటు, గంగ నేలకు దిగినచోటు, పార్వతి శివునకై తపముచేసిన చోటు, మన్మథుని శివుఁడు కంటిమంట నార్చిన చోటు' కుమారస్వామి జల్లులో పుట్టిన చోటు - వీని నన్నింటిని సంతోషముతోఁ జూచినాడు. ఈ పద్యముతో పది ప్రశ్నలకు సమాధానము వచ్చినది. అతఁడు బదరీ వనమున కేటికి వచ్చెను? ఇవి యన్నియుఁ జూచుటకు వచ్చెను. ఇవి ఇవియని యతని కెట్లు తెలియును? ఇది గడ్డుప్రశ్న. కవి పిచ్చిగా వ్రాసినాడా? మహాశిల్పియైన కవి భావములు తెలిసికొనుట కిట్టిదియే నికషోపలము.

ప్రవరుఁడు తీర్థయాత్రకు పోవలయునని ఎన్ని యేండ్లనుండి యూహించుచుండెనో? ఎంతమంది యాత్రికుల నడిగెనో? మన మూహించుకొనవలసినదే కదా? అతని ప్రధానమైన కౌతుకము బదరీవన దర్శనము ఇక్కడికే వచ్చినాడు. ఇంకొక ప్రదేశ మతని యూహలో లేనే లేదు ఈప్రదేశమును గుఱించి ఎంతమందివలన వినెనో వారినడిగి ఏ ప్రదేశమెక్కడున్నది? దేనికేది ఎంత దూరనము నున్నది? ఆ ప్రదేశమును గుర్తుపెట్టుట యెట్లు? - ఇట్టి వందప్రశ్నములు అతఁడు యాత్రికులకు వేసి, సమాధానములు పడసియుండి యుండును హిమవత్పర్వతముమీఁది ఈ సర్వప్రదేశములు ప్రవరుఁడు పూర్వము చూడకపోయినను, అతని కంటికి పటముకట్టి నట్లున్నవి. ఈ పద్యములోని యర్థమిది.

ఈ కథాభాగమంతయు ప్రవరుని యూహాతుణామంతయు వెనుకదాచి పెద్దన్న

గారీ పద్యమును వ్రాసినారు. అతని నిక్కడ దింపినారు. ఇవి యన్నియుఁ జూచిన తర్వాతగాని యతనిమనస్సునకు శాంతి కలుగలేదు. అన్నిటిని జూచిన తరువాత అప్పుడు హిమవత్పర్వతమును గుఱించి యూహింప నారంభించినాడు. రెండు పద్యములు ఆవర్ణన సాగినవి. పురాణకథలు స్మృతిఁకి దెచ్చికొన్నాడు. ప్రధానమైన యుత్కంఠతీఱినది. మానవ సామాన్యమైన యుత్కంఠ నదులు వన ములు పర్వతములు చూడవలయునన్నది. దానికి తొందరలేదు. రేపు వచ్చి చూత మనుకొన్నాడు. ఇంతలోనతనిపాదముల యందు రాచిన పసరు కరగిపోయినది.

ఇప్పుడొక ప్రశ్న పుట్టుచున్నది. అప్పుడు మధ్యాహ్నమైనది. సిద్ధుఁడతని కాళ్ళకు పాదలేపము రాచిన దెప్పుడు? ఇతఁడు బయలుదేఱిన దెప్పుడు? ఇతఁడు పర్వతము మీఁది బహు ప్రదేశములఁ జూచెను. చూచుటకు చాలసేపు పట్టును. అతఁడు నిన్నటి రాత్రియే ఇచ్చటికివచ్చె ననుటకు వీలులేదుగదా? కనుక మరు నాటి ప్రొద్దుననేవచ్చెను. ఇతఁడుప్రొద్దుట బయలుదేరినపుడు సిద్ధుఁడుపాదలేపమును పూయుట సంభవించదు. నిన్న జరిగిన ప్రసంగమునుబట్టి సిద్ధుఁడు వెంటనే పాద లేపమునురాచితనదారినితానుపోయెను. నాదగ్గఱ నొక పాదలేపమున్నది. నీ కాళ్ళకిది రేపు ప్రొద్దున రాచెదను. నీ యిష్టము వచ్చినచోటికి నీవు పోవచ్చును. మొదలైన ప్రసంగము సిద్ధుఁడు చేసి నచో, ఆరాత్రి అతఁడక్కడే యున్నచో, పాదలేపమునుగూర్చిన సర్వప్రస్తావనయు జరిగియే యుండును. ప్రవరుఁడు కొండ మీఁద పడిన,యీ ఇబ్బంది జరుగనే జరు గదు. ఆ సిద్ధుఁడు ఈపని కోపముతో చేసినాడు. ఇతని కిట్టి పరాభవము చేయ వలయుననియే చేసినాడు. అనఁగా సిద్ధుఁడు వచ్చిన రోజుననే, ప్రసంగము జరిగినప్పుడే, అది యే ప్రొద్దు క్రుంకెడు వేళకో, ఇతని పాదములకు ఆ పసరు రాచి వాని దారిని వాఁడు వెళ్లినాడు.

ఈ ప్రవరుఁ డగ్నిహోత్రి. ఇతఁడా రాత్రి అగ్నిహోత్ర కార్యములు చేసి నాడా? ప్రొద్దున హిమవత్పర్వతమునకు బయలుదేఱకముందు స్నానాదికములు చేసినాడా? ఈ రెండు స్నాన ప్రక్రియ లతో నతని పాదలేపము పూర్వమే కరగి పోయి యుండవలయును. 'నీ హోరవారిఁ బెరసి' కరగి పోవు పాదలేప మది.

అతఁడు జాగ్రత్తగా స్నానము చేసెను.వ్యాధిగ్రస్తులైన వాండ్రు, లేదా కాలిమీఁద నొక కురుపు లేచినవాండ్రు పట్టీ వేసికొని, ఆ పట్టీ తడియకుండ స్నానము చేసినట్లు, కాళ్ళు కడిగి కొన్నట్లు, చేసియుండును _ అనుకొనవల యును. కాని ఇక్కడ పర్వతమంతయుఁ దిరిగినాడు. చిక్కనిగడ్డి మొలచిన చోటులు ఆ మంచునకు తెల్లవారులు చెడిపోకుండ నున్న పాదలేపము నిస్సం దేహముగ చెడిపోవును. కరిగిపోవును. మంచు కాలముల గడ్డిపొలములలో తిరి గెడివారికి గాని దీనిమర్మము తెలియదు. ప్రవరునకు సిద్ధుఁడు నిన్నటిసాయంతనమే పాదలేపమును పూసెను. దాని నితఁడు మరునాటి ప్రొద్దుటి వరకు రక్షించు కొనెను—అనియే చెప్పవలయును.

ఈ కథలో ఇన్ని మెలికలు పెట్టి, చేయుటయే పెద్దన్నగారి శిల్పములోని రహస్యము. ఇవి యన్నియు కలిపి పదు

వాల్గు పద్యములు. పాదలేపము కరగి పోయినంతనే అతఁడు దుఃఖపడినాడు. ఈ దుఃఖములో చివరకు "నేను వట్టి తెలివితక్కువ వాఁడను. ఏనుగులు పెద్ద పులులు మొదలైన క్రూర జంతువులు కల ఈ కొండకు వచ్చుట యేమిటి? శ్రోత్రియులు బుద్ధి జాడ్య జనితోన్మాదులుకదా!" అనుకొనినాడు. ఈమాటను బట్టి కొందరు విమర్శకులు ప్రవరుఁడు శ్రోత్రియుఁడు గనుక అతనికి బుద్ధిజాడ్య మున్నదనిరి, ఛాందసుఁడనిరి. అను కొనుట కలదు. అట్లువ్రాసినవారుకలరు. తాను చేసిన పని దుష్ఫలితము నిచ్చి నప్పుడు లోకమునందు మానవులు తమ్ము తాము నిందించుకొనుట కలదు. పరమ వివేకులుకూడ తమ్మిట్లునిందించుకొనుట యుండును. దానినిబట్టి వాఁడవివేకి యనుట అవివేకము. ప్రవరుఁడు అవివేకి కాఁడు. గొప్ప లౌకికుఁడు. చాలగడుసు వాఁడు. లోకజ్ఞుఁడు. భోగి. అతఁడెంత భోగి యనఁగా

పూవుందీవలలో నొక భవనమును జూచి, దానిదగ్గఱకు వెడలునప్పుడు—

మృగ మద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ
స్థగి తేతర పరిమళమై
మగువ పొలుపు దెలుపు నొక్క-మారుత
మొలసెన్.

కస్తూరి వాసనచేత రెట్టింపైన పచ్చ కర్పూరము కలిపిన తాంబూలపు వాసనతో కూడిన గాలిరాగా, అచ్చట స్త్రీలు న్నారని యతఁడు తెలిసికొనెను. అతని భోగలక్షణ మిది. ఆ తాంబూల మెట్టి దియో, అందులో యౌవన వతులైన స్త్రీలెట్టి పాళములో కస్తూరి ఘనసార ములనుకలిపి తాంబూలము సేవింతురో, ఆగాలి పరిమళ మెట్టిదో—ఇంత తెలిసిన వాఁడు ప్రవరుఁడు. వాని యనుభవ విశేష మిట్టిది.

కస్తూరి వాసనకంటె, పచ్చకప్పురపు వాసన రెండింతలుగా నున్నదఁట. ఈ రహస్య మనుభవైక వేద్యము. ఈ పద్య ములను బట్టి ప్రవరుని యనుభవ విశే షము, అతని యూహాలు, అతనికి తెలిసిన విషయములు, అతనికోరికలు- అన్నియు వ్యంగ్యభూతములై యున్నవి. ఇన్ని విష యములు వెనుక దాచి, యూరకే కథ చెప్పుకొని పోవుచున్నట్లు కనిపించుట ఎంతటి గడుసుదనము గల కథా కథన శిల్పమో భావుకులకే తెలియవలయును. ఇట్టి రచన నన్నయ్యగారే చేయుదురు. పెద్దన్నయే చేయును.

ప్రవరునిగుఱించి, వరూధినినిగుఱించి రెండు విడి వ్యాసములు వ్రాసినఁ గాని పెద్దన్నగారి శిల్పపారమ్యములోని తుది సోపానముకంటె క్రింది యున్నతసోపా నముయొక్క స్వరూపము తెలియదు. తుదిసోపాన మతని కథా కథనశిల్పము.

# ఆయుర్వేదము - ఆహారము

శ్రీ ప్రకాశ చంద్ర శతపథి

౨

లవణరస గుణములు: లవణరసము భుజింపబడిన ఆహారమును పచింపజేయును. ఆహారమును మృదువుగ జేయును. జఠరాగ్నిని జ్వలింపజేసి ఆకలిని పుట్టించును. మలమును వెడలించును. శ్లేష్మమును ఛేదించును. గట్టిగనుండు మలమును భేదించును. తీక్ష్ణముగనుండును. శరీరమున సూక్ష్మావకాశముల యందును వ్యాపించును. వ్యాపించు గుణముగలది. మలాదులఅధోమార్గమున స్రవింపజేయును. కడుపు నిండుగా నున్నపుడు అపక్వపదార్థములతొలగించి యెడము కల్గించును. వాతమును హరించును. స్తంభించినయవయవముల సడలించును. సంధిబంధములు పట్టియున్న దానిని విడదీయును. ఘనీభవించిన కఫాదులను కరగించును. ఈ లవణరసము ప్రమాణముకన్న అధికమయిన తక్కిన మధురాది రసములకు విరుద్ధమై వాటి రుచిని చెరచును. నోట నీరును స్రవింపజేయును. గట్టిగ నుండు కఫమును ద్రవింపజేసి స్రవింపజేయును. స్రోతో మార్గములను శుభ్రపరచును. శరీరావయవము లన్నిటిని మెత్తబరచును. ఆహారమునకు రుచినిచ్చును. కొంచెము గురుత్వము కలిగియుండును. స్నిగ్ధ-ఉష్ణ గుణములు కల్గియుండును.

ఇన్ని గుణముల నిచ్చునదైననూ, దాని నొక్క-దానినే అధికముగా నుపయోగించిన పిత్తమును ప్రకోపింపజేయును రక్తమును. అధికముగ వృద్ధి నొందించును. అధికముగ దప్పిని కల్గించును. చిత్తభ్రమము కల్గించును. మూర్ఛ నొందించును. తాపమును బుట్టించును. చర్మమును పగులదీయును. మాంసమును కరగించును. కుష్టముల నుండి నీరును స్రవింపజేయును. శరీరమున విషమున్నపుడు దానిని వృద్ధి నొందించును. వాపులను పగులదీయును. దంతములను నలుపుచేయును. పురుషత్వమును చంపును. చక్షు రాదింద్రియ వ్యాపారముల నిరోధించును. బట్టతల, వెంట్రుకలు నెరయుట కల్గించును. శరీరమున ముడతలను కలుగజేయును. రక్తపిత్తము, అమ్లపిత్తము, విసర్పము, వాతరక్తము, విచర్చిక, ఇంద్రలుప్తము మున్నగువ్యాధుల కలుగజేయును.

కటు రస గుణములు: కారము నోటి మలినమును పారద్రోలును. నోటిని శుభ్రపర్చును, జఠరాగ్నికి దీప్తినిచ్చి ఆకలి బుట్టించును. భుజింపబడిన ఆహారము నందలి ద్రవమును పీల్చి యెండగొట్టును. నాసారంధ్రములనుండి ద్రవమును స్రవింపజేయును. కన్నులనుండి నీరు మున్నగు మలముల వెడలించును చక్షురాదీంద్రియముల స్ఫుటముగ జేయును. అలసకము (అధికముగా విరేచనములగు నొక వ్యాధి) వాపు, ఒడలి బలుపు, దద్దులు అభిష్యందము (కండ్ల కలక), శరీరము నందలి జిడ్డు, చెమట, ద్రవము, మలములను పోగొట్టును. అన్నమునకు రుచిని కలుగజేయును. దురదను బాపును. వ్రణ

ముల మాన్పును. ఆన్తర బాహ్య క్రిముల హతమార్చును. గడ్డ కట్టిన రక్తమును భేదించును. అవయవముల పట్టులను విడదీయును. స్రోతోమార్గముల నడ్డులేకుండ జేయును. కఫమును శమింప జేయును. లఘుత్వము, ఉష్ణము, రూక్షత్వము, అను గుణములను కల్గించును.

ఈ కారపు రుచిని అధికముగ సేవించిన పురుషత్వము నశించును. రస, వీర్యముల ప్రభావములచే చిత్తభ్రమమును కల్గించును. మనస్సంతోషమును హరించును శరీరమును కృశింపజేయును. మూర్ఛను కలుగ జేయును. శరీరమును వంగునటుల జేయును. చీకటిలోనున్న రీతిన కండ్ల మసకల గ్రమ్మ జేయును. చక్రముపై నున్న వానివలె ఒడలు తిరుగునట్లు జేయును. కుత్తుకలో మంటబుట్టించును. శరీరమునమంటను, వేడినిపుట్టించును. శరీర బలమును నశింపజేయును. దప్పిని కలిగించును.

కటురసము వాయ్వగ్ని బాహుళ్యముచే కల్గినది గనుక పాదములు, భుజములు ఇరుప్రక్కలు, వీపు, మున్నగు శరీరావయవములందు భ్రమము, కంపము, పోటు, పగులదీయు విధముగ బాధ, ఇట్టి యుపద్రవములతో గూడిన వాత రోగములను గల్గించును.

తిక్తరస గుణములు : చేదు రసము తినుటకు రుచికరముగ నుండదు. అయినప్పటికీ అరోచకమును హరించును. విష, క్రిముల హరించును. మూర్ఛ, తాపము, దురద, కుష్ఠు, దప్పి వీటిని శమింపజేయును. చర్మమును, మాంసమును దృఢపరచును, జ్వరమును హరించును. అగ్నిని దీపింప జేసి ఆహారమును జీర్ణింపజేయును. స్తన్యమును శుభ్రపరచును. దోషముల (మలాదులను) వెడలించును. ద్రవము, మేధస్సు, వస (మాంస స్నేహము). మజ్జ (మూలుగ) చీము, చెమట, మూత్రము, పురీషము, పైత్యము, శ్లేష్మము వీటిని శోషింప జేయును. రూక్ష, శీత, లఘు గుణములు కల్గియుండును.

ఈ తిక్తరసము నధికముగా సేవించిన రస, రక్త, మాంస, మేద, అస్థి, మజ్జ, శుక్ర ధాతువులను యెండ గొట్టును. స్రోతోమార్గముల ద్రవము నెండించి కరకు దనముదు కల్గించును. శరీరబలమును నశింపజేసి, కృశింపజేయును. హర్షమును నశింపజేయును. ఒడలుతిరుగునటుల జేయును. నోట ద్రవము నెండించును వాతరోగముల కల్గించును.

కషాయ రస గుణములు: వగరురుచి దోషముల శమింపజేయును విరేచనాదులను నిరోధించును. మలాదుల వెడలనీయకబంధించును. వ్రణముల బిగదీయును. వ్రణములను మాన్పును ఆమమును స్తంభింపజేయును శ్లేష్మమును, రక్తమును, పైత్యమును శమింపజేయును. శరీరమందలి ద్రవమును పీల్చును. రూక్ష, శీత, గురు, గుణములు కల్గియుండును. ఈ వగరును అధికముగా వాడిన నోటిని యెండించును. హృదయమున పట్టినట్లు బాధ కల్గించును. కడుపు నుబ్బరించును. వాక్కును బంధించి మాటవెడలనీయక పట్టుబట్టును. స్రోతో రంధ్రములబంధించును. శరీరముపై శ్యామలవర్ణముకల్గించును. వీర్యమును నశింపజేయును. మల

మును బంధించి కడుపులోనుక్కిరిబిక్కిరి జేయును. వాతమును, మూత్రమును పురీషమును, శుక్రమును వెడలనీయక బంధించును. శరీరమును కృశింప జేయును. సంతోషములేకుండ జేయును. దప్పిని కల్గించును. అవయవాదులను స్తంభింపజేయును. ఖర విశద రూక్ష గుణములు కల్గియుండుట వలన వాతమును ప్రకోపింపజేసి పక్షవధము, పార్శ్వగ్రహము, అపతానకము, అర్థితము మున్నగు వాతరోగములు కల్గించును.

ఈ మద్రసములను తగినపరిమాణము ననుసరించి వేరువేరుగ నైన, ఒకటిగా రెండేసి మూడేసి రసముల నొకటిగ జేర్చి తగిన పరిమాణము గల్పించి నుపయోగించిన ప్రాణికోటి కుపకారము కల్గించును. పరిమితి లేక, మితిమీరి యుపయోగించిన రోగరూపకమైన యపకారము కల్గును. నేడు వ్యాప్తిలోనున్న అనేక వ్యాధులకు యీమద్రసముల అతిగా ఉపయోగించడం ఒక కారణమై యున్నది. వీటిని సమ ప్రమాణముగా ఆహారముతో చేర్చి సేవించినందున ఆరోగ్య బలవర్గములు సంప్రాప్తించును.

# సంస్కృత బాలశిక్ష

శ్రీ గరికిపాటి సత్యనారాయణ, ఎం. ఏ.

౪

ఈ క్రింది నకారాన్తమగు 'రాజన్' అనెడి పుంలింగ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి మహిమన్, గరిమన్, లఘిమన్ అను శబ్దముల యాయా విభక్తి - వచన రూపములను సమన్వయించుకొనునది. రాజన్ శబ్దమునకు రాజని యర్థము.

రాజా - రాజానౌ - రాజానః
హే రాజన్ - హే రాజానౌ - హే రాజానః
రాజానమ్ - రాజానౌ - రాజ్ఞః
రాజ్ఞా - రాజభ్యామ్ - రాజభిః
రాజ్ఞే - రాజభ్యామ్ - రాజభ్యః
రాజ్ఞః - రాజభ్యామ్ - రాజభ్యః
రాజ్ఞః - రాజ్ఞోః - రాజ్ఞామ్
రాజ్ఞి } - రాజ్ఞోః - రాజసు
రాజని }

పైరాజన్ శబ్దమునకు సప్తమీ విభక్తియందు రాజ్ఞి, రాజని యను రెండు ఏక వచన రూపములు గలవు. ఈ క్రింది నకారాన్తమగు 'నామన్' అనెడి నపుంసక లింగ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి దామన్, సురాజన్ శబ్దముల యాయా విభక్తి - వచన రూపములను సమన్వయించుకొనునది. నామన్ శబ్దమునకు పేరని యర్థము.

నామ - నామ్నీ } - నామాని
       నామనీ }
హే నామన్ } హే నామ్నీ } హే నామాని
హే నామ } హే నామనీ }
నామ - నామ్నీ } - నామాని
       నామనీ }

మిగిలిన శబ్దమంతయు రాజన్ శబ్దమును బట్టి సమన్వయము చేసికొనవలయును.

పై నామన్ శబ్దమునకు ప్రథమా విభక్తి - ద్వి వచనమున నామ్నీ, నామనీ అని రెండురూపములును, సంబోధన ప్రథమా విభక్తికి సంబంధించిన యేక వచన, ద్వివచనములలో క్రమముగా హే నామన్, హే నామ, హే నామ్నీ, హే నామనీయను రెండేసిరూపములను, అట్లే ద్వితీయా విభక్తికి సంబంధించిన ద్వి వచనమున ప్రథమా విభక్తికి వలెనే నామ్నీ, నామనీ యను రెండు రూపములును గలవు.

ఈ క్రింది నకారాన్తమగు 'ఆత్మన్' అనెడి పుంలింగ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి, పాప్మన్, యజ్వన్, సహాకృత్వన్, అనెడి శబ్దముల యాయా విభక్తి వచన రూపములను సమన్వయించుకొనునది. ఆత్మన్ శబ్దమునకు తానని యర్థము.

ఆత్మా - ఆత్మానౌ - ఆత్మానః
హే ఆత్మన్ - హే ఆత్మానౌ - హే ఆత్మానః
ఆత్మానమ్ - ఆత్మానౌ - ఆత్మనః
ఆత్మనా - ఆత్మభ్యామ్ - ఆత్మభిః
ఆత్మనే - ఆత్మభ్యామ్ - ఆత్మభ్యః
ఆత్మనః - ఆత్మభ్యామ్ - ఆత్మభ్యః
ఆత్మనః - ఆత్మనోః - ఆత్మనామ్
ఆత్మని - ఆత్మనోః - ఆత్మసు

ఈ క్రింది నకారాన్తమగు 'వర్త్మన్' అనెడి నపుంసక లింగ శబ్దమును పరిశీలించి దానిని బట్టి సహాకృత్వన్ అనెడి శబ్దమునాయా విభక్తి - వచన రూపములలో సమన్వయించుకొనునది.

వర్త్మ - వర్త్మనీ - వర్త్మాని
హే వర్త్మన్ } - హే వర్త్మనీ - హే వర్త్మాని
హే వర్త్మ }

వర్త్మ - వర్త్మనీ - వర్త్మాని

మిగిలిన శబ్ద మంతయు 'ఆత్మన్' శబ్దమును బట్టి సమన్వయము చేసి కొన వలయును.

ఈ క్రింది నకారాన్తమగు 'గుణిన్' అనెడి పుంలింగ శబ్దమును పరిశీలించి, తేజస్విన్, మనస్విన్, యశస్విన్ అను శబ్దముల యాయా విభక్తి - వచన రూపములను సమన్వయించుకొనునది. గుణిన్శబ్దమునకు గుణము గలవాడనియర్థము.

గుణీ - గుణినౌ - గుణినః
హే గుణిన్ - హే గుణినౌ - హే గుణినః
గుణినమ్ - గుణినౌ - గుణినః
గుణినా - గుణిభ్యామ్ - గుణిభిః
గుణినే - గుణిభ్యామ్ - గుణిభ్యః
గుణినః - గుణిభ్యామ్ - గుణిభ్యః
గుణినః - గుణినోః - గుణినామ్
గుణిని - గుణినోః - గుణిషు

ఈక్రిందినకారాన్తమగుగుణిన్ అనెడి నపుంసక లింగ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి స్రగ్విన్, వాగ్మిన్ అను శబ్దముల యాయా విభక్తి-వచన రూపములను సమన్వయించు కొనునది. గుణిన్శబ్దమున కిచ్చట గుణము గలది యని యర్థము.

గుణి - గుణినీ - గుణీని
హే గుణిన్ / హే గుణి } హే గుణినీ - హేగుణీని
గుణి - గుణినీ - గుణీని

మిగిలిన శబ్ద మంతయు పై పుంలింగ శబ్దము వలెనే యన్వయించుకొనవలెను. నపుంసకలింగశబ్దమున సంబోధనప్రథమా విభక్తిలో నేక వచనమునకు రెండు రూపములు గలవు. అవి, హే గుణిన్, హే గుణి అనునవి. పై పుంలింగ, నపుంసకలింగ శబ్దములకు గల సామ్య భేదము లను పాఠకులే పోల్చుకొని తెలిసి కొనునది.

ఈక్రింది శకారాన్తమగు 'విట్'అనెడి పుంలింగ శబ్దమును పరిశీలించి, దానినిబట్టి 'భ్రట్, మృట్' అను శబ్దముల యాయా విభక్తి - వచన రూపములను సమన్వయించుకొనునది.

విట్ - విశౌ - విశః
హే విట్ - హే విశౌ - హే విశః
విశమ్ - విశౌ - విశః
విశా - విడ్భ్యామ్ - విడ్భిః
విశే - విడ్భ్యామ్ - విడ్భ్యః
విశః - విడ్భ్యామ్ - విడ్భ్యః
విశః - విశోః - విశామ్
విశి - విశోః - విట్సు

ఈ క్రింది షకారాన్తమగు ద్విట్ అనెడి పుంలింగ శబ్దమును పరిశీలించునది.ద్విట్ఛబ్దమునకు శత్రువని యర్థము,

ద్విట్ - ద్విషౌ - ద్విషః
హే ద్విట్ - హే ద్విషౌ - హే ద్విషః
ద్విషమ్ - ద్విషౌ - ద్విషః
ద్విషా - ద్విడ్భ్యామ్ - ద్విడ్భిః
ద్విషే - ద్విడ్భ్యామ్ - ద్విడ్భ్యః
ద్విషః - దిడ్భ్యామ్ - ద్విడ్భ్యః
ద్విషః - ద్విషోః - ద్విషామ్
ద్విషి - ద్విషోః - ద్విట్సు

ఈ క్రింది షకారాన్తమగు 'సితత్విట్' అను నపుంసక లింగ శబ్దమును బరిశీలించి, దానిని బట్టి 'రత్నముట్'అను శబ్దమునకు సంబంధించిన యాయా విభక్తి - వచన రూపములను సమన్వయించుకొనునది. సితత్విట్ఛబ్దమునకు తెల్లని కాంతి గలది యని యర్థము.

సితత్విట్ - సితత్విషీ - సితత్వింషి
హేసితత్విట్ - హేసితత్విషి - హేసితత్వింషి
సితత్విట్ - సితత్విషీ — సితత్వింషి

మిగిలిన శబ్దము నంతయు ద్విట్ఛబ్దము ననుసరించి సమన్వయించు కొనవల యును.

ఈ క్రింది సకారాన్తమగు 'వేధస్' అనెడి పుంలింగ శబ్దమును పరిశీలించి దానిని బట్టి చన్ద్రమశ్శబ్దము నాయా విభక్తి - వచన రూపములలో సమన్వ యించుకొనన నగును. వేధ శ్శబ్దమునకు బ్రహ్మ యని యర్థము.

వేధాః - వేధసౌ - వేధసః
హే వేధః - హే వేధసౌ - హే వేధసః
వేధసమ్ - వేధసౌ - వేధసః
వేధసా - వేధోభ్యామ్ - వేధోభిః
వేధసే - వేధోభ్యామ్ - వేధోభ్యః
వేధసః - వేధోభ్యామ్ - వేధోభ్యః
వేధసః - వేధసోః - వేధసామ్
వేధసి - వేధసోః - వేధస్సు

ఈ క్రింది సకారాన్తమగు 'మనస్' అనెడి నపుంసకలింగ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి వయశ్శబ్దమును, పయశ్శబ్ద మును ఆయావిభక్తి-వచన రూపములలో సమన్వయించు కొనునది. మనశ్శబ్దము నకు మనస్సని యర్థము

మనః - మనసీ — మనాంసి
హే మనః - హే మనసీ — హే మనాంసి
మనః - మనసీ - మనాంసి

మిగిలిన శబ్ద మంతయు వేధశ్శబ్ద మును బట్టి సమన్వయించు కొనునది.

ఈ క్రింది సకారాన్తమగు శ్రేయస్ అనెడి పుంలింగ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి ప్రేయస్, గరీయస్ శబ్దముల యాయా విభక్తి - వచన రూపములను సమన్వయించు కొనునది. శ్రేయశ్శబ్దము నకు శ్రేష్ఠుడని యర్థము.

శ్రేయాన్ - శ్రేయాంసౌ - శ్రేయాంసః
హేశ్రేయః-హేశ్రేయాంసౌ-హే శ్రేయాంసః
శ్రేయాంసమ్-శ్రేయాంసౌ-శ్రేయసః

మిగిలిన శబ్ద మంతయు వేధశ్శబ్దము ననుసరించి సమన్వయించు కొనునది.

ఈ క్రింది సకారాన్తమగు శ్రేయస్ అనెడి నపుంసక లింగశబ్దమును పరిశీలించి, పుంలింగ, నపుంసక శబ్దములకు సామ్యభేద ముల నెన్నునది.

శ్రేయః - శ్రేయసీ - శ్రేయాంసి
హేశ్రేయః - హేశ్రేయసీ - హేశ్రేయాంసి
శ్రేయః - శ్రేయసీ - శ్రేయాంసి

మిగిలిన శబ్ద మంతయు పుంలింగ శబ్దము వలెనే సమన్వయించుకొనునది.

ఈ క్రింది సకారాన్తమగు విద్వత్ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి సేదివత్, ఉపేయివత్, తస్థివత్, అనెడి శబ్దముల యాయా విభక్తి - వచన రూపములను సమన్వయించుకొనునది. విద్వచ్ఛబ్దమునకు పండితుడని యర్థము.

విద్వాన్ - విద్వాంసౌ - విద్వాంసః
హేవిద్వన్ - హేవిద్వాంసౌ - హే విద్వాంసః
విద్వాంసం - విద్వాంసౌ - విదుషః
విదుషా - విద్వద్భ్యామ్ - విద్వద్భిః
విదుషే - విద్వద్భ్యామ్ - విద్వద్భ్యః
విదుషః - విద్వద్భ్యామ్ - విద్వద్భ్యః
విదుషః-విదుషోః - విదుషామ్
విదుషి - విదుషోః - విద్వత్సు

ఈ క్రింది హకారాన్తమగు 'లిట్' అనెడి పుంలింగ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి 'మహీరుట్' అనెడి శబ్దమున నాయా విభక్తి - వచన రూపములను సాధించు కొనునది. లిట్ఛబ్దమునకు 'ఆస్వాదించువాఁడు' అని యర్థము.

లిట్ - లిహౌ - లిహః
హే లిట్-హే లిహౌ-హే లిహః
లిహమ్ - లిహౌ - లిహః
లిహా - లిడ్భ్యామ్ - లిడ్భిః
లిహే - లిడ్భ్యామ్ - లిడ్భ్యః
లిహః - లిడ్భ్యామ్ - లిడ్భ్యః
లిహః - లిహోః - లిహామ్
లిహి - లిహోః - లిట్సు

ఈ క్రింది హకారాన్తమగు 'లిట్' అనెడి నపుంసక లింగ శబ్దమును పరిశీలించి, నపుంసక లింగ, పుంలింగ శబ్దములకు గల సామ్యభేదముల నెన్నునది.

లిట్ - లిహీ - లింహి
హే లిట్ - హే లిహీ - హే లింహి
లిట్ - లిహీ - లింహి

మిగిలిన శబ్దమంతయు పుంలింగశబ్దము ననుసరించి సమన్వయించుకొనునది.

ఈ క్రింది ధకారాన్తమగు 'క్షుత్' అనెడి స్త్రీలింగ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి 'యుత్' అనెడి శబ్దమును ఆయా విభక్తి - వచన రూపములలో సమన్వయించుకొనునది. క్షుచ్ఛబ్దమున కాకలి యని యర్థము.

క్షుత్ - క్షుధౌ - క్షుధః
హేక్షుత్ - హేక్షుధౌ - హేక్షుధః
క్షుధమ్ - క్షుధౌ - క్షుధః
క్షుధా - క్షుద్భ్యామ్ - క్షుద్భిః
క్షుధే - క్షుద్భ్యామ్ - క్షుద్భ్యః
క్షుధః - క్షుద్భ్యామ్ - క్షుద్భ్యః
క్షుధః - క్షుధోః - క్షుధామ్
క్షుధి - క్షుధోః - క్షుత్సు

ఈ క్రింది భకారాన్తమగు 'కకుప్' అనెడి స్త్రీ లింగ శబ్దమును పరిశీలించునది. కకుప్ఛబ్దమునకు దిక్కు అని యర్థము.

కకుప్ - కకుభౌ - కకుభః
హేకకుప్ - హేకకుభౌ - హేకకుభః
కకుభమ్ - కకుభౌ - కకుభః
కకుభా - కకుబ్భ్యామ్ - కకుబ్భిః
కకుభే-కకుబ్భ్యామ్-కకుబ్భ్యః
కకుభః - కకుబ్భ్యామ్ - కకుబ్భ్యః
కకుభః - కకుభోః - కకుభామ్
కకుభి - కకుభోః - కకుప్సు

ఈ క్రింది రేఫాన్తమగు (రకారాన్తమగు) 'గీః' అనెడి స్త్రీలింగ శబ్దమును పరిశీలించి, దానిని బట్టి 'పూః, ధూః' అనెడి శబ్దముల యాయా విభక్తి - వచన రూపములను సమన్వయించుకొనునది.

గీః - గిరౌ - గిరః
హే గీః - హే గిరౌ - హే గిరః
గిరమ్ - గిరౌ - గిరః
గిరా - గీర్భ్యామ్ - గీర్భిః
గిరే - గీర్భ్యామ్ - గీర్భ్యః
గిరః - గీర్భ్యామ్ - గీర్భ్యః
గిరః-గిరోః-గిరామ్
గిరి - గిరోః - గీర్షు

వెనుకటి పాఠమున 'అమ్భు' అనుటకు బదులు 'అమ్బు' అని సరిజేసికొనవలెను.

# మా స ఫ ల ము లు

## ( సెప్టెంబరు 1958 )

### శ్రీ 'బుధ'

[ ఏ సంవత్సరమున పుట్టిననూ, ఆయా తేదీల మధ్య పుట్టిన తేదీగల రాశిని బట్టి, ఫలము తెలిసికొనునది ]

గ్రహస్థితి : తులలో రవి. వృషభ, మిథునములలో కుజుడు. సింహ, కన్య, తులలలో బుధుడు. సింహ, కన్యలలో శుక్రుడు. తులా, వృశ్చికములలో గురుడు. ధనుస్సున శని. తులా మేషములలో రాహుకేతువులు. సింహములోయురేనస్ - వృశ్చికమందు నెప్ట్యూన్.

కుజశనుల సమసప్తకం = అయోధ్యనుండి దక్షిణప్రాంత ప్రదేశములందు యుద్ధ భయం. దుర్భిక్షం. ఈశాన్య భాగమందు భూకంపం.

రవి శనుల కేంద్రం = భారత రాజకీయ పరిస్థితులు మిగుల ఆందోళనకరంగా యుండును. విదేశములలో చెలరేగు ప్రచ్ఛన్న యుద్ధములలో చిక్కుకొనే సూచన.

సెప్టెంబరు 13 _ అతివృష్టి - తుపాను. నదులు పొంగి, భూమి జలమయ మగును.

## మే ష ము

మార్చి 21 నుండి ఏప్రిల్ 20 వరకు

గ్రహస్థితి అనుకూలం. మీ ఊహ, చింతనలు యదార్థములై సత్ఫలితాన్ని ఇస్తాయి. శత్రువులు పరాజయాన్ని పొందుతారు. 10 వ తేదీ పిమట్మ స్థితిగతులలో ఆధిక్యత, గౌరవం. కార్మికులకు, సైనికులకు డాక్టర్లకు ఇది మంచి కాలం. ఇతర వృత్తులవారికి కూడా వారి పనులలోఅధికఆదాయం,మనశ్శాంతి కలుగుతుంది. వర్తకులు సాహసించి ఎక్కువ పెట్టుబడులతో నూతన వ్యాపారములలో పాల్గొంటారు. వ్యాపారలాభం. నూతన నిర్మాణం, లేదా పునర్నిర్మాణాన్ని గురించి కొంత ధనం వ్యయమవుతుంది. నూతన వస్తువాహనము లేర్పడుతాయి. కొద్దిగా ఋణంకూడా అవుతుంది.

శత్రుస్థానములోనున్న రవి, బుధ, శుక్రుల వలన అనారోగ్యం, గృహకల్లోలం, విరోధం, లోకనింద మొదలగు అశుభ ఫలితాలు.

## వృ ష భ ము

ఏప్రిల్ 21 — మే 22

ఈ రాశివారికి కుజ కేతువులుమాత్రంచెడ్డవి. చిక్కులన్నీ క్రమంగా నమసిపోతాయి. తలవని తలంపుగా యత్నకార్యములు నెరవేరుతాయి. విజ్ఞానాత్మకంగా కృషి చేయువారికి, కళాకారులకు ఇది మంచికాలము. వృత్తి వ్యాపారాలలో ధనాదాయం, ఇతరులవలన కాగల పనులన్నీ ఆఖరు వారంలో పూర్తి జేసికోవాలి. 23వ తేదీ అనంతరం వర్తకులకు మంచి లాభం. శత్రువులు మిత్రులగుటకు యత్నిస్తారు. కోలుపోయిన సంఘబలం సమకూరుతుంది. కుజ, కేతువుల అశుభ స్థితివలన శారీరకంగా సుఖం ఉండదు. ఆకస్మిక ప్రమాదాలకు గురి అయ్యే అవకాశా లున్నాయి. తరుచుగా ప్రయాణాలు. కుటుంబపరిస్థితులు చీకాకు పరుస్తాయి. సంతతికి అనారోగ్యం. పొరుగు వారితో కలహం.

## మి థు న ము

మే 23 — జూన్ 21

గ్రహస్థితి మిగుల ప్రతికూలం. అంగారకుడు మంచి ఫలితాన్ని ఇవ్వడు. వ్యవహారిక, రాజకీయ ఆందోళనలు ఎక్కువవుతాయి. మానసికంగా వ్యాకుల పడుతారు. వివాదాలు రాగలవు. నెలాఖరులో అనారోగ్యం. ఈ కారణాలవల్ల మీ ఉద్యోగ వ్యాపారముల కెట్టి భంగమురాదు. వర్తకులు తమ వ్యాపారాన్ని 20 వ తేదీలోగా ముగించుకొనుట మంచిది.

లాభాన్ని ఆశించి నష్టాన్ని భరిస్తారు. చతుర్థములో రవి, బుధ, శుక్రు లుండుటచే సాహితీ వరులకు లాభం, బంధుసహాయం. 23 వ తేదీ సమ్మట సంతతికి అనారోగ్యం.

## కర్కాటకము

జూన్ 22— జూలై 22

ఈనెల 23 వ తేదీ వరకు గ్రహస్థితి అనుకూలం. బృహస్పతి మంచి స్థానానికి మారడంతో మంచిరోజులు ప్రారంభమవుతున్నాయి. అవరోధాలు తొలగే అవకాశాలు ఏర్పడుతాయి. నమ్మకంగా మీ నూతన ప్రయత్నాలు కొనసాగించుకొనవచ్చు. జయప్రద మవుతాయి. కుటుంబ విషయాలే ఎక్కువ ప్రాముఖ్యంగా చూచుకోవలసి వస్తుంది. భూమి - గృహవిషయాలలో మీ ఆలోచనలు ఫలిస్తాయి. సామాజిక జీవితం గౌరవ ప్రదంగా వుంటుంది. గొప్పవారి పరిచయం. మిత్రసహాయం. వృత్తి ఉద్యమాలలో ఆధిక్యత. వ్యాపార లాభం. సినిమా రంగములో వారికి మంచికాలం. 23 వ తేదీ సిమ్మట గ్రహస్థితి మంచిదికాదు. ఆర్థిక పరిస్థితికీ, ఆరోగ్యమునకూ భంగము కలుగుతుంది. ఆకస్మిక ప్రమాదములకు గురికావలసి వస్తుంది. మాతా పితరులకు మంచిరోజులు కావు.

## సింహము

జూలై 23 – ఆగస్టు 22

శుభాశుభ మిశ్రమ ఫలితం. రాజ్యమందం గారకుడు. రాజ్యాధిపతికి నీచస్థితి. ఈప్రభావం, మీఉద్యోగ వ్యాపారాది కృషులపై పనిజేస్తుంది. భంగకరమగు పరిస్థితులు ఏర్పడుతాయి. మీ ప్రజ్ఞా విశేషాలతో జయంమీదే అవుతుంది. పైగా లేని అవకాశాన్ని కూడా పొందుతారు. స్థితిగతులు స్థిరపడతాయి. భూమి గృహవిషయాలలో మీ ప్రయత్నములు నెరవేరుతాయి. కృషి, వ్యాపారాదులలో ధనాదాయం. సంగీత, సాహిత్య, చిత్రకళలలో పరిశ్రమచేయువారికి మంచికాలం. 23వ తేదీ సిమ్మట లాభకరమగు ప్రయాణం, ఇతర పట్టణ నివాసం.

## కన్య

ఆగష్టు 23 — సెప్టెంబరు 22

మీ సహజ విజ్ఞానం కళా రూపములో స్ఫుటపడి ప్రజారంజకమై, వ్యాపార రూపంలో చలామణియై ఆదాయాన్ని ఇవ్వాలి. అందుకై సర్వవిధాలా కృషి చేస్తారు. జయంపొందుతారు. జన్మరాశ్యాధిపతి వక్రగతి విడిచాడు. జ్ఞానాభి వృద్ధికిని, సాహిత్యానికీ, శిలత్వానికీ సహాయం. అసంపూర్తిగా వుండిపోయిన మీ కార్యకలాపాలన్నీ ఈ నెలలో పూర్తి అవుతాయి. ఉద్యోగ, వ్యాపార ధర్మములు సామాన్యంగా నడుస్తూ వుంటాయి. ఔషధ విక్రయదారులకు, డాక్టర్లకు మంచికాలం. జన్మరాశిలో ఉచ్చ నీచగ్రహాలురెండూ కలసివున్నాయి. ధన, భాగ్యాధిపతులకు నీచస్థితి. నెలాఖరులో మీ ఆర్థిక పరిస్థితులు ఇరుకున పడతాయి. మిత్రులతో విరోధాలు. భాగస్థులతో పేచీ. కుటుంబ పరిస్థితులు చీకాకు పరుస్తాయి.

## తుల

సెప్టెంబరు 23 – అక్టోబరు 22

కష్టాలలో మీ శక్తిసామర్థ్యాలు, మీధర్మాలు ఎంతవరకు పోషించుకో గలుగుతారో, ఒక్కసారి ఈనెలలో చూడా లనుకొన్నాయిగ్రహాలు. 15 వ తేదీలోగా బాధ్యతగల పనులు నెరవేర్చుకోవాలి. భయపడకండి. శుక్రుడు మంచి స్థానములో నుండి శని దృష్టికలిగి యున్నాడు. బంధుమిత్రుల సహాయంతో మీపని నెరవేరుతుంది. మీఉద్యోగ ధర్మములలో ఆటంకాలు వస్తాయి. వ్యాపారస్తులు అజాగ్రత్తగా సంచరిస్తే తలక్రిందు లవుతారు. నూతన ప్రయత్నాలేవీ కొనసాగవు. ధనవ్యయం - కుటుంబ కలహం-అనారోగ్యం. స్థానచలనం. 20 తేదీ మంచి ధన సప్తమాధిపతికి భాగ్యస్థితి వలన రావలసిన ధనం అందుతుంది.

## వృశ్చికము

అక్టోబరు 23 – నవంబరు 21

అంగారకుడు తప్ప మిగతా గ్రహాలన్నీ మిగుల అనుకూలంగా వున్నాయి. ప్రయాణ



వాన్ని, ఫలితాన్ని ఇచ్చే పనులు కొన్ని చేయ గలుగుతారు. ఉద్యోగ వ్యాపార విషయాలు జయప్రదం. లాభకరమగు ప్రయాణాలు. ఇతర పట్టణవాసం. ప్రజాదరణ. నూతనమైత్రి. మీ ప్రయత్నాలన్నీ 20 లోపుగనే ముగించుకోవాలి. తరువాత అంగారకుడు అష్టమస్థితిచే కొన్ని ఆటంకాలు కలుగుతాయి. కుటుంబకలహం. అనారోగ్యం.

## ధ ను స్సు

నవంబరు 22 — డిసెంబరు 23

జన్మరాశియందు శని వున్నా మిగతా గ్రహాలన్నీ మిగుల అనుకూలం. రాజ్యభావంలో రవి, బుధ, శుక్రు లుండుటచేత తలవని తలంపుగా కొన్ని సత్ఫలితాలు కలుగుతాయి. మీ అంచనాలన్నీ జయప్రద మవుతాయి. ఉన్నత పురుషుల సాంగత్యం. వృత్తిలో ఆధిక్యత. అదృష్టకరమైనస్థాన చలనం. సాహిత్యమున కీర్తి. గృహమందు శుభకార్య నిర్వహణ మొదలగు సత్ఫలితాలు కలుగుతాయి. తెగించిచేసిన మీ వ్యాపారములో నెలాఖరుకు మంచి లాభాలు వస్తాయి. దూరపు ప్రయాణం. షష్ట, సప్తమంలో అంగారకుడు శత్రు, వ్యవహారిక విజయాన్ని ఇస్తాడు. మీకు లేదా కళత్రంకు అనారోగ్యం. మేనమామలతో కలహం.

## మ క ర ం

డిసెంబరు 23 - జనవరి 20

గ్రహానుకూలంవల్ల, అన్ని చిక్కులు తొలగకపోయినా కొన్నిటిని మాత్రం సవరించుకో గలుగుతారు. అసంపూర్తిగా మిగిలిపోయిన కార్యాలు కొన్ని నెరవేరుతాయి. భాగ్యస్థానములోనున్న గ్రహాలను వ్యయమందున్న శని వీక్షించుటచే చర, స్థిరాస్తులలో కొంత నష్టం. వచ్చినధనంతో ఋణ చిక్కులు తీర్చుకొంటారు. గృహమందు శుభకార్యం. నూతన ప్రయత్నాలు చేస్తారు. 20 వ తేదీ పిమ్మట యత్నకార్య విజయం. గొప్పవారి సహాయం. ఉద్యోగ వ్యాపార ధర్మాలు స్థిరపడుతాయి. శత్రువులు మిత్రులవుతారు. వ్యాపారస్తులకు నెలాఖరులో మంచిలాభము. [illegible] చేయువారికి, శాస్త్రపరిశోధనలు చే[illegible] మంచికాలం. పంచమంలో అంగారక గ్రహస్థితివల్ల సంతతికి అనారోగ్యం.

## కు ం భ ము

జనవరి 21 — ఫిబ్రవరి 19

శుభాశుభ మిశ్రమ ఫలితం. ఉద్యోగ, వ్యాపార ధర్మముల ననుసరించి కొన్ని ఆటంకాలు కలుగుతాయి. తప్పుడు అంచనాలవల్ల నష్టపడటం జరుగుతుంది. ఇతరుల మోసకృత్యములచే లేక చోరులచే మీ ద్రవ్యము నష్టపడుతుంది. నూతన కార్యములు యత్నించినను ప్రయోజనము వుండదు. జరుగుచున్న స్థితిగతులను జాగ్రత్తతో చూచుకొనడం వుత్తమం. అష్టమంలో శుభ గ్రహాలున్నందున, ఆధ్యాత్మిక వికాసము, ఆరోగ్యము, ధర్మాసక్తి కలిగియుందురు. పండితులతో పరిచయం. ద్రవ్యం చేతికి వస్తుంది. శుభ సంబంధమైన ఖర్చు, స్థిరవసతుల ఏర్పాట్లకై ప్రయత్నములు.

## మీ న ము

ఫిబ్రవరి 20 - మార్చి 20

10 మొదలు 20 వరకు గ్రహస్థితి అనుకూలం. ఉద్యోగ, వ్యాపారాలలో అభివృద్ధి. జన్మరాశికి శుభగ్రహ దృష్టిచే వివాహాది శుభ కార్యాలు జరుగుతాయి. ఆభరణ ప్రాప్తి. మీ నూతన యత్నములు కొనసాగుతాయి. ఉద్యోగ వ్యాపారములలో అభివృద్ధి. వర్తకులు తమ వ్యాపారాన్ని 20వ తేదీలోగా ముగించుకొనుట మంచిది. సాహిత్యము, కళా, పరిశ్రమలనుగూర్చియు వ్యాపార విషయము గూర్చియు ఇతర ప్రదేశములలో వుండవలసి వస్తుంది. ఆఖరువారంలో అనారోగ్యం. గృహవిషయాలలో అశాంతి.



విశాలాంధ్ర అంతటా
విజయ వంతముగా
నడచుచున్న!



శ్రీ ప్రాడక్షన్సు

# మంచి మనసుకు మంచి రోజులు

★

ఎన్. టి. రామారావు
రమణ మూర్తి,
రేలంగి,
నల్లరామ మూర్తి.

★



★

రాజసులోచన, గిరిజ,
సూర్యాకాంతం.
నటించిన
గొప్ప
సాంఘిక
చిత్రం

★

* రైతులకష్టాలు; ఆధునిక యువకుని ఆదర్శప్రాయమైన జీవితవిధానం; విద్యాగర్వంతో కన్నుమిన్నెరుగక ప్రవర్తించిన యువతి జీవనగమనం చిత్రించిన చిత్రరాజం.

* మధురమైన పాటలు; చక్కిలి గింతలు పెట్టే రేలంగి మాటలు; రామారావు హావభావములతో నిండిన చిత్రరాజం. ప్రొడ్యూసర్ :- శ్రీ సుందర్ లాల్ నహాతా



రాజశ్రీ విడుదల

